# అంకితం



నా భార్య

భాగీరథికి



# శ్రీకారం

స్త్రీత్వం నిరంతర కాంతి స్రవంతి. ఆ వా నిలోని
ప్రతి తరంగమూ పరమానందమే!
దర్శించే మహాత్ముల హృదయ దర్పణాలలో ప్రతి
బింబాలు విభిన్నాలే!

అనురాగాల గారాల రాగాల కుమా ర్తె.
అందచందాల ఆటపాటల అండదండల సహోదరి.
అనంతామృతాల సుందర స్వప్నాల భార్య.
ఆశల ఆశయాల అభిమానాల అమ్మ.

వివిధ రూపాలతో, ఇతరేతరస్థలాలలో దర్శనమిచ్చే స్త్రీ, కారణాంతరాలవల్లనో, విధి విధానం వల్లనో, ఏ అదృష్టవంతుడికో, చెల్లిలా కనబడి, కన్నబిడ్డలా రూపుకట్టి, అమ్మలా ఆప్యాయత చూపించి, భార్యలా రూపందాల్చితే ఎలావుంటుంది? ఆమె జీవితం, ఆమె ప్రసాదించే జీవితాలు ఎలా వుంటాయి
సమాధానం "సౌభాగ్యవతి"

*

సౌభాగ్యం సౌందర్యం.
సౌందర్యం సత్యం.
సత్యం ఆరాధ్యం.

సౌభాగ్యవతి సంక్రమించే పసుపూ కుంకుమా, గాజూ, పూసా, మంగళసూత్రమూ, పూవూ, మట్టెలూ, బాహిర సౌందర్య పోషకాలు.

సౌభాగ్యంవల్ల బాహిర సౌందర్యం పొందిన స్త్రీ హృదయం ఆనందమయం. ఆనందం వల్ల ఆంతర సౌందర్యం. అది సత్యం. అందువల్ల ఆరాధ్యం.

ఆంతర బాహిర సౌందర్యజ్యోతి సౌభాగ్యవతి. ఆ సౌభాగ్యవతి సుందరరూపం నేత్రాలకూ హృదయ నేత్రాలకూ చూపే ప్రయత్నం "సౌభాగ్యవతి."

*

ఆచారం సాంప్రదాయికం.
ఆచారాలు అర్థవంతాలూ, అర్థరహితాలూను.
ఆలోచించే సహృదయులు అర్థాన్ని స్వీకరించి అనర్థకాన్ని తొలగించుకోవాలి.

కర కంకణాలు లేని స్త్రీ వడ్డించే అన్నం భుజించని ఆచారం, సౌభాగ్యంలేని స్త్రీ ఎదురయితే

అపశకునం అనే సంప్రదాయం, మట్టెలధ్వని లేని ఇంటిలో దారిద్ర్యం తాండవిస్తుందనే భావన, అర్థం లేనివి కాకపోవచ్చు.

అయితే, బాహిర సౌందర్యం కోల్పోయిన స్త్రీలో ఆంతర సౌందర్యం తొలిగిపోయిందనీ, ఆ స్త్రీ హృదయంలో అశుభం వుంటుందనీ, ఆచారాల అర్థం కావచ్చు.

కానీ, అమృత కలశం మీద మూతవేసినంత మాత్రాన పాత్రలో అమృతం లేదని అర్థంకాదు. బహిస్సుందరత పోయినంత మాత్రంచేత, అంతస్సుందరత తొలగింపబడాలని సిద్ధాంతంలేదు. ఒక్కొక్కప్పుడు ఆచారాలు అర్థశూన్యాలు.

భారతీయతతో పెనవేసుకుపోయిన ఈ సౌభాగ్యానికి క్రైస్తవులూ, మహమ్మదీయులూ, దూరంగావుంది. ఎందుకు ! ఎందుకు !!

హిందువులతో హైందవేతరులు భిన్నంగా వుండాలనా ! కావచ్చు !

ఆ మతాల జన్మస్థలాలలో ఈ సౌభాగ్య సంప్రదాయం లేకపోవటమా ! కావచ్చు ! కానీ, హిందూదేశంలో పుట్టిన క్రైస్తవులూ

మహమ్మదీయులూ హైందవులే! మమతలూ,

నమ్మకాలూ వేరయినా, ఒక్కటే మానవత్వం !
ఆచారం అర్థవిహీనమయితే ఆచారణా వ్యర్థం.
అర్థవంతమయితే ఆవశ్యం అనుసరణీయం.
సౌభాగ్య సంప్రదాయం అనాచారం కాదు. అర్థ
విహీనమూ కాదు. ఆ అయిదు తనాల గూర్చి
ఆలోచించే ఆలోచింపజేసే నవల "సౌభాగ్యవతి."

*

సృష్టికి అర్థంవుంది. ఆ అర్థం స్త్రీత్వం
పురుషత్వం.

అర్థానికి పరమార్థం వుంది. ఆ పరమార్థం
స్త్రీత్వం.

పరమార్థం పరాభవం పొందితే సృష్టి అర్థం
నాశన మవుతుంది.

ప్రపంచంలో యుద్ధాలు జరిగినా, క్రౌర్యాలు
పెరిగినా, మానవత్వం మంట గలిపినా, దానవత్వం
విశృంఖల విహారం చేసినా, సంఘాలు పతన
మయినా, సమాజాలు భిన్నమయినా, నిర్జీవ
జాతులు ఉద్భవించినా, ఉదాత్తజాతులు నేల
కూలినా, కుక్కమూతి పిందెలు పుట్టినా, కుక్క
గొడుగులు తలెత్తినా, ఉన్నతులు గతి తప్పినా,
ఉర్వి దద్దరిల్లినా, హెలెక్‌లు మారణ హోమాలు

సృజించినా, ఈవ్‌లు పాపాలు మోసి తెచ్చినా,
సీతలు లంకలు కాల్పించినా, ద్రౌపదులు
కురుక్షేత్రాలు చేయించినా, కారణం ఒక్కటే,
పరమార్థంపరాభవం పొందింది.

పరమార్థమే పరమాత్మ!
పరమార్థం గౌరవం పొందినచోట; ఆనందం
వెల్లి విరుస్తుంది, సౌందర్యం సజీవమవుతుంది,

ప్రకృతి లాస్యంచేస్తుంది, శాంతి పావురం అనంతా
కాశంలో స్వేచ్ఛగా విహరిస్తుంది, మానవత్వం
మహోన్నతమవుతుంది, దేవత్వం దిగి వస్తుంది.
లోకం స్వర్గలోక మవుతుంది.

సృష్టి అర్థగ పరమార్థం రేఖామాత్రంగా
వ్యక్తీకరించే నవల "సౌభాగ్యవతి."

*

జీవులు ఋణగ్రస్తులు.
ఏ ఋణమయినా ప్రయత్నిస్తే అందరూ తీర్చు
కోవచ్చు. కాని మాతృఋణం కొందరే తీర్చు
కొంటారు.

తాను మాతృమూర్తి అయి మాతృఋణం
తీర్చుకొంటుంది స్త్రీ! పురుషుడు సృష్టి ఆది

నుంచి ఋణగ్రస్తుడు !

పురుషుడు మేల్కొన్న క్షణంలో వినిపించే
గుండె చప్పుడు "సౌభాగ్యవతి"

*

స్త్రీకి ఆధిక్యం వుంది.
ఓర్పులో, పోషణలో, సంరక్షణలో, బాధ్యతా
నిర్వహణలో, కుటుంబపాలనలో, ధర్మ రక్షణలో
శాంతి సముపార్జనలో, సౌఖ్యసంపాదనలో, స్త్రీకి
ఆధిక్యం వుంది.

స్వార్థపరుడయిన పురుషుడు ఆధిక్యం గుర్తించ
లేదు. పోనీ కనీసం సమానతను అంగీకరించలేదు.
సమానత నిస్తే ఆధిక్యమే పుచ్చుకొనే స్త్రీ శక్తి
సామర్థ్యాలు గమనించి, పురుషుడు ఆమెని
అబల అనీ, అయోగ్య అనీ చిత్రించి తిరస్క-
రించరాదు.

పురుషత్వం లోకంలోని సగం కాంతిని తూల
నాడింది. ఫలితం సృష్టించి విచిత్రంగా తయా
రయింది.
శూన్యమే అయింది.

స్త్రీత్వాధికత్వాన్ని ఒప్పుకొంటే కలిగే శుభస్వా
మాయతున్న చరిత్రలో స్వర్ణాధ్యాయంగా ప్రభా

భాసుర మవుతుంది.
ఆ పరిణామం దిక్ ప్రదర్శనంగా చూపించే
నవల "సౌభాగ్యవతి"

*

స్త్రీత్వం పురుషత్వానికి పరిపూర్ణత్వం
స్త్రీ లేకపోతే పురుషుడికి అస్తిత్వం లేదు.
పురుషుడు లేకపోతే స్త్రీకి వ్యక్తిత్వం లేదు.
స్త్రీ పురుషులు లేకపోతే, సృష్టిలేదు. స్రష్టలేడు.

స్త్రీ శ్రీ.
భర్తకూ, గృహానికీ, సృష్టికీ, విశ్వానికీ, భగవానుడికీ

స్త్రీ శ్రీ.
శుభాలకూ, ఆనందాలకూ, చైతన్యాలకూ, ప్రపంచ
పురోగమనాలకూ, ప్రకృతి గమ్యాలకూ సర్వ
సాకల్యానికి సంకేతమయిన స్త్రీ శ్రీ.

స్త్రీ చిరంజీవి.

బిడ్డా పాపలతో పులకించేలమ్మలా, అన్నదమ్ములతో
అక్కా చెల్లెళ్ళతో ఆనందించే సోదరిలా, భర్త
అనురాగానికి అమరత్వం అనుగ్రహించే భార్యలా,
అమ్మా నాన్నలకు సంతోషం సృష్టించే బిడ్డలా.

శ్రీ చిరంజీవి.

కలశంలో తొణికిసలాడే అమృతంలా, ద్రుమాన్ని ఆధారం చేసుకొని పూలు పూసే తీవలా, పర్వత శిఖరాగ్రం నుంచి ప్రవహించి పర్వతప్రాంతమే పచ్చగా కనుల పండుగచేసే సెలయేరులా, శ్రీ చిరంజీవి.

తన సౌరభంతో తనకే పరిమళం తెచ్చే పూవులా, తన వెలుతురులో గుడి గోడలమధ్య దేవుడి ముఖంలో నవ్వు చూపించే ప్రమిదలా, తన చల్లదనంలో సూర్యకిరణాల వేడిసే మార్చే వెన్నెలలా, శ్రీ చిరంజీవి.

శ్రీ సౌభాగ్యవతి, "సౌభాగ్యవతి" చిరంజీవి !

అనంతపురం,
1–7–65.

"కాలకలూరి."

5

# సౌభాగ్యవతి

"నా హృదయం అనే కోటి దళాల పుష్పంలోని ప్రతి దళంతో నేనామెను పూజించుకొన్నాను నా హృదయం అనే కోటిరూపాయల నోటు మార్చుకొని ప్రతి పైసాతో ఆమెను కొనుక్కొన్నాను. గర్భగుడి లోపల ప్రతిష్ఠితమయిన ఆ విగ్రహం చెంతకు ప్రతి అడుగూ వెలలేని బలంతో వేసి కన్నీటి ముత్యాలతో పాదాభిషేకం చేసి, ఆ బొమ్మను పెకలించి హృదయాలయంలో స్థాపించు కొన్నాను మానవత్వపు విశాలతను ఆమె నుదుటి మీద తిలకిస్తూ ఆదమరచి పోయాను.

ఆమె గుండె మ్రోతల్లో నాహృదయ స్పందన మిళితం చేసి, రెండు ధ్వనులూ ఏకమై ఒకే ధ్వనిలా వినిపించే వరకూ నా కనురెప్పలు నిద్రకు దూరంగానే వున్నాయి. ఆమె నా జీవితమనే పూలతోటలో అభిమానంలా మొలకెత్తి ఆదరణలా తీగలు సాగి, ఆత్మీయతలా పూలుపూసి, ఆప్యాయతలా సౌరభం వెదజల్లి, సర్వం తానే అయిపోయింది.

ఇల్లునాది. అక్షరాలనాది. ఈఇంటిలో ఇటుక, సున్నంఅన్నీ నావి కాని విలేవు. నేను చూడకుండా ఒక్క ఇటుక ఈ గోడల్లో చేరలేదు. నాకు తెలియని వస్తువు ఈ గృహనిర్మాణంలో ఉపయోగించబడలేదు. ఈతలుపులు కిటికీలు, ఇనుంచెక్కలు అన్నీ నేను తెప్పించినవే! ఏ గది ఎలావుండాలో

ఏకిటికి ఎక్కడుండాలో, ఏతలుపుకు ఏ అలంకరణ వుండాలో, అంతా నిర్ణయించుకొంది నేనే! ఈ ఇంటికి ఇంజనీరుని, కంట్రాక్టరునీ యజమానినీ, నేనే!

ఈపూలతోట నేను నాటు కొన్నదే! ఎన్నిరకాల మొక్కలు ఎక్కడెక్కడి నుంచి తెప్పించుకొన్నానో నాకూ ఆమెకూ తెలుసు. ఏ తీగ ఎప్పుడు పూలు పూస్తుందో తెలుసు, ప్రతి ఉదయం ప్రతి మొక్కకూ నీళ్ళు పోయందే నాకు ఏపనీ చేయబుద్ధి పుట్టదు. అర్జంటుగా ఏరోగిని అయినా చూడవలసి వస్తే గబగబ మొక్కలకు నీళ్ళుపోసే రోగి దగ్గరకు వెళ తాను.

సన్నజాజులు హృదయం లోని పరి . ళం లాగా ఆనంద పరుస్తాయి. తెల్ల గులాబీలు సూర్యోదయం కాక పూర్వమే వికసించి, మంచుబిందువులతో మెరుస్తూ నవ్వుతూ తోటలోకి పిలుస్తూ వుంటాయి. ఎర్రగులాబీల రేకులు పసిపాపల పెదాలు లాగా బోసినవ్వులు నవ్వుతూ వుంటాయి. పందిరి మీద అల్లి బిల్లిగా అల్లుకొన్న మల్లెతీగలు గాలితోలి కదులుతూ పసిబిడ్డలయి అమాయకంగా చేతులు చాపి పిలుస్తూ వుంటాయి.

ఈ ఇల్లూ, ఈ పూదోటా, ఈమె, ఈ పిల్లలు అందరూ నా హృదయం అనే రిజర్వాయర్ నుంచి ప్రేమజలం పంచుకొన్నారు. ఆమె కోసం ఈ ఇల్లూ ఈపూదోట ఏర్పడితే, ఆమె తన హృదయాన్ని, తన జీవితాన్ని ఈ పిల్లలరూపంలో నాకు అనుగ్రహించినది.

ఈ ఇల్లు విడచిపెట్టి రోడ్డు మీదికి పోతే అక్కడున్న వంద మందిలో నేనూ ఒకడిని! అతిసామాన్యుడిని! రోగులకు ప్రాణదానం చేశా ననిపించుకొన్నా, పూలమాలలు వేయించు కొన్నా, మిత్రుల అభివందనలు స్వీకరించినా అవి నా సామాన్య వ్యక్తిత్వాన్ని తెలుపుతాయే కాని అధిక్యతను కాదు.

కాని ఈయింటిలో నేను మహారాజును. సామ్రాజ్యం హద్దులు ప్రహరీ గోడలే! నేను పాలించేది భార్యనూ, ఇద్దరు బిడ్డలనూ. ప్రజలుగా వాళ్ళ బాధ్యత నాహృదయం ఎరిగి ప్రవర్తించటం. పాలకుడిగా నా బాధ్యత వాళ్ళ అవసరం తెలిసి కొని నడుచుకొనటం. అది విపర్యయం కాదు. నాకుఎప్పుడు ఏంకావాలో అప్పుడుఅదే అందుబాటులో వుంచటం ఆమెకు తెలుసు రోగుల ఆరోగ్యం బాగుచేయటం ఆమెకు తెలుసు. ఆరోగ్యంగా వున్న నన్ను మరీ ఆరోగ్య వంతుడిగా చేయటం అంతకంటె బాగా తెలుసు. ఈ శరీరం, హృదయం అన్ని ఆమె అనుగ్రహించినవే! ఆమె డాక్టరుగా రోగులకు చేసే సేవ కంటే నాకు ఆమె చేసేసేవ తృప్తిగా వుంటుంది.

పిల్లల పెంపకంలో ఆమెకు ప్రత్యేకమైన నేర్పువుంది. వాళ్ళను చక్కగా తీర్చిదిద్ది భవిష్యత్తు పౌరులుగా తయారు చేయటం ఆమె పనే! పసివాళ్ళిద్దరూ నా హృదయం అనే రెండు చక్రాల తోపుడు బండిలో కూర్చుని నిర్విచారంగా కబుర్లు చెప్పుకుంటూ వుంటారు.

నేను చెప్పే మాటకు మాయింటిలో గౌరవంవుంటుంది. సనుగుడు వుండదు. మూలగటం ముక్కు చీదించటం, మూతి ముడవటం వంటివి ఏమీ వుండవు. నేను ఏదిచెబితే అది అక్షరాలా జరిగి తీరుతుంది. నా కది ఎంతో సంతృప్తి.

ఆమె హృదయంలో వున్న ప్రేమ అంతా ఆమె కళ్ళలో కనబడుతుంది. గుండె ఆర్ద్రమయినప్పుడు ఆమె నేత్రాలు మరీ కాంతివంతముగా వెలుగొందుతాయి. హృదయ సరోవరంలో పొంగిన అలలకదలికలాగా కనురెప్పలు కదులుతూ వుంటాయి. బాధా తరంగాలు రేగితేఉద్ధృతంగా చిందిన బిందువులు కనుకొలుకుల్లోంచి జారుతాయి. లోపల పొంగే ఆనందమూ, తృప్తీ మధురానుభూతీ, బాధా అన్నీ ఆమె కళ్ళలో కనబడుతాయి. అవును హృదయం గదికి కళ్ళు కిటికీలు.

ఆమెకళ్ళలో బాధా బాష్పాలు ఈ మధ్యకనిపించటం లేదు. కాటుక నల్లదనంలో కళ్ళ నల్లదనం మిళితమయి ఎర్రని ఆమె ముఖంలో నల్లదనం మెరిసిపోతూ వుంది.

పిల్లలు నా ఆనందానికి సంకేతాలు. వాళ్ళ ఉత్సాహం నన్ను చిన్న పిల్లవాడిని చేస్తుంది. వాళ్ళ అమాయక చూపుల్లో అనంత లోకాల సౌందర్యం కనబడుతుంది. పెద్ద పిల్ల సుజాతకు పదేళ్ళయినా నిండలేదు. ఫస్టుఫారంచదువుతూ వుంది. రెండోవాడు రవి ఆరేళ్ళకే రెండవ తరగతి చదువుతున్నాడు. అక్క అంటే తమ్ముడికీ తమ్ముడంటే అక్కకీ అంత ప్రేమ, స్నేహం, కలుపుగోలుతనం ఎలావచ్చాయో

నాకు తెలియదు ఆమెకు తెలుసునేమో, రవిపాలుతాగందేసుజాత తాగదు. అక్క అన్నం తినందే తమ్ముడూ తినడు స్కూల్‌కి ఇద్దరూ చెట్టా పట్టాలు పట్టుకొని పోతారు. స్కూల్ బేగ్స్ భుజాలకు తగిలించుకొని ఎగుర్లాడుతూ వెళ్ళే వాళ్ళిద్దరినీ చూస్తూంటే హృదయంలో ప్రేమ నిలువెత్తున పొంగి. దశదిశలూ వ్యాపించి పరవశింపచేస్తుంది. ఆడుకోటానికి వెళ్ళితే ఇద్దరూ కలిసే వుంటారు. అన్నందగ్గిర ఒకేసారి కూర్చుంటారు. ఒకే మంచం మీద పడుకొంటారు. ఎప్పుడూ విడిపోరు. అవును కళ్ళు రెండూ ఎప్పుడూ ఒకే చోట వుంటాయి. మనిషి స్థానం మారినా, కళ్ళు మాత్రం ప్రక్క ప్రక్కనే వుంటాయి.

వాళ్ళిద్దరూ నా రెండు కళ్ళు! వాళ్ళెక్కడుంటె నా కళ్ళు అక్కడే వుంటాయి. నిద్రించినా మెలుకువగా వున్నా, డిస్పెన్సరీలో వున్నా, ఇంటిదగ్గర వున్నా, వాళ్ళు నా కళ్ళముందో, హృదయ నేత్రాల ఎదుటో తారట్లాడుతూనే వుంటా నా కళ్ళను విడిచి వాళ్ళు కానీ, వాళ్ళను విడిచి నా కానీ వేరువేరుగా వుండవు.

అద్దంలో నా ప్రతిబింబం చిన్నప్పటినుంచీ చూ కొంటూనే వున్నాను. నా ముఖంలో క్రమక్రమంగా వచ్చే మార్పు అద్దం చూపుతూవుంది. ఆమె కళ్ళలో నా ప్ర బింబం చూడుకొంటే ఏ మార్పూ కనిపించదు ఎప్పుడూ ఒకే విధంగా కనబడుతుంది. పెళ్ళినాటి శోభ తరిగిపోకుండా క బడుతూవుంటుంది. ఆమె హృదయంలో నాకు వార్ధక్యం లేదు.

ఆమె కళ్ళలో నాకునిరుత్సాహంలేదు. అద్దంఅంటే నాకు ఇష్టం లేదు. అద్దం వాస్తవానికి సరైన ప్రతిబింబం, చూపుతుంది అందుకే ఇష్టంలేదు.

సుజా కళ్ళలోకిగానీ, రవి కళ్ళలోకిగానీ చూస్తే పసిపిల్లవాడిలాగా నారూపం కనబడుతుంది. వాళ్ళవయస్సు తోపాటే నావయస్సు పెంచుకొంటున్న పసివాడిని. వాళ్ళ నయనాలలోని అమాయికత తిలకించేటప్పుడు నా నేత్రాలలో అమాయికత పసితనం తొంగిచూస్తాయికాబోలు! కాకపోతే వాళ్ళ హృదయాలు వయస్సు నా హృదయం వయస్సు ఒక్కటేనేమో!

పిల్లలు కలగకపూర్వం నా కనుపాపల అద్దాలలో ఆమే. ఆమె నేత్రాల దర్పణాలలో నేనూ, ప్రతిబింబాలు దాచుకొంటూ వుండేవాళ్ళం. కానీ పసివాళ్లు పుట్టినతరువాత వాళ్ళకళ్ళలో మేం కనబడటం ప్రారంభమయింది ఒక్కొక్క ఒక బిడ్డ కంటిలో మాలో ఒక్కరే ముఖం చూచు ...టూవుంటే, రెండోమనిషి ముఖంకూడా కనబడుతూ వుంటుంది.

మా అమ్మానాన్నలు, అత్తమామలు గతించి చాలా కాల మయింది. అయితే మా కళ్ళలోకి చూచే బిడ్డలకు, ఆ గతించిన వారి ప్రతిబింబాలు కనబడుతూవుంటాయి. వాళ్లు - అమ్మా నాన్నలు - తమ ప్రతిబింబాలు మాలో దాచుకొన్నారు. ఈ కాలచక్రపు టిరుసుల్లో పడి మేమూ

సలిగి, గతించిపోతే, మా ప్రతిబింబాలు మా బిడ్డల మ ఖా లలో నిలిచేవుంటాయి. అదెంత ఆనందం !

మొదటి కాన్పుకు ఆమెనుపుట్టింటికో, అత్తవారింటికో, పంపమని మిత్రులు సలహా ఇచ్చారు. అప్పటికీ మాకెవరూ లేరు. అందరూ గతించారు. ఆమెకు అన్నదమ్ములూ అక్క చెల్లెళ్లు లేరు. నా తమ్ముడు ఒక్కడూ పరిస్థితుల ఒత్తిడికి శానిసఅయి కాలధర్మం చెందాడు. మరి ఎవరింటికి పంపు తాను ?

ఆమెకు నెలలు నిండుతున్నాయి. ప్రతితల్లీ బిడ్డలను కంటుంది. తల్లిదండ్రులనూ బిడ్డలనూ సృష్టించేది భగవంతుడే. అయినా ఒక నూతన ప్రాణిని ప్రపంచంలోకి పంపాలంటే, పరమాత్ముడయినా మాతృమూర్తిని ఆశ్రయించాలి. ఆ తల్లి దయా దాక్షిణ్యాలపైనే సృష్టికర్త లక్ష్యం నిక్షిప్తమయి వుంటుంది, ఆమె - ఆస్త్రీ - లేకపోతే దైవసృష్టికి ఉనికిలేదు. స్త్రీత్వం లేకపోతే దైవత్వమే లేదు.

ఆమె దైవత్వాన్ని తనగర్భంలో దాచుకొంది. ఆమెకు నేను చేయగలిగిన సేవ నా హృదయంలోని శక్తికి అతీత మయింది. ఆమెను ఏవిధంగానూ సత్కరించలేను. ఆమెకు ఆచర ణలో అనురాగాలలో, ఆత్మీయతలో సహానుభూతి కావాలి. కోర్కెలు కలిగితే తీరాలి మిత్రుల మాట పాటించి ఊరు మార్చి మరొక తావులో వుంచగలిగింది ఒక మహమూర్తి ఇంటిలోనే !

మధు నాకు తమ్ముడు వంటి వాడు. మనస్సు ఎరిగిన వాడు' గతమెలావున్నా ప్రస్తుతం నన్ను సంపూర్ణంగా అర్థం చేసుకున్నవాడు. ఈ విశాల విశ్వంలో నాకున్న ఆప్తమిత్రుడు ప్రియబంధువు. మూర్తి ఒక్కడే! నాకు మధుతో వున్న బాంధవ్యం ఏరూపంతోవున్నా, 'నా' అన్నవాడు అతనొక్కడే! మధుపట్ల నా ప్రేమకూ వాత్సల్యానికీ, మైత్రికీ, అనురాగానికీ అంతటికీ కారణం పద్మ. పద్మ గుర్తుకువస్తే శరీరం అనే వినీలాకాశంలో తటిల్లత మెరిసినట్లయి, ఆ తనువుల్లో చీకటి మారుమూలలలో మధుపట్ల ఉండే పవిత్రభావాలు తళుక్కున మెరుస్తాయి. సాధారణంగా భావాలను వెలిగించిన కాంతిని మరచిపోయి, ఆ భావాలను నెమరువేసుకొంటూ పునర్నవం చేసుకొంటూ వుంటాను. ఎప్పుడయినా మధును మరచిపోతే మనస్సు మెట్టుమీద పద్మ ఎదురై అతన్ని గుర్తు చేస్తుంది.

ఏస్థితిలో అయినా పద్మను మరచిపోతే వెన్నెముక నిచ్చెనమీదుగా ప్రాకి, హృదయములో పవళించి, కరాంగుళీ అంచలాలతో సుతారంగా నాభార్య హెచ్చరిస్తుంది. అదీ తప్పిపోతే నారక్తమే హృదయంలో ధ్వని చేస్తూ మోర్స్ కోడ్ లో మధుపేరు ముద్రిస్తుంది. ఒక్కమాటే చెప్పగలను. మధుని నేను మరచి పోలేను.

మధు కుటుంబలో ఆమె హాయిగా వుంటుంది. పంప వచ్చు. కానీ నాకూస్వార్థం వుంది.

కొన్ని సంవత్సరాల తపఃఫలంగా లభ్యమయిన భార్య, ప్రప్రథమంగా గర్భవతి, నాలోని నాకు తెలియని ఒక అందాల

రాసిని నాకు అందీయ బోతున్న పుణ్యవతి,- ఆమెను ఎక్క డికో పంపలేను. ఒంటరిగా ఉండలేను!

నాతోటలో నేను నాటుకున్న చినాకరి తీవ పెరిగి పెద్ద దయి పూవుపూస్తే దానినెవరోకాదు పూజకుతీసుకపోవలసింది. అది నా కిష్టంలేదు. ఆ పూవు నేనే అందుకొని, నా దేవుడి పాదాలపైనో, నా దేవత శిరోజాల మీదో వుంచితే తప్ప నాకు సంతుష్టిలేదు.

అందుకే ఆమెను ఎక్కడికీ పంపలేదు. ఇద్దరు బిడ్డలూ ఈ ఇంటిలో పుట్టారు. నా కోర్కె విచిత్రమయితే కావచ్చు. కాని దాని జన్మ సహజమయింది బిడ్డలు పుట్టి, పెరిగి పెద్ద వాళ్ళయి, జీవితంలో ఎన్నో మాటలు మాట్లాడవచ్చు. అయితే వాళ్ళ గొంతులోంచి వెలవడే మొదటిధ్వని మొట్ట మొదటి ధ్వని వినాలి. విని తీరాలి. అలా వినలేకపోతే నా జీవితం ధన్యమయినట్లు కాదు.

ఆమెను ఎక్కడికో పంపితే నేనా అదృష్టం కోల్పో తాను. పాపల మొదటి అరుపులో ఎంత సంగీతం వుంటుందో ఆ కోర్కె నన్ను జయించి, ఆమెను నిలిపింది.

బిడ్డలు పుట్టినప్పుడు ఏడ్చిన ఏడుపు, తీయగా, మనో జ్ఞంగా, కలకాలం నా చెవులలో నిలిచిపోయే మహత్తర దివ్య గానంగా ఎప్పుడూ వినబడుతూనే వుంటుంది. అప్పుడా ఏడుపు వింటూవున్న నా ముఖంలో ఎందరు చంద్రుల వెన్నెలలు ప్రాకారంగా, మరెందరు సూర్యుల తేజస్సమూహాం నన్నావ రించిందో నాకు తెలియదు. నాకు తెలిసింది. అంతా నా

శరీరం అప్పుడు చల్లబడిపోయింది. అంతలో వేడెక్కింది. మరుక్షణంలో చెమట పట్టింది. వళ్ళంతా వణికింది. హృదయంలో ఏవో తీగలు కదిలినట్టు అయింది

అయితే ఇప్పుడు చెప్పగలిగింది ఒక్కమాట మాత్రమే! ఆ బిడ్డలు పుట్టిన రెండు రోజులూ, నా జీవితంలో అత్యంత ప్రధానమయినవిగా గుర్తుంచుకొంటాను. ఆ రెండురోజులూ ప్రతిసంవత్సరం నాకు పండుగలు. దేశభక్తిగల భారతీయులకు రిపబ్లిక్ డే, ఇండిపెండెండేన్సుడే ఎంత ప్రాముఖ్యమయినదో ఆ రెండురోజులూ నాకు అంత ప్రాముఖ్యమయినవే!

నేనూ, నామూలంగా ఆమే, జీవితంలో, ఆరంభంలో తిన్న ఎదురుదెబ్బలు నాబిడ్డల భవిష్యత్తును నాశనంచేయకూడదు. ఆ ఉద్దేశంతోనే ఆమెనన్ను మదనపల్లినుంచి తీసుకు వచ్చింది ఉద్యోగం విడిచిపుచ్చి ప్రాక్టీసు పెట్టుకొందికూడా వీళ్ళకోసమే! వీళ్ళ జీవితం ఆనందంగా గడచిపోతేఅదేపదివేలు! అంతకంటే కావలసింది ఏమీలేదు.

నా కిప్పుడేం కొదువా లేదు. తలలో సన్నజాజుల్లో, మల్లెమొగ్గల్లో తాల్చుకొని, రెండు చేతులకూ చక్కగా గాజులు వేసుకొని నుదుటన కాసంత కుంకుమ బొట్టు పెట్టుకొని, మెడలో తాళి ముద్దుగా కదలుతూ వుండగా కాళ్ళ మట్టెలు సంగీతంగా ధ్వనిస్తూ వుంటే ఎదురయ్యే ఆమె నాకు ఆనందమే అందిస్తుంది.

నాకు ప్రాక్టీసు బాగావుంది. అనుకూలవతి అయిన భార్య వుంది. అందాల రాశులయిన బిడ్డలున్నారు ఈ చిన్న

న్సరీ, ఈ యిల్లు, ఈ బ్యాంకీఎకౌంట్ నాకు మానవత్వమే నేర్పుతున్నాయి.

నేను అదృష్టవంతుణ్ని. ఈ అదృష్టానికి అంతంలేదు. స్వర్గ మనేది వుంటే అది కుటుంబంలోనే వుంది. మనిషి హృదయంలోని నరకమనే మాలిన్యం జయిస్తే కుటుంబం స్వర్గంగా వుంటుంది. నాకు గర్వంవుంది. నా గర్వం అదృష్టం మైన ఆధారపడింది. అదృష్టం హృదయంతో పెనవేసుకు పోయింది. నాహృదయమే నన్ను అదృష్టవంతుడిని చేసింది. చాలు నా కీ తృప్తి. చాలు ఈ అభ్యోన్నతి.

## ౨

ఆ రోజు నేను అరటితోట మీద ఉదయించిన సూర్యుడ్ని చూడలేదు. వరిచేలల్లో పుట్టిన సూర్యుడ్ని చూశాను. మా యింటిముందు రెండు వాములమధ్య కూర్చుని వేపపుల్లతో ముఖం కడుక్కొంటూ కాదు చూచింది. అమ్మకూ నాన్నకూ మధ్య కూర్చుని కదలి పోతున్న రైల్లోంచి సూర్యుడ్ని చూశాను.

అప్పటికి నా వయస్సు పది సంవత్సరాలు. మా వూరిలో చెరువు గట్టుమీద బడిలో అయిదో తరగతి చదువు తున్నాను. మా అమ్మకూ నాన్నకు నేనంటే చాలా ఇష్టం. కాని పలక కావాలన్నా పుస్తకాలు కావాలన్నా వెంటనే ఇచ్చేవాళ్ళు కారు. అందుకు కారణం డబ్బు లేకపోవ

టమేనట ! బడికి పోవటమంటే నాకు పండుగలాగా వుండేది. శెలవులువస్తే నాకు బాగుండేదికాదు. గొడ్లకుసువు ఊడ్చటం పొలాల్లో మేపుకురావటం ఇష్టం వుండేదికాదు. ఆట లాడు కొనటం, అల్లరిగా తిరగడమే ఇష్టం ! గోళీకాయలూ, బిళ్లా కర్రా, రోజంతా ఆడినా తనివి తీరదు. వెన్నెల రాత్రులలో ఉప్పు పట్టీలు ఆడుతూ అలుపు ఎరక్క ఎంతో రాత్రి అయిం దాకా మైదానంలో వుండిపోయేవాడిని. రచ్చబండవద్ద, రావి చెట్టుక్రింద హరికథలు చెబుతూవుంటే ఇంట్లో నానారభసచేసి అక్కడికి చేరటమే ! చుట్టుప్రక్కల ఏ వూరిలో ఏ నాటకాలు వేసినా పోవలసిందే ! చెరువులో, వూరిప్రక్క పంటకాలువలో ఈదులాడటం చాలాసరదా ! ఇంట్లోవున్న వస్తూ - చిన్నమ్మ దుకాణంలో మిఠాయి ఎంతో ఇష్టం. ప్రొద్దున లేచింది మొదలు రాత్రిపడేదాకా ఆ ఇల్లూ ఈ ఇల్లూ అనకుండా వూరంతా తిరిగిరావడం దినచర్య ! రత్తయ్య వాళ్లతోటలో మామిడిచెట్టు పిందెలువేయటం ఆలస్యం ! ఉప్పుకారంతో మేమంతా అక్కడే తయారు! ఏపండుగవచ్చినా ఎంతో ఆనం దముగా వుండేది. దీపావళి చాలా ఇష్టం. ఎన్నో మందు సామానులు కాల్చేవాడిని. కాలువగట్టున ఎవరో ఎండేసిన గోగుపుల్లలు తెచ్చి దివిటీలు కట్టి త్రిప్పటం ఎంతో ఆనందం. కాలువలో చెరువులో దిగి ఈదులాడి ఒడ్డెక్కినతర్వాత ఒకరి ముఖాలు ఒకరం చూచుకొంటూ పెదవిక్రింద, గడ్డంపైన పట్టిన పాకుడు తుడుచుకోవటం, చేతులు జారుతూ నున్నగా ండేది. కాలువలో ఎండ్రకాయల్ని పట్టి బైట పారవేయ

వాటిని పట్టుకోబోయి కన్నాలలో చేతులు పెట్టి పాములిని బైటికి లాగటం, అది నెత్తురు వచ్చేటట్లు చేతిని కరవటం, అందుకు విరుగుడుగా ఇంత బురద తాగటం అంతా గమ్మత్తు! ఎండాకాలం గొడ్లను పొలాలలో తోలి, రోడ్డుమీద చింత చెట్లెక్కి కోతి కొమ్మచ్చులాడటం, కాళ్లూ వేళ్లూ విరగ బడటం, చింతకాయలు కోసుకోవటమో, రాళ్ళు రువ్వటమో చేయటం, ఎండుగుల్లలు రాలగొట్టి, గుల్ల తీసిపారేసి క్రొత్త చింతపండు తీయగా చీకుతూవుంటే చెట్ల పాటగాడు కర్ర తీసుకు వెంటపడటం పరుగెత్తుకుపోవటం, ఇంటిదగ్గర చీవాట్లు రావటం అంతా రివాజు !

ఆరోజు ఉదయం తెనాలిలో రైలుదిగటంలో మా స్వంతవూరుతో నా సంబంధం పూర్తయిపోయిందనే చెప్పాలి. ఆతరవాత పదిహేను సంవత్సరాలలో ఒకేసారి పోయాను. ఒకేరాత్రివున్నాను, అంతే !

తెనాలిలో మామయ్య పెద్దరైతు. ఏభై ఎకరాల మాగాణీ, అయిదెకరాలనిమ్మతోట, కొబ్బరితోటఅరటితోట వున్నాయి. పదెకరాల మెట్టకూడావుంది. పసుపు బాగా పండించ గలిగేది మామయ్యఒక్కడే! మార్కెట్టుఎప్పుడు బాగావుందో చూచి పసుపు అమ్మటంలో ఆయనకు ఆయనేసాటి! మా మయ్య పండించే పసుపుమూలంగానే లోకంలో ఎందరికో పసుపువుంది. దేవుడికి జరిగే పసుపుకుంకాల పూజకు కూడా ఆపసుపు ఉపయోగపడుతుంది. ఆ పసుపే లేకపోతే లోకంలో కొని వాళ్ళకు పసుపు ఎక్కడనుంచి వస్తుంది. మామయ్య

పండించే ధాన్యం లో కంలో ఎందరి కడుపులో నింపి, ఎందరి కో ఆకలి తీరుస్తుంది. ఆయన అంటే నాకెంతో ప్రేమ ! గౌరవం: భక్తి ! సీతారామయ్య అంటే మామయ్యేనని తెనాలి లో అందరికీ తెలుసు.

రైలు దిగి, రిక్షా ఎక్కి, మామయ్య ఇంటికి పోయే సరికి వరండాలో కూర్చొని వసుమతి ఆరున్నొక్క శ్రుతిలో గందరగోళం రాగంలో వీణ ముందేసుకొని దాని తీగలు సాగలాగుతూ గొంతు చించుకొంటూ వుంది. వసుమతి ఏడుపుకి మారు పేరు. అన్నం కావలసినా, అక్కరలేకపోయినా; నిద్రవచ్చినా, రాకపోయినా; స్నానం చేయమన్నా, వద్దన్నా; ఎవరయినా ఎత్తుకొని లాలిస్తూ బుజ్జగించకపోయినా; కొండ మీద కోతి కావాలంటే తెచ్చి యివ్వకపోయినా; చీమ కుట్టినా; పిల్లి అరిసినా; ఎవరయినా నవ్వినా, వెక్కిరిస్తే; వసుమతి తలుచుకొంటే, పంతంపడితే దాని పర్యవసానం ఏడుపే ! ఆమె ఏడుపు ప్రారంభిస్తే తెల్లవారుజామున కోడి అయినా కూయాలి, తెల్లవారిన తరవాత గాడిదయినా కూయాలి. అంతదాక ఏడుపుమాత్రం ఏ సంధి షరతులకు కూడా అంగీకరించి ఆపదు. నిద్ర లేచింది మొదలు నిద్ర పోయిందాకా ఎవరో ఒకరు ఏమేమో చెబుతూ, ఏదో ఒకటి తినిపిస్తూ, బుజ్జగిస్తూ, బతిమాలుతూ, భంగపోతూ ప్రాధేయపడుతూ ఆడిస్తూ వుండవలసిందే ! ఇందులో ఎక్కడయినా, ఏమాత్రం లోపంఅయినా జరిగితే ఉండ నేవుంది. తారకమంత్రం ఏడుపు ! గుక్క తిప్పుకోకుండా రెండు నిమి

పాలు వడ్డించడంటే అమ్మానాన్నలు జీతగాళ్ళు, పని మనుష్యులు అందరూ ఒకచోటగుమిగూడి అనేక ధర్మసన్నాహాలు పన్ని కుట్రచేసి, మాయచేసి, మభ్యపెడితే, అప్పటికిగాని వసు సంగీతం అవరోహణ క్రమంలో పడదు. అప్పటికీ ఇంటిల పాదికీ, చచ్చి పుణ్యలోకాలలో నిద్రపోతున్న తాతలూ, ముత్తాతలూ నిద్రలేచి, కళ్ళు నులుంకొని గబగబా దిగి వస్తారు. అధికారంతో, దౌర్జన్యంతో క్రోధంతో మహానుభావులే సాధించలేంది వసు ఏడుపుతో ఇట్టే సాధించితీసుకుంటుంది. మూడేళ్ల వయస్సులోనే ముల్లోకాలను గజగజ లాడించే నేర్పున్న వసును చూచిన తరువాత సీతా సావిత్రీ ఏమేమో ఏడుపుతో సాధించారంటే నమ్మలేక పోవడం అన్యాయమే ! ఒక్కగానొక్క బిడ్డ కావటంతో వసు ఆడింది ఆట పాడింది పాట అయింది.

వసు లేకలేక కలిగిన నలుసు – అప్పటికే మామయ్యాకు నలభైఅయిదు సంవత్సరాలు. వసు పుట్టిన రెండేళ్లకే అత్తమ్మకు పురుడు రావడం కాన్పు కష్టంకావటం, మగబిడ్డ పుట్టి పోవటం గర్భకోశం తీసివేయటం అన్నీ జరిగిపోయాయి ఇక బిడ్డలు పుట్టే అవకాశం లేకపోయింది. దానితో వసు ప్రత్యేకత ఆ యింటిలో మరీ స్పష్టమయింది. మామయ్యాను పెళ్ళి చేసుకోమని ఎవరెవరో సలహాఇచ్చినా ఆయన ఛాత్తేరి దూత్తేరి అని కస్సు బుస్సు మన్నాడట. ఇక అప్పటినుంచి దత్తత తీసుకోమని చెప్పే సలహాలు, ఆయన తీవ్ర గా ఆలోచించి నిర్ణయానికి వచ్చాడట.

వరండాలో కూర్చుని ఏడుస్తున్న వసు మేం రాగానే 'మాధవ వచ్చాడు మాధవ వచ్చాడు' ఏడుపుమాని అంటూ ఇంట్లోకి పరుగెత్తింది. అత్తమ్మ వెలుపలికి వచ్చింది. నుదుటన వసంతకుంకుమ దిద్దుకొని, ధర్మవరం నీలంచీరె పైటచెంగు బొడ్లోదోపుకొని 'రండమ్మా రండి' అంది. ఆమెఅంటే మా అమ్మ కారణంగా చాలా ప్రేమ ! 'అంతపుణ్యవతికి కడుపున కాయ కాయకపోవటమేమిటీ. మంచివాళ్ళకి రోజులులేవు. దేవుడికీ న్యాయంలేదు!' అనీ, 'నన్ను కన్నబిడ్డలాగా, సొంత చెల్లెలులాగా చూచుకొంటుంది' అనీ అమ్మ చెబుతూవుండేది. అత్తమ్మ నిండువిగ్రహం చూస్తే ప్రేమే ఆరూపంలో వుందనిపించింది. లక్ష్మిఅని ఏనాడు నామకరణం చేశారోగాని, ఆమె అచ్చం లక్ష్మీదేవిలాగావుంది.

'ఎందుకత్తమ్మా వసుమతి ఏడుస్తుంది.' అని అడిగితే రాత్రిఎప్పుడో నిద్రపుచ్చటానికి 'రేపు ఉదయం మాధవ వస్తున్నాడు. మీరిద్దరూ ఆడుకొందురుగాని' అని అత్తమ్మ చెప్పిందట ! అప్పటినుంచి 'ఏడీ మాధవ ? ఇంకారాలేదు ! ఎప్పుడొస్తాడూ! అన్నీ అబద్ధాలు, అని అర్ధరాత్రినుంచీ ఏడుపు ప్రారంభించి, ఏంచెప్పినా వినకుండా ఏడుపు ఆపటంలేదట. అయితే అమ్మకొంగుపట్టుకొని ఉంగరాలుతిప్పుతూ నిలబడ్డ వసుమాత్రం అప్పుడు ఏడవడంలేదు.

పిల్లలంటే నాకుఇష్టం. ఉత్తినే ఏడుస్తూవుంటే మాత్రం లాభం లేదు. తమ్ముడు సాధారణంగా ఏడవడు ఏడిస్తే 'నోర్ముయ్ వెధవా' అని అమ్మ కసురుకొంటే అయి

పోయింది! ఏడుపు మాని పిల్లిపిల్లలా అయిపోయి 'అన్నాయ్ అమ్మ తిట్టింది. అని చెబితే 'ఉత్తినేపడిస్తే తిట్టదేమిటీమరి' అంటే 'అయితే ఏడవను' అంటూ నాతో ఆడుకోనటానికి వచ్చేవాడు. వాడికిప్పుడు అయిదోఏడు!

వసుతో 'ఆడుకొందామా' అంటే 'ఊఁ' అంది. ఎత్తు కొంటే వూరుకొంది. 'నువ్వేనా మాధవ్! ఇప్పుడా వచ్చావ్- ఉదయాన్నే వస్తానని'—'వచ్చానుగా' అన్నాను.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి. అమ్మా అత్తమ్మా పెరట్లో కూర్చున్నారు. నేనూ వసూ ఇల్లంతా తిరిగి ఆను కొంటున్నాం. ఎన్నిబొమ్మలున్నాయో! గూటినిండా టేబిల్ నిండా, గదినిండా బొమ్మలే! రకరకాల బొమ్మలు కీ తిప్పితే ఆడే బొమ్మలు - కదిపితే తలవూపే బొమ్మలు - నెట్టితే నడిచే బొమ్మలు - రబ్బరు బొమ్మలు - చెక్క బొమ్మలు, కార్లూ, లారీలు, లక్కపిడతలు, అరటికాయలు, ద్రాక్షపళ్ళు ఎన్నో లెక్కలేదు. సైకిల్ - గుర్రం తోపుడుబండి కూడా వున్నాయి. బొమ్మలన్నీ చూపించింది. ఆడుకోటానికిఇచ్చింది. తనూ ఆడుకొంది. అసలు ఏడవలేదు. వసు చాలామంచిది. ఎంతో చక్కగా రంగు రంగులతో తిరిగే, నవ్వే ఏడ్చే, ఆడే అందాల బొమ్మలాగా కనబడింది వసు.

నాన్నతో ఏమేమో మాట్లాడుతున్నాడు మామయ్య. నాన్న 'అదెలా' అన్నాడు. 'వీలుకాదు' అంటున్నాడు. మామయ్య నాన్న చేతులు పట్టుకొన్నాడు. బెంగగా ముఖం

పెట్టాడు. ఇద్దరు దిగాలు పడిపోయారు 'మేం బ్రతకలేం' అంటున్నాడు మామయ్య. 'మేమూ అంతే! మేమూ బ్రతక లేం' అంటున్నాడు నాన్న. అదేమిటో అర్థంకాని వేదాంతం లాగా వుంది

అసలు మామయ్య ఎప్పుడూ నాన్నను బ్రతిమాలలేదు. ఎప్పుడయినా నాన్నే అమ్మను బ్రతిమాలితే, అమ్మ మామయ్యను బ్రతిమాలి, డబ్బో. ధాన్యమో ఇంటికి తీసుకు వస్తూ వుండేది మామయ్య మంచివాడేనట. మొదట్లో అమ్మను చాలా తిటాడట 'నీకర్మ నీద' వాడితో పెళ్ళి ఇష్ట మయితే నీ యిష్టం వచ్చినట్లు తగలడు – నీ కెంతో మంచి సంబంధం చూడాలని నేను తాపత్రయ పడుతుంటే నీ రాత ఇలా మండింది' అన్నాడట. నాన్నను అమ్మ పెళ్లి చేసు కోవడం ఏమాత్రం ఇష్టంలేదట. నాన్నకు ఆస్తి పాస్తులు లేవు. బీద కుటుంబంలో పుట్టాడు. పెళ్లిలో వచ్చిన కట్నం కానుకలు అయిదేళ్ళలో అయిపోయాయిట. అప్పటినుంచి ఎప్పుడు డబ్బు అవసరం అయినా, అమ్మవచ్చి మామయ్య దగ్గరునుంచి అంతో ఇంతో తెస్తువుండేది.

ప్రత్యక్షంగా అమ్మతో, పరోక్షంగా నాన్నతో ఎప్పుడూ బ్రతిమాలించుకొనే ఆయన, అంతగా బ్రతిమాలు తుంటే నాకే ఎంతో జాలివేసింది. నాన్న వీలులేదంటుంటే కోపం కూడా వచ్చింది. 'ఎందుకు వీలులేదు నాన్నా – వీలుం టుంది' అన్నాను వరండాలో, ఎలాగయినా వీలు చూచుకొని ఆయన కోరేది నెరవేర్చాల్సిందే ననే ధోరణిలో.

'మాధవ్' అంటూ నాన్న నన్ను గుండెలకు ఒత్తు కొన్నాడు. నాన్న ఎంతమంచివాడో, ఎప్పుడయినా కోపంతో కొట్టినా ఆయనంటే నాకు, నేనంటే ఆయనికి ప్రేమే!

'బాబూ! మాధవ్' అంటూ మామయ్య ముద్దుపెట్టు కొంటూ భుజంమీదికి తీసుకొన్నాడు. ఎంతో ఆనందం కలిగింది.

ఇద్దరూ దగ్గరకు తీసుకొన్నారు. గుండెలకు హత్తు కొన్నారు. ఇద్దరికీ నామీద ప్రేమవుంది. అయితే నాన్న తాకినప్పుడు కలిగిన ఆనందం మామయ్య అంటుకొన్నప్పుడు కలగలేదు.

'మాధవ్! నువ్వికక్కడే వుండి పోగలవా బాబూ!' అన్నాడు మామయ్య.

ఎప్పుడూ వీలులేదు అని ఎరుగని మామయ్యతో కాదన లేక 'ఉంటాను' అన్నాను.

'మాధవ్' అంటూ నాన్న కేకపెట్టాడు. కళ్లలో నీళ్లు తిరిగాయి.

'బాబూ' అంటూ మామయ్య తీసుకొని తొడమీద కూర్చోబెట్టుకొన్నాడు. అదేమిటో నాకు అసహజంగా అని పించింది. కాని ఆనందంగానేవుంది. ఆయన ముఖంమాత్రం ఆనందంగావుంది. అసహజంగా లేదు. అందుచేతే ఏదో తృప్తి!

నాన్న గొంతులో బాధ ధ్వనించింది. ముఖంలో దుఃఖం తెరలు నల్లగా పరుచుకొన్నాయి. కానీ కళ్లలో కొత్త కాంతి మెరిసింది. వాళ్లిద్దరిమధ్య దూరం క్షణక్షణానికీ ఎక్కువయి పోతున్నట్టుగా వుంది.

వసు ఏడుస్తూవుంది. ఎందుకో తెలియదు. మామయ్య నన్ను తొడమీద కూర్చోబెట్టుకోనడమో, నేను వరండాలో వదిలి రావటమో కారణం కావచ్చు. వెంటనే దగ్గరకుపోయి మూడుచక్రాల సైకిల్ మీద కూర్చోబెట్టుకొని తొక్కటం ప్రారంభించాను ఏడుపు మటుమాయమయింది.

సాయంకాలం...

అత్తమ్మా మామయ్య వరండాలో కూర్చున్నారు. ఆమె నమ్మలేనట్లూ, నమ్మి నిభాయించుకోనట్లూ వుంది. ముఖంలో సంతోషం తొణికిసలాడుతున్నా, శంక ఏ మూరు మూలో తొంగిచూస్తూవుంది. ప్రియమయిన అసత్యం సత్యంగా రూపుకడితే కలిగే నేత్రాంచలాల సంచలనం ఆమె శరీరం అంతా ప్రాకుతూవుంది. ఆ క్షణంలో ఆమె పసిపిల్లలాగా కన బడింది కళ్లు తడిఅవుతూ వున్నాయి.

అల్లరిచేసి, ఆడుతూ పాడుతూ వుండే పసివాడిని చూచి తల్లిదండ్రులు నవ్వినప్పుడు చిరుకోపంతో మూతిముడుచుకొని కూర్చుండే తీరులో మామయ్య కనిపించాడు. ఆయన గంభీరతలో ఎక్కడో వెలితి కనబడుతూవుంది. రోజూచూస్తే భయమూ, ఆశ్చర్యమూ కలిగించే ఆయన మీసాలు ఆరోజు

ఆడుకోటానికి తగినవిలాగా వున్నాయి. ఆయనముఖంలోని నవ్వు భావ విహీనంగావుంది.

'రంగయ్య అంగీకరించాడా ?' ఆమె అడిగింది.

"ఊఁ!"

"మరి అమ్మాయి."

"ఆఁ!"

"మాధవ!"

"వాడు అంగీకరిస్తేనే వాళ్ళిద్దరూ ఊఁ అంది."

అత్తమ్మ తృప్తిగా గాలి పీల్చుకొంది. ఆ గాలిలో ఏ లోపం జరిగిందో కాని ముక్కుపుటాలు స్పందించాయి. పెదాలు అదిరాయి,

"నాకు మగబిడ్డలు లేనిలోపం తీరిపోయింది' అంటూ అత్తమ్మ కళ్ళొత్తుకుంది.

అదేసమయంలో ... ...

పెరట్లో అమ్మా నాన్న ఒకేవిధంగా కూర్చొనివున్నారు. ముళ్ళమీద కూర్చున్నట్లుగా కూర్చున్నారు. వాళ్ళ ముఖాల్లో దైన్యం కనబడుతూవుంది. ఎవరూ నోటివెంట మాట పలకలేకుండా వున్నారు. క్రుంగిపోయారు. ముఖాలలో చీకట్లు కదులుతున్నాయి. కాని, చీకటిరాత్రిలో వినీలాకాశంలో మెరిసే నక్షత్రాలు లాగా వాళ్ల కళ్లలో చాలాదూరంలో ఏదో తళుకులు కనబడుతున్నాయి.

'ఏం చేద్దాం?' అంది అమ్మ.

'అదేమంచిది' అన్నాడు నాన్న.

'నా కెందుకో భయంగావుంది,.

'ఏం అక్కరలేదు.'

'ఏమో.'

'వాడిపేరట ఆస్తి వ్రాయమనిచెప్పాలి.'

అన్నయ్య మంచివాడు. అలామనం అడక్కూడదు. అడిగితే శాస్త్రోక్తంగా దత్తతతీసుకుంటాడు. మాధవకి మన యింటి పేరు లేకుండా పోతుంది. పెంచి పెద్దచేసి కూతురు నిచ్చి పెళ్ళిచేసే అవకాశంకూడా పోతుంది. డబ్బూ దస్కం మాట ఎత్తకండి అన్నయ్య బాధపడతాడు. ఏపరిస్థితుల్లోనూ బాబుకి అన్యాయం చేయడు.

'నీ యిష్టం!'

తెల్లవారింది. అమ్మా నాన్న మావూరు పోవటానికి సిద్ధమవుతున్నారు. నన్ను బయలుదేరమని ఎవరూ చెప్పటం లేదు. అది నాకు సంతోషంగానూ, బాధగానూ వుంది.

అమ్మ అడిగింది. నువ్వు ఇక్కడేవుండి పోగలవుట్రా అని. 'ఓ' అని చెప్పేశాను.

'నా బాబుని కన్నబిడ్డలాగా చూచుకో అన్నయ్యా' అంది అమ్మ కళ్లు ఒత్తుకొంటూ. మామయ్య మాట్లాడలేదు. అత్తమ్మ చెప్పింది. 'నా కొడుకు లాగా చూచుకొంటానమ్మా.'

'అక్కా! నా బిడ్డను నీ చేతుల్లో పెడుతున్నాను. వాడిని పెంచి పెద్దచేసి, ఒక యింటివాడిని చేసి, పుణ్యం కట్టుకోండి. ఈ యింటిలో వాడికి ఏ బాధా వుండదు. అంటుంటే నాన్న గొంతులో జీర వినబడింది. అంతలో మామయ్య 'పెళ్లిచేసి ఆస్తి అంతా వాడికే ఇస్తాను. మీరు నిశ్చింతగా వుండండి' అన్నాడు.

రెండు నిమిషాలు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరి గొంతులు మూగ పోయాయి. భరించలేని త్యాగం చేయటం, భరించరాని త్యాగాన్ని అందుకోవటం ఎవరికీ చేతకావటంలేదు. వసూ నేనూ ఆడుకో దలుచుకొన్నాం.

చివరికి అమ్మానాన్న రిక్షాలో ఎక్కి, వెళ్ళిపోతుంటే– నన్ను విడిచిపెట్టి – నా కెందుకో చాలా దుఃఖం వచ్చింది. పెద్దగా ఏడ్చాను. అమ్మానాన్నా వెళ్ళిపోయారు. అత్తమ్మ, మామయ్యా ఎత్తుకొన్నారు.

# 3

'అన్నయ్యా.'

వసుమతి వచ్చింది.

'అన్నయ్యా.'

భుజం పట్టుకు కుదిపింది.

'నేను అన్నయ్యను కాదు.'

కోపంతో చెప్పాను.

'ఏమిటి?'

'బావని!'

వెర్రిగా ముఖం మాడ్చుకొని, అదోమాదిరిగా చూచి, బాధగా అడిగింది.

'ఏమిటి?'

'అన్నయ్యను కాదు. బావని'.

తీక్షణంగా జవాబు చెప్పాను.

'ఎందుక్కాదూ?'

'కాదు. అంతే! బావనే'

'బావవా!' కళ్ళు సుతారంగా తిప్పుతూ ముఖం అష్టంగా పెట్టి విచిత్రంగా వింతగా కళ్ళుమూస్తూ తెరుస్తూ చూచి, నమ్మలేనట్లు, పచ్చి అబద్ధం చెబుతున్నట్లు తల ఆడిస్తూ 'ఊహుఁ!' అంది.

'బావనే'!

కసితో, కోపంతో, బాధతో, అవమానంతో దిగులుతో ఏడుస్తూ చెప్పాను.

'కాదు. అబద్ధం'

స్థిరసత్యం కనుకొన్నట్లు, అందులో శంక అణుమాత్రం లేనట్లు చెప్పింది.

'నిజం వసూ! నేను నీకు బావని'

వసు నమ్మలేని నిజాన్ని ఎలా చెప్పేది. ఎలా అర్థం చేసుకొంటుంది.

"కాదు. అన్నీ అబద్ధాలు. నాన్నమీద కోపం వచ్చి నన్ను తిడుతున్నావు. సరేలే అమ్మతో చెబుతానుండు."

కళ్ళు తుడుచుకుంటూ వసు లోపలికిపోయింది.

నేను అబద్ధంచెప్పలేదు. నిజమేచెప్పాను. వసు నమ్మలేదు. నమ్మేపరిస్థితిలోకూడా లేదు. గడిచిన మూడు ఏళ్ళలో అన్నయ్యననేకాని అన్యభావం లేదు. ఎప్పుడు ఏమీ చెప్పని నేను ఇవాళ అలా ఎందుకు చెప్పాను. కారణం మామయ్యే! ఆయనే ఇలా చెప్పేటట్లు చేశాడు. అనవసరంగా నన్ను అనరాని మాట లన్నాడు

ఆయనమీద చాలా కోపం వస్తూవుంది. అవునులే! పేదవానికోపం పెదవికిచేటు! ఆయనమాత్రం ఏమన్నాడు. ఉన్నమాటేగా! మరినాకు ఉలుకెందుకు'- ఆయన అబద్ధం చెప్పలేదుగా! అయినా నన్ను తిట్టాడు వాళ్ళఎదుట అవమాన పరిచాడు. వాళ్ళకు ఎంత చులకన అయిపోతాను. అదే

మీ ఆలోచించకుండా ఇష్టం వచ్చినట్లు చెప్పేశాడు. జవాబు చెబితే అంతపని చేశాడు.

సరేలే! నాన్నతో చెప్పి ఏమిటి! నాన్న వచ్చి నిలదీసి అడిగితే ఏం చెప్పతాడో చూడాలి. అమ్మకూడా రావాలి. 'ఎందు కన్నయ్యా ఇంతపనిచేశావు'. అంటే నోరుమెదపలేక బాధ పడుతూ 'తప్పయిపోయింది లే' అని తప్పించుకో చూస్తాడు. అదేం చెప్పటానికి వీల్లేదు. ఎంతమంచివాడు అయితే మాత్రం నన్నెందుకు కొట్టాలి. అమ్మ నాన్నలే కొట్టాలి గాని. ఇంకెవరో ఎందుకు కొట్టాలేమిటి!

ఈ చెంపవాచిపోయింది. ఎంత ఎత్తు ఉబ్బిందో! ఏం చేసినా వసుని ఎప్పుడయినా కొట్టాడా! నేనంటే ఎంత తేలికో! నన్నురక్షించేవాళ్ళులేరని ఎంతదెబ్బకొట్టాడు! అత్తమ్మకూడా రాలేదు. నాన్నతో చెప్పవలసిందే! లేకపోతే ఇంకా ఎన్నిసార్లు అయినా కొడతాడు.

అసలు నాన్న నన్నిక్కడ వదిలి వెళ్ళక పోయినట్లయితే ఎంతో బాగుండేది. తప్పంతా నాదే! నేనిక్కడే వుండటం వాళ్ళకు ఏమాత్రం ఇష్టంలేదు. నేనే కోరికోరి ఉంటానని చెప్పి, ముప్పు తెచ్చుకొన్నాను. తప్పు లేకపోయినా అమ్మా నాన్నలమీద ఎంతో కోపం వస్తూవుంది. మామయ్యమీద కుత్తుకదాక వుంది మంట! అత్తమ్మకూడా చూస్తూ వూరుకొంది. వసు అప్పుడేమీ అనలేదు కాని, ఇప్పుడు మాత్రం ఓదార్చటానికి వచ్చింది; ఏమీ నేరనట్లు పాపం! అయినా నేనేంచేశానని నన్ను కొట్టాలి. ఏంతప్పు చెప్పానని!

వాళ్ళు మామయ్యకు స్నేహితులు అయినా కాకపోయినా నాకేమిటి? వాళ్ళ వెంటవున్న చిన్నపిల్లవా-- మధుమూర్తి అయితేమాత్రం నాకేం సంబంధం? మామయ్య ఆయన స్నేహితుడూ చిన్నతనంలో పెళ్ళిళ్ళు కాకపూర్వం 'మనకు పెళ్ళిళ్ళు అయినతరవాత పిల్లలు పుట్టినప్పుడు నాకు మగపిల్లవాడుగానీ, ఆడపిల్లగానీ, నీకు మగపిల్లవాడుగానీ, ఆడపిల్లగానీ వయస్సు కుదిరేవాళ్లు పుడితే కట్నం కానుకలు తీసుకోకుండా ఆదర్శంగా వివాహం చేయాలి. అని ఒప్పందం కుదుర్చుకొంటే మాత్రం నాకేం అవసరం!

ఇద్దరికీనీ, ఏనాడో అనుకొన్న మాటలు గుర్తుంచుకోవలసిన అవసరంలేదు. కాని ఆయన ఆనాటిమాట గుర్తుంచుకొని, నీ కూతుర్ని, నాకొడుకు మధుకి చేసుకొంటాను అని ఆవూరునుంచి ఈవూరు వచ్చి చెప్పటంలో ఎంతో ఔదార్యం వుంది. పైగా ఏనాటి ఒప్పందానికో కట్టుబడి, కట్నం గిట్నం లేకుండా వసుమతిని కోడల్ని చేసుకొంటానని చెబుతుంటే మామయ్య అర్థం చేసుకోకుండా ఎందుకుండాలి? "మనకు ఇంకా పిల్లలులేరని. ఉన్న ఆస్తిఅంతా కూతురికే చెందుతుందని, ఆస్తికోసం పెళ్లిమాట ఎత్తుతున్నాడు గానీ, లేకపోతే ఈ రోజుల్లో ఇంత త్యాగం - ఈ పిసినారి చేస్తాడని నేను నమ్మను" అని మామయ్య అత్తమ్మతో చెప్పినమాట అక్షరాలా నిజమయితే మాత్రం మధు తండ్రిచెప్పినమాటల్లో ఔన్నత్యం లేదూ! అదేమీ ఆలోచించడేం మామయ్య!

మధుతో వసుమతి పెళ్ళి చేయటం ఇష్టంలేకపోతే నేను మా అమ్మాయి పెళ్ళివిషయంలో ఇప్పుడేమీ చెప్పలేను. పెరిగి పెద్దది కావాలి అప్పటిమాట ఇప్పుడెందుకనో అలా కాకపోతే మీ అబ్బాయికి మా అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేయననో తేల్చి చబితే పోయేదిగా. అలా ఎందుకు చెప్ప లేదు.

పోనీ అలా చెప్పలేదంటే అది ఆయన ఇష్టం కానీ ఇలా చెప్పటంకూడా ఆయన ఇష్టమేనా ? నన్ను చూపి "వీడు మాధవ్ - మాచెల్లి కొడుకు - చాలా తెలివైనవాడు - బావమరిదికి మాట ఇచ్చి వీడిని పెంచుకొంటున్నాను పెద్ద వాడయిం తరవాత నా కూతురినిచ్చి పెళ్ళిచేసి, ఆస్తి అంతా వాళ్ళకు ఇచ్చి వాళ్లు ఆనందంగా వుండటం అయినా చూచి సంతోషించాలనీ, నా చెల్లి నానుంచీ. మానుంచీ దూరమయి పోయి, అనేక బాధలు పడుతుంటే చూడలేక, ఆమె బిడ్డ నయినా ఒకడిని మాలో చేర్చుకొని, వాడిఆనందం చూచి చెల్లే ఆనంద పడుతున్నట్టుగా గర్వించాలని నేను కోరుకొం టున్నాను" అని మామయ్య చెప్పటం, కంట నీరు పెట్టటం నాకేమీ బాగాలేదు

మధుమూర్తి తండ్రి ఎంతో మంచివాడు. అంత మంచి వాడు నన్ను క్షేమగా దగ్గరకు తీసుకొని, అప్యాయంగా భుజం తట్టి, మర్యాదగా పలకరిస్తే, మర్యాదలేకుండా నేను ఎలా జవాబు చెప్పాలి ! ఆయన నీపేరేమిటంటే మాధవ్ అనే చెప్పాను. అబద్ధం ఏమీ చెప్పలేదు. మీ నాన్న పేరేమి

టంటే రంగయ్య అని చెప్పలేదు. సీతారామయ్య అని చెప్పాను. అదిమాత్రం తప్పు చెప్పానా? - మా అమ్మా నాన్నల దగ్గరున్నంచి మా బిడ్డలాగా చూచుకొంటామని కదూ అత్తమ్మ తీసుకొంది నేను వీళ్ళ కొడుకునుకానూ? మామయ్య నాన్నలాంటి వాడు కాడూ! అత్తమ్మ అమ్మ లాంటిది కాదూ? నేను అమ్మా అని పిలిస్తే అత్తమ్మ పలకటం లేదూ? అయితే నేను చెప్పిన అబద్ధం ఏమిటి? తప్పేమిటి!

"తప్పుడు వెధవా! అబద్ధాలుఆడకు" అని మామయ్య హీనంగా కఠినంగా కోపంగా తిట్టటం ఎందుకు. నాకంటే చిన్న వాడు మధుమూర్తి ఎదుట నన్ను అలా తిడతాడా! కొడుకునయితే అలా తిట్టేవాడేనా? అన్యాయంగా తిట్టినట్లు కాదూ! నాకు ఎంత రోషమో వచ్చింది, ఎంత కోపమో వచ్చింది. ఏం లాభం?

మధుమూర్తి వాళ్ళ నాన్న లాలనగా "అయితే నువ్వు వసుమతిని పెళ్ళి చేసుకొంటావా?" అంటే ఎట్లా చేసు కొంటాను. ఎందుకు చేసుకొంటాను. చేసుకోను" అని చెప్ప టంలో అయినా ఏం తప్పువుంది. అన్యాయంగా, అనరవాంగా వసుమతిని పెళ్ళాడుతాను అని చెప్పలేదే! దుర్మార్గంగా ఆస్తి అంతా కోరుకోలేదే! నా హద్దు ఎరక్కుండా నేను అత్యాశ పడలేదే!

అంతలో మామయ్య "నువ్వు వసుని పెళ్ళిచేసుకో వుట్రా మాధవ్" అని అడగటం ఎందుకు? అడక్కపోతే ఎంతో బాగుండేది ఆడినమాట ఎలా తప్పుతాను. ఒకసారి

ఒకమాట చెప్పి మరొకసారి మరొకమాట ఎలా చెబుతాను. అందుకే 'పెళ్ళి చేసుకోను' అని కచ్చితంగా చెప్పేశాను. నిజానికి మామయ్య ఎంతో సంతోషించవలసింది. గుండెలకు హత్తుకొని ముద్దాడి వుండవలసింది. అదేమీలేకుండా గుడ్లెర్ర చేసి, పళ్ళు నూరుతూ, గబగబా లేచి వచ్చి. "పరాయి వెధవా పరాయి మాటలు మాట్లాడుతున్నావు" అంటూ ఆ చెంపా ఈ చెంపా ఎడా పెడా ఇష్టంవచ్చినట్లు సావిట్లో వుండే పోట్లగిత్తను జీతగాడు చెర్నాకోలతో బాదినట్లు కొట్టాడు.

నాన్న నన్ను ఇలా తిట్టేవాడేనా? ఇంతగా కొట్టే వాడేనా! అసలు మామయ్యకు ఎందుకు కోపం రావాలి. కోపం వస్తే మాత్రం అంత పెద్ద పెద్ద దెబ్బలు కొట్టాలా! నేను ఏడుస్తుంటే ఎవరూ ఏడ్వవద్దని చెప్పలేదు. ప్రతిమాల లేదు. అత్తమ్మ దగ్గరకు రాబోతుంటే మామయ్య ఏదో అన్నాడు. ఆమె రాకుండా లోపలికి పోయింది. మధుమూర్తి వాళ్ళ నాన్నా వెళ్ళిపోయారు

ఈ సావిట్లోకి వచ్చి, రెండు గంటలయింది. వసు తప్ప ఎవరూ రాలేదిటు. వసు 'అన్నయ్యా' అంటే కోపం వచ్చింది. నేను అన్నయ్యను కానసీ, బావననే కదా మామయ్యకొట్టింది. మరి అన్నయ్యా అంటే నేనెందుకు పలకాలి? ఎందుకు జవాబు చెప్పాలి? అందుకే అన్నని కానూ బావనీ అని జవాబు చెప్పాను.

వసు ఏడిస్తే నాకెంతో బాధగా వుంటుంది. ఏడ్వకుండా చేయటానికి ఎన్ని ఆటలయినా ఆడించి, గమ్మత్తులు చేసేవాడిని. చివరికి నవ్వించేవాడిని. ఇప్పుడు నన్నెవరూ నవ్వించటం లేదు. ఎవరయినా అంటే నవ్వుదామని వుంది నాకు, కాని వసు ఏడుస్తూ వెళుతుంటే ఏమీ అనలేక పోయాను. దెబ్బలు తిని కుయ్యో, మొర్రో అంటుంటే ఎవరూ బ్రతిమాలలేదు. వసు వచ్చింది బ్రతిమాలటానికే నేమో అయితే నేనేమీ వినలేదుగా!

వసుకి అన్నయ్యా అనే పిలవాలని ఉబలాటం. బావ అని పిలవటం తెలియదు. ఎవరూ నన్ను ఇలా పిలవమని చెప్పలేదు. మొదట్లో వసు నన్ను 'మాధవ్' అని పిలిచేది. ఆరోజు వాళ్ళ స్కూలులో జరిగిన సంఘటనే వసుని నన్ను అన్నయ్యా అని పిలిచేటట్టు చేసింది.

వసు ఒకటో తరగతిలో చేరింది. నేను హైస్కూల్కి పోతూ ఎలిమెంటరీ స్కూల్లో దిగబెట్టి, వచ్చేటప్పుడు వెంట బెట్టి తీసుకువస్తూ వుండేవాడిని. ఒకరోజు తిరిగి రావడం ఆలస్యమయింది. వచ్చేసరికి పద్మా, వసూ గట్టిగా తగాదా పడుతున్నారు. వసుని "నాకు అన్నలులేరు తమ్ములులేరు. అక్కలు లేరు. చెల్లెళ్ళు లేరు" అంటూ వుంది పద్మ.

'నీకేలేరు' అంది వసు.

"నాకందరూ వున్నారు – నీకే లేరు – పప్పుసుద్ద పప్పుసుద్ద" అని ఎగురుతూ వుంది పద్మ.

'మాధవ్ - మా అన్నయ్యా - అన్నయ్యా ఉన్నాడు-నువ్వే గంగిరెద్దు గంగిరెద్దు' అంటుంది వసు.

'మాధవ్ మీ అన్నకాదు - వెర్రిముద్దు - వెర్రి ముద్దు'.

'మాధవ్ మా అన్నయ్యేను - మట్టిముద్ద - మట్టి ముద్ద'.

'కాదు - కాదు - కానేకాదు. పచ్చిపులుసు - పచ్చి పులుసు'.

'అవునూ అవును - పప్పులో కాలూ - పప్పులో కాలు'

ఇద్దరికీ మాటలు పూర్తయిపోయి, ఒకరినొకరు ముక్కుతో నాలుకతో వెక్కిరించు కొంటున్నారు.

నన్ను చూడటంతో ఏడ్పు అందుకొంది వసు. నాకు ఆవజీవాలు క్రుంగిపోయాయి. ఓదార్చాను. బ్రతిమాలాను. ఏడ్వవద్దని వారించాను. ఎంత చెప్పినా వినకుండా ఏడుస్తూ వుంది. పద్మ ఎగతాళి చేస్తూ చింకులేస్తూ శివాలు తొక్కుతూ జడా మెడా, లంగా ఊగేటట్లు ఎగురుతూవుంది.

కారణం కనుక్కొనేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. వసుని ఏడవకుండా చేయటానికి 'నేను నీకు అన్నయ్యానే. ఎవరో ఏమోఅంటే నువ్వేడవటం ఎందుకు అన్నానో లేదో, వసు కళ్ళు తుడుచుకొంటూ ముక్కుపుటా లెగరేస్తూ తల వెంట్రుకలు పైకి నెట్టుకొంటూ "ఊహూ అన్నయ్య. ఇదుగో మా అన్నయ్యా - నువ్వే పప్పు సుద్ద - నువ్వే వెర్రిముద్దు;

నువ్వే పన్నసుద్ద - నువ్వే వెర్రిమొద్దు! అంటూ పద్మ చెప్తూ గింజులు వేయటం ప్రారంభించింది

నిజానికి నేను బావని కాని, అన్ననుకాను. అలా చెబితే వసు ఏడుస్తుంది ఏడిస్తే ఒకపట్టాన ఊరుకోబెట్టటం నాకే కాదు మామయ్యకే కాదు, బ్రహ్మకుకూడా తరంకాదు. అందుకే మా ఇష్టానిష్టాలు ఎలావున్నా, వసు కోరినట్లు జరగాలి జరిగి తీరాలి.

ఉన్నట్టుండి పద్మ ఏడ్చింది. ఎందుకో తెలియదు. మేం ఇద్దరం విరోధులం ఎదురుగా వుండటంవల్లనో, లేకపోతే తన మాట నెగ్గలేదనో, లేకపోతే తను తెలుసుకొన్న సత్యం అసత్యమయిందనో, మరి నేను అబద్ధం ఆడాననో ఎందుకో గట్టిగా ఏడ్చేసింది ఆమె కళ్ళు నులుంకొంటూవుంటే నా పై ప్రాణం పైనే పోయింది. ఏడ్వవద్దని చెప్పాను. పద్మ వినలేదు. కళ్ళు తుడిచాను. అయినా వెక్కి- వెక్కి- ఏడుస్తూనేవుంది. బ్రతిమాలినా వినలేదు. వసుకి అన్నను కానని చెబుదా మనుకొన్నాను. వసుకి కోపం వచ్చినట్లుగా వుంది. ఆ కోపం ఏడుపు రూపం ధరించబోతూవుంది. ఏం చేయాలో తెలియ కుండా అయిపోయింది. పద్మను తల నిమిరి ఏడవ నద్దని చెప్పాను.

అంతలో వసు 'అన్నయ్యా వెళదాం రా' అంటూ నా చేయి పట్టుకు లాగింది. అలా పిలుస్తుంటే ఒకవైపు ఆనం దం మరోవైపు బాధా నన్ను చుట్టుముట్టాయి. అకస్మాత్తుగా నాకు తమ్ముడు గుర్తుకొచ్చాడు. ఒకప్రక్క ఏడూపు, ఇంకో

ప్రక్క నవ్వు వినబడుతున్నాయి. వసు జయించింది. పద్మ ఓడిపోయింది. 'పద' అంటూ పద్మనే చూస్తు వసు వెంట నడచి పోయాను

వసుకి దుఃఖం కలక్కుండా సంతోషం కలగటానికి అప్పుడు సంతోషంగా అన్ననసే చెప్పాను. ఇప్పుడు అన్న అనవద్దనీ బావ అనమనీ, బాధ పెట్టాను. నేను ప్రత్యేకంగా కల్పించిన కష్టమేమీ కాదిది. వాళ్ళ బిడ్డనుకానట. చెల్లి కొడుకునట. మరి నేనేమీ చేస్తాను. అంతా ఆయనే చెప్పాడు చేయికూడ చేసుకున్నాడు.

వసు కూడా నన్ను ఓదార్చలేదు. అత్తమ్మరాలేను మామయ్య సరేసరి! అమ్మా నాన్నలు అంతకంటే! నే నెవ రికి కాకుండా పోయాను. నా కెవరూ లేరు.

ఈ సావిట్లో నేను ఎంతో సంతోషంగా తిరుగుతూ వుండేవాడిని. ఇప్పుడు చెప్పలేనంత కష్టముతో వున్నాను. చెంప వాచిపోయింది. దవళ్ళు నొప్పి పుడుతూవుంది. నన్ను పలకరించే వాళ్ళే లేరు.

ఈ సావిడి, ఈ పశువులు, ఈ మేత, ఈ పరిసరం అంతా నాకు పరిచితమయిందే! ఇదంతా ఆడుకొంటూవున్న స్థలమే! ఎప్పుడూ ఒంటరిగా ఇంతసేపు ఇక్కడ కూర్చోలేదు. ప్రతిక్షణమూ ఉత్సాహంతో తిరుగుతూ ఉండేవాడిని. ఇప్పు డంతా నిరాశా, బాధా! మునుపు ఎక్కువసేపు ఇక్కడుంటే పిలవటం ఇంట్లోకి రమ్మని ఎవరయినా పిలిచేవాళ్ళు. ఇప్పుడు

లేదు. నే నెవరికీ అవసరం లేదు. నన్నెవరూ గుర్తించుకోరు. ఎవరూ పట్టించుకోరు. .

అమ్మా నాన్నలకే గుర్తులేకుండా పోయాను అత్తా మామలకు మాత్రం ఏం లెక్క! ఆడుకొంటూవుంటే నాతో పాటు ఆడుకొంటూ తిరిగే ఆ లేగదూడ కూడా దగ్గరకు రాకుండా అక్కడే పడుకొంది. ఆవు దిగాలుగా నావైపు చూస్తూ వుంది. అమ్మ కళ్ళలోని ఆప్యాయత ఆవు కళ్ళలో కనబడుతూవుంది. నా బాధ ఆవుతో చెప్పుకోలేను. చెప్పు కొన్నా వినిపించదు. అర్థంకాదు. ఆవు ఓదార్పు నాకు బోధ పడదు - ఈ మూగ బాధకు అంతంలేదు.

సాయంకాలం కాఫీ టైం అయింది. రమ్మని ఎవరూ పిలవలేదు. నేను పోకపోతే ఎవరికేం నేనంటే ఎవరికేం లెక్క! అమ్మ ఏం చేస్తుందో - నాన్న ఏం చేస్తున్నాడో - తమ్ముళ్ళెలా వున్నారో ఇప్పుడు? ఏమయినాసరే! మావూరుపోవల సిందే! అంతే!

# 4

రైలు బయలుదేరింది. ఇక భయంలేదు గంటలో వూరు చేరుకోవచ్చు. అరగంటలో ఇంటికే పోవచ్చు. బహుశా అమ్మ పడుకొనివుంటుంది. నాన్న సావిట్లో పడుకొని వుండ వచ్చు. నాన్నని లేపకూడదు. నిద్రచెడితే ఆయనకు చెడ్డ కోపం. అమ్మనే పిలుస్తాను. తలుపు తీస్తుంది. నన్ను చూచి

ఆశ్చర్యపోతుంది. అప్పుడు కళ్ళు తడి అవుతాయి. దీపం కొంచెం ఎత్తి వెలుతురులో నా ముఖం చూచి 'పెద్దగా ఏడుస్తుంది. నాన్నకూడా వస్తాడు. ఏం జరిగిందిరా అని అడుగుతాడు. అంతా చెబుతాను. ఉదయమే రైలుకి తెనాలి పోయి 'పిల్చి వాడిని గొడ్డును బాదినట్లు బాదుకొంటూరా ఎక్కడయినా, అని తిడతాడు. 'మా పిల్లవాడు మాకు బరువా మీకు బరువయితే' అని అడిగేస్తాడు. మామయ్య నోరెత్తలేకపోతాడు! 'మావాణ్ణి మేమే చదివించుకొంటాంలే, మీరేమీ చదివించనక్కరలేదు' అని నిక్కచ్చిగా చెప్పివేస్తాడు. అప్పటినుంచి నాన్నే నన్ను చదివించి.........అలావద్దు. ఇలా చెప్పాలి. ప్లాటుఫారం మీద కాలు జారి పడ్డాను. చెంపలకు దెబ్బలు తగిలి వాచిపోయాయి. అని చెప్పాలి. పోగానే అమ్మతోనే చెబితే నాన్న నిద్ర లేవడు. అదే మంచిది.

అయితే నువ్వు అర్ధరాత్రి – ముందుగా చెప్పకుండా – ఎందుకు వచ్చావురా అని అడిగితే అమ్మకు ఏం చెప్పాలి? ఊరికినే వచ్చానంటే అమ్మ నమ్మదు. మిమ్మల్ని చూచి పోవటానికి వచ్చానంటే 'ఇప్పుడా' అంటుంది.

వీలయినంతవరకు ఏమీ చెప్పకుండావుంటే మంచిది. అమ్మ తలుపు తీయగానే నా కెంతో నిద్రగావుందని చెప్పి, గబగబా అమ్మ ప్రక్కమీద పోయి పడుకొంటే, ఆమె పైట చెంగు కప్పి పొట్టమీద చేయి వేసి, ఆప్యాయంగా నిమిరి 'నిద్రపోరా' అంటుంది. హాయిగా నిద్రపోతాను. పొద్దున్నే లేచి

గాడవకో, అరటి తోటలోకో పోయి అన్నంవేళకి రావచ్చు. అప్పటికి చెంపల వాపు తగ్గిపోతుంది. ఏ ప్రశ్నలు ఉండవు.

ఒకవేళ అమ్మ మంచంమీద తమ్ముడు పడుకొనివుంటే నాన్నదగ్గర పడుకొంటాను. నాన్నఅయితే దుప్పటి ఎంతచక్కగానో కప్పుతాడు. ఎన్నో కథలుచెబుతాడు. నేను చెప్పటం ప్రారంభిస్తే 'నిద్రపోరా రేపుచెబుదువుగానీ' అంటాడు. వెంటనే నిద్రపోతాను.

నాన్న పొలంపోయివుంటే పెద్దమంచం ఖాళీగా వుంటుంది. అమ్మ పక్కవేస్తుంది. నేను పడుకొంటాను. తమ్ముడినికూడా నాదగ్గరే పడుకో బెట్టుకొంటాను, వాడికి నేనే దుప్పటి కప్పాలి. వాడు మునగర దీసుకొని కాళ్ళమధ్య తల పెట్టుకొని నిద్రపోతాడు. నడిజాముస నిద్దట్లో రెండు కాళ్ళు తెచ్చి నా గుండెలమీద పడేస్తాడు. 'వెధవా సరీగ్గా పడుకో' అని తిడతాను. వాడు నిద్దట్లోనే వినీ వినకుండా దూరంగా జరిగి అటు తిరిగి పిల్లి పిల్లలాగా నిద్రపోతాడు. నాకెంతో ముద్దు వస్తుంది. వాడిమీద చేయివేసుకొని నిద్రపోతాను.

, రైలులో బఠానీలు అమ్ముతున్న వాడిని చూచేసరికి నాకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. రెండణాలు జేబులో వున్నాయి. అవి టిక్కెట్టు తీసుకోగా మిగిలాయి. రెండు అణాలు పైకి తీసి ఒక అణా బఠానీలు ఒక జేబులో, ఇంకో అణావి రెండో జేబులో పోయించుకున్నాను. లిక్కరు జేబులోవి తమ్ముడికి, చొక్కా జేబులోవి నావి.

నా బఠానీలు తింటున్నాను. ఆకలి అవుతూవుంది. ఉదయం తిన్న అన్నమే! కాఫీకూడా తాగలేదు. ఇంక నా దగ్గర డబ్బులుకూడా లేవు. ఎంత ఆకలి అయినా, నా బఠానీలు అయిపోయినా, తమ్ముడి బఠానీలు నేను తినకూడదు. వాడు నువ్వూ తిను అన్నా ఇంటిదగ్గరయినా వాడి బఠానీలు తినకూడదు.

ఇంటికి పోగానే అర్ధరాత్రి అయినా అమ్మ అన్నం తినమంటుంది. లేదమ్మా ఇప్పుడేగా తిని వచ్చాను అని చెబుతాను. అయినా ఫరవాలేదులే. తిను అంటుంది. అమ్మ అడిగినందుకే తింటున్నట్లు నాకు ఆకలిగా లేనట్లు, కొంచెం అన్నమే తిని కంచం దగ్గర్నుంచిలేస్తాను. అప్పుడు అమ్మ కేమీ తెలియదు.

ఏమేమో ఊహించుకొంటూ వుండేసరికి రైలు మావూరు పొలిమేరల్లోకి రానేవచ్చింది. పంటకాలువ వచ్చేసింది. రేపు వుదయమేవచ్చి, చాలాసేపు యీదులాడాలి. జట్టు అందరినీ తీసుకువచ్చి, తెనాలి ఎంతపెద్దదో, యెన్ని మేడలున్నాయో, ఎన్నిరోడ్లున్నాయో ఒకచోట మూడు కాలవలు ఎలావుందో, పద్మ ఎంత మంచిదో, వసు ఎంత వెర్రిదో అన్నీ చెప్పాలి.

ఇక తెనాలి పోనసీ, వాళ్ళతో పాటేవుండి పోతాననిచెప్పవలసిందే! ఎన్ని ఆటలయినా ఆడుకోవచ్చు.

ఊరు విడిచిపెట్టి మూడు సంవత్సరాలు అయింది. ఎప్పుడూ రాలేదు. రావలసిన అవసరమే కలగలేదు ఎప్పు

డయినా అమ్మనూ నాన్ననూ చూడాలనిపిస్తే; మామయ్యతో ఆమాట చెప్పటమే ఆలస్యం, రెండు రోజుల్లో అమ్మా నాన్నా వచ్చేవాళ్ళు. వారం పదిరోజులు తమ్ముడితో నాదగ్గరే వుంచేవాళ్ళు. మొదట్లో నెలకు రెండు సార్లయినా వస్తుండే వాళ్ళు. క్రమక్రమంగా ఒక్కసారి రావటం ప్రారంభించారు. తరువాత రెండు నెలలకు ఒక్కసారే ! అది నాకేమంత బాధ కలిగించలేదు.

కానీ; తామరాకులుండే చెరువూ, పీతలుండే కాలువా, చింతకాయలరోడ్డు, దేవుడిగుడివెనుక మైదానం, చింతకాయల రోడ్డు, ఇంటిముందు వేపచెట్టు - ఇలాంటివి తెనాలి రాలేవు. వాటి దగ్గరకే నేను పోవాలని తెలుసు. అయితే మామయ్య మాత్రం మాధవ్ ఆవూరు ఎందుకులే వస్తే పాడయిపోతాడు అనటంతో వూరు రావటమే కుదరలేదు.

ఎలా అయితేనేం ఇప్పటికి సాధ్యమయింది. రేపు ఉదయమే లేచి వేపపుల్లతో ముఖం కడుక్కోవాలి. పండ్ల పొడివల్ల నోటికి రుచి తప్పిపోయింది. చద్దిఅన్నం తినివేయాలి. కాఫీ ఫలహారాలకంటే పెరుగులో చద్ది అన్నం ఎంతోరుచిగా వుంటుంది. అన్నంతిని, అరటితోటలోకి, అక్కడనుంచి రోడ్డు మీదికి, తిరిగి కాలువగట్టుకి, ఆపైన చింతల తోపులోకి, తరవాత చెరువుగట్టుకి, గుడి మైదానంలోకి అంతా చుట్టి రావాలి.

రైలు ఆగింది. కంపార్టుమెంటు కిటికీలోంచి వెలుపలికి చూశాను. మావూరే! దిగటానికి భయంవేసింది. ఇంటి దగ్గర

లేకపోవటంతో వసు దగ్గర అర్ధరూపాయి తీసుకోవటంలో అంతా తెలుసుకొని మామయ్య జీతగాళ్ళను రైలుదగ్గరకు పంపాడేమో, వాళ్ళు రైల్లో వచ్చారేమో, నేను దిగగానే రండి బాబు మీకోసమే వచ్చామంటూ పట్టుకొని తెల్లవారు జామున వచ్చేరైల్లో ఇంటికి తీసుకుపోతారేమోనని భయం కలిగింది.

ఏమయితే అదేవుతుంది. లెమ్మని ధైర్యంచేసి రైలు దిగాను. చుట్టూచూశాను. ఎవరూ వచ్చినట్లు కనిపించ లేదు. రైలు వెళ్ళిపోయింది. స్టేషన్ అంతా చీకటిగా వుంది. అంతకుముందే వెలిగించిన లైట్లు పోర్టర్ పోయి ఆర్పి వేస్తు న్నాడు. ఆ బండిలో నలుగురే దిగారు మునసబుగారు తప్ప ఎవరూ నాకు తెలియదు. మునసబుగారి జీతగాడు లైటు వెలి గించుకొని వచ్చాడు. పెన్సింగు అవతల నిలబడి వున్నాడు. చాలా రాత్రి పడింది. దూ ర ం గా వూరంతా నిద్ర పోతూవుంది. నాచుధ్వని వినబడుతుంది. మిణుగురు పురుగులు తిరుగుతూ వున్నాయి. ఒక్కటి రెండుచోట్ల ప్రమిదల వెలు తురు తప్ప వూరంతా చీకటిగా వుంది

మునసబుగారి వెంట నడుస్తున్నాను. చుట్టూ తాటి చెట్లు జతలు దయ్యాలులాగా వున్నాయి. క్రింద నేల పగిలి కోపు తేలి కాళ్ళకు గుచ్చుకొంటూ వుంది. రెండుఎడ్లబళ్ళ చక్రాలు దొర్లి డొంకంతా ఎత్తు పల్లాలుగా అయింది. మున సబుగారి నీడ అడ్డం అయినప్పుడు, బళ్ళ గాడిలో కాళ్ళు పడి నడక కుదరక, నొప్పి పుడుతున్నాయి. డొంక దాటేసరికి,

వంతెన! అక్కడ్నుంచి చూస్తే వూరంతా కనబడుతూవుంది. చింతచెట్టు, దాటితే చెరువు, తిరిగితే గుడి, ముందుకుపోతే మైదానం. దాని నానుకొనే మా యిల్లు!

నాకు గబగబా నడవాలని బుద్ధి పుడుతూవుంది. వంతెన మీద ఆయన నిలబడి జీతగాడితో 'ఇంటిదగ్గర వదలిపెట్టి త్వరగా రా' అన్నాడు. 'పదండి' అని జీతగాడు నా వెంట మా యింటిదాక వచ్చాడు. లైటు రావటంతో కట్టుగొయ్యానున్న ఆవు లేచింది. తక్షణం నాన్న నిద్రలేచాడు దుప్పటి తొలగించి, కళ్ళు నులుంకొంటూ మా దగ్గరకు వచ్చాడు.

'ఎవరూ?' అన్నాడు

'నాన్నా!' అన్నాను.

ఎత్తుకొని, ముద్దు పెట్టుకొని, లోపలికి తీసుకుపోతాడని అనుకొన్నాను.

'మాధవ్!'

మైకంగా పిలిచాడు

'ఊఁ!'

జీతగాడు 'వస్తాను' అంటూ వెళ్ళిపోయాడు.

'ఎలా వచ్చావ్?'

'రైలుకి!'

'ఇప్పుడొచ్చావేం?'

అంతలో అమ్మ లేచింది ఇంట్లోంచి తలుపు తీసుకుని వచ్చింది.

'ఎవరూ?'

'పెద్దబ్బాయి'
'మన పెద్దాడా ?'
అమ్మ దగ్గరగా వచ్చింది.
'ఊఁ!'

నేను జవాబు చెప్పాను.

'రా' అంటూ అప్యాయంగా చేతిక్రిందికి తీసుకొని ఇంట్లోకి నడిచింది అమ్మ.

'వీడినీ వూరు పంపటం ఆయనకు ఇష్టంలేదు. మరి వాడు ఎలావచ్చాడో ఏమో !' అంటూ నాన్న వచ్చాడు.

నాకెందుకో భయంగా వుంది. ఏం జరుగుతుందో నన్న దిగులూ ఎక్కువయింది. అమ్మా, నాన్నా, సహజ ప్రేమ చూపించటంలేదు. నేను వచ్చిన సమయం మంచిది కాదేమో ననిపించింది. వాళ్ళ హృదయంలో ప్రేమ నిద్రపోయిన సమయంలో వచ్చాను కాబోలు. వాళ్ళు నిద్రలేచారు గానీ, హృదయాలు నిద్ర లేవలేదు.

అమ్మ దీపం కొడి పైకెత్తుతుందేమోనన్న భయం నిజమయి పోయింది.

'తమ్ముడేడమ్మా' అని అడిగాను.

'నిద్ర పోతున్నాడు. వాడికి రెండురోజులనించి జ్వరం ఉదయంనుంచీ పచ్చి నీళ్ళయినా ముట్టుకోలేదు.'

నేనూ ఉదయంనుంచి ఏమీ తినలేదు. తమ్ముడికీ నాకు ఏదో పోలిక ఈ విధంగావుంది జేబులో బఠానీలు చేతికి తగి

లాయి. నీళ్ళయినా లాగనివాడు బఠానీలు తింటాడు.
నా కెందుకో బాధ కలిగింది. లోలోపలే నిట్టూర్పువిడిచాను.

'అర్ధరాత్రి వచ్చావు. ఏమయింది! అలిగి వచ్చావా?' మంచంమీద కూర్చుంటూ నాన్న అడిగాడు.

'లేదు నాన్నా!'

'అక్కడ అందరూ క్షేమమేనా?'

'ఆఁ!'

'మరి నువ్వెందుకు వచ్చావు?'

'తమ్ముడిని చూడటానికి'

నాన్న నమ్మలేనట్టు ముఖం పెట్టాడు.

'నా బాబే!' అంటూ అమ్మ నన్నుదగ్గరకు తీసుకొంది.

'తమ్ముడిని చూడటానికా? అన్నాడు నాన్న ఏమో ఆలోచిస్తూ.'

అనుమానిస్తూ అడిగేసరికి నాకు ఏడుపే వచ్చింది.

అమ్మ ఒళ్ళంతా నిమురుతూవుంది. 'చాలా చిక్కిపోయావురా' అంది.

'వీడేవో గొడవ తెచ్చే ఇక్కడికి వచ్చాడని నా అనుమానం' అన్నాడు నాన్న.

'ఏంలేదు' అని చెబుదామనుకొన్నాను. కానీ అలా జవాబు చెప్పటంవల్ల అనుమానం బలపడుతుందని మానేశాను.

అమ్మ తల నిమిరి, చెక్కిళ్ళు రాస్తూ 'ఇదేమిటిరా చెంపలు వాచాయి' అంది.

'ఏమిటీ' అన్నాడు నాన్న. లేచి నాదగ్గరకు వచ్చాడు.

'అవు... ఎందుకు చెంపలు వాచాయి?'

ముఖంలోకి చూస్తూ మళ్ళీ అడిగాడు.

ఏం జవాబు చెప్పాలో నాకు తెలియలేదు. 'వాయలేదు' అన్నాను.

'అదేమిటిరా ఎవరితోనన్నా కొట్లాడావా!'

నాన్న ప్రశ్నించాడు.

'లేదు.'

జవాబు చెప్పాను.

'అత్తమ్మ కొట్టిందా?'

'లేదు!'

'మామయ్య కొట్టాడా?'

'లేదు'

నాన్నకు కోపంవచ్చింది. దానికి సహజమయిన కారణం చెంపలు వాయలేదని చెప్పటం. నిజంగా వాచేవున్నాయి. అబద్ధం చెప్పినట్లు అయింది. ఎందుకు అలా అయ్యాయో చెప్పి వుండకపోవటంకూడా కారణము - అసలు కారణం అది కాదు. మామయ్యకు చెప్పకుండా పారిపోయి వచ్చాననీ, అందుచేత ఆయనకు బాధ కలుగుతుందనీ, ఆ బాధతో మాధవ్ మా కక్కరలేదు. అంటాడనీ, అలాగేఅంటే చదివించటం కష్టమనీ. ఆస్తి రాకుండా పోతుందనో, అదే జరిగితే నా జీవితం కంటకప్రాయ మవుతుందనీ - కలిగిన బాధ.

'నిజం చెప్పరా?'

'నిజమే నాన్నా!'

'ఏమిటి నిజం ?'

'మామయ్య కొట్టలేదు నాకు దెబ్బలు తగల్లేదు,'

దెబ్బలు అంత స్పష్టంగా కనబడుతుంటే అబద్ధం చెబుతావెందుకురా ? నిజంచెప్పు ! ఎవరు కొట్టింది ?'

'మామయ్య కొట్టలేదు.'

'మరి కొట్టింది ఎవరు ?'

'ఎవరూ కొట్టలేదు.'

తన బిడ్డని ఎవరో కొట్టారనీ, సీతారామయ్య కావచ్చుననీ అనుకొన్నాడేమో నాన్నకు వళ్లు తెలియకుండా పోయింది. దౌర్జన్యం చూపించిన వాళ్ళమీద ద్వేషంకూడా జనించింది. జన్మించిన పగను దుర్మార్గంలోనే సాధించాలని నాన్న చేసే ప్రయత్నానికి ఆసరాగా కేంద్రం లభ్యం కావాలంటే మామయ్య అని తెలియచేయవలసే వుంది. అలా చెబితే ఎలాంటి పరిణామాలు వస్తాయో !

'నిజం చెప్పు !'

నాన్న వచ్చి కూర్చున్న నన్ను చొక్కా పట్టుకొని పైకి లేపాడు.

'అమ్మా !'

'బాబూ ! - ఉండండి - అదేమిటి వాడినలా'

'నోరుమ్ముయ్ !'

'అమ్మా !'

'చెప్పరా ఎవరు నిన్ను కొట్టింది!'

'ఎవరూ కొట్టలేదు.'

'వెధవా.'

నన్ను వంచి వీపుమీద పెడేల్న చరిచాడు. వెన్నెముక విరిగి నట్లయింది.

'అమ్మా !'

ఇంకోక దెబ్బ. వీపుమీద వెన్ను పూసలు కదిలి పోయాయి.

'అమ్మా !'

అమ్మ దగ్గరకు వచ్చింది. 'ఫో అవతలికి' అని నాన్న కసిరి కొట్టాడు. అయినా అమ్మ దగ్గరకు వచ్చింది. దూరంగా నెట్టాడు అమ్మను నాన్న.

'చెప్పు ! నిజం చెప్పు !'

'నిజమే ! నిజమే !'

ఇంకోదెబ్బ వీపుమీద పడింది. గుండెలో నొప్పి వచ్చింది.

'నాన్నా !'

మరోదెబ్బ ! వళ్ళంతా తిమ్మిరెక్కిపోయింది.

'అమ్మా ! నాన్నా !!'

'అన్నయ్యా !' నిద్రపోతున్న తమ్ముడు లేచి మంచం మీద కూర్చున్నాడు. మళ్ళీ అన్నాడు 'అన్నయ్యా!'

'తమ్ముడూ !'

నాన్న నన్ను విడిచిపెట్టాడు. అమ్మ ఏడుస్తూవుంది. తమ్ముడు కళ్లు నులుంకొంటూ వున్నాడు. నాకు ఏడుపు వస్తూ వుంది.

'అన్నయ్యా'

'ఊఁ'

'నువ్వు చచ్చిపోయావా ?'

'లేదురా !'

'మరే - నాకే - కల వచ్చిందీ - కలలో నువ్వు చచ్చిపోయావు.'

'ఛీ వెధవా ! వెధవమాటలూ నువ్వూను' చీదరించుకొన్నాడు నాన్న.

అమ్మ 'లేదు లేదు' అంటూ పెద్దగా ఏడ్చింది

'వెధవా నీపని రేపు' అని నావైపు కోపంగా చూసి నాన్న బైటకు వెళ్లిపోయాడు.

'అన్నయ్యా! నాన్న నిన్ను కొట్టాడా ?'

'అవునురా !'

'నన్నూ కొట్టాడు - అందుకేనట నాకు జ్వరం'అంటూ ఏడ్చాడు తమ్ముడు.

దెబ్బలు తగిలి, బాధకలిగి, వచ్చేఏడుపు మాయమయి తమ్ముడిని గూర్చి జాలి కలిగి ఏడుపు వచ్చింది. నేను ఏడుస్తూనేవున్నాను. అయితే అందులో ఎంతో తేడావుంది. క్షణం ముందు ఏడ్పూ, ఇప్పటి ఏడ్పు ఒక్కటికాదు. తెలివిలో ఏడ్పూ ఇక్కడి ఏడ్పూ ఒక్కటికాదు. ఎంతో తేడావుంది.

కొంచెం సేపటికి నాన్న గుర్రుపెట్టి నిద్రపోతున్న శ్వాస వినబడింది.

52

# 5

స్టేషన్ అంతా నిశ్శబ్దంగా వుంది. మాష్టరు బెంచీ మీద బెడ్ పరుచుకొని నిద్రపోతున్నాడు పోర్టర్ గేటుదగర పడుకొన్నాడు. ఇద్దరు కూరగాయల వాళ్లు ఇద్దరు ప్రయాణీకులు పెన్సింగు ప్రక్కగా హాలులో కునుకుతున్నారు. బుక్కింగ్ లోంచి వచ్చే వెలుతురు తప్ప హాలులో లైటు లేదు అసలు స్టేషన్ అంతటికీ అదే వెలుతురు. రెండు కుక్కలు మూలన ముడుచుకొని పడుకున్నాయి. బెంచీమీద కొంచెం స్థలం వుంటే కూర్చున్నాను రైలు ఇంకా గంటకిగానీ రాదు. ఆఫీసు గదిలో గడియారం టక్కు టక్కు మనటం స్పష్టంగా విన బడుతూవుంది. రైలు తెనాలి వెళ్ళేసరికి తెల్లవారు ంది.

మైదానం దాటి, గట్టు మలుపు తిరిగి, చెరువుదాటి, వంతెన మీదుగా డొంకలోంచి స్టేషనకి అర్ధరాత్రి ఒంటరిగా ఎలా రాగలిగానో తలుచుకొంటే భయం కలుగుతూవుంది. అమ్మ తమ్ముడి దగ్గరే నిద్రపోతూ వుంటుంది. క్రింద నా చాపా, దుప్పటి తెల్లవారిం తరవాత అమ్మచూచి ఏడుస్తుందో ఏమో! అర్ధరాత్రి కలలో చనిపోయినట్టు కనిపించి, కళ్లు తెరిచేసరికి నాన్న చేత దెబ్బలు తిని ఏడుస్తూ కనబడి, తెల్ల వారిం తరవాత నిద్రలేచి చూస్తే నేను లేకపోయేసరికి, రాత్రి జరిగింది అంతా కలే అనుకొంటాడు తమ్ముడు. తమ్ముడి ఏడుపూ, అమ్మ బాధా అర్ధరాత్రి గుర్తించి నన్ను ఎక్కువ

కొట్టకుండా వెళ్ళిపోయిన నాన్న ఉదయమే లేచి ఉరుముతూ వచ్చి ఏమనుకుంటాడో ఏమో !

అమ్మ అన్నం పెట్టలేదు. కనీసం తినమనిఅయినా అన లేదు. అన్నం ఇంట్లో లేకపోతే మాటవరుసకు అయినా అన్నం తిన్నావా లేదా అని అడగలేదు. అవకాశమే లేకుండా పోయింది.

నా దురదృష్టమేమో తీసుకుపోయిన బఠానీలు తమ్ముడు తినలేదు. ఇవ్వటమే కుదరలేదు. వాడికి జబ్బుచేసింది. పైగా నిద్రలో వున్నాడు.

ఈ బఠానీలు ఏం చేసుకోంటాను. నేను తినలేను. తినా లని అనిపించటంలేదు. తిన్న దెబ్బలతోనే కడుపు నిండి పోయి ..

ఎవరికయినా పెడదామంటే ఎవరూ లేరు. పోనీ పార వేద్దామంటే మనస్సు ఒప్పటంలేదు. పోనీ రేపు ఉదయం ఎవ రయినా చూచి, కావాలనుకొంటే తీసుకొంటారనుకొని జేబులో బఠానీలు జాగ్రత్తగా కుప్పగా కూర్చున్న బల్లమీద పోశాను.

అది చూస్తుంటే చాలా దిగులు అయింది. తమ్ముడు తినవలసినవి ఇక్కడుండి పోయాయి. ఎవరయినా తింటారో లేదో! ఉత్తినే పాడయి పోతాయో ఏమో! ఏమయినా కానీ నాకుమాత్రం తినాలని అనిపించటంలేదు.

ఆకలిగా లేకకాదు, వుంది. కానీ అవి చల్లారిపోతూ వుంది, ఇవి తింటే మళ్ళీ ఆకలి రేగుతుంది. అప్పుడు తీటానిః

ఏమీ వుండను. ఆరిపోతున్న ఆకలిమంటను రేగకొట్టుకొని, అది భరించలేక ఏడవటంకంటే ఇలా పడివుండటమే మంచిది.

ఇంతకుముందు చెంపమాత్రమే నొప్పిగావుంది. ఇప్పుడు వీపుకూడా బాధగావుంది. ఎందుకో వళ్ళంతా హూనంహూనం అయిపోతూవుంది. మూల్గాలనిపిస్తుంది. బెంచీమీదే పడు కొన్నాను.

నేను అమ్మ దగ్గరగానీ, నాన్న మంచంమీదగానీ, తమ్ముడితోగానీ పడుకోలేదు. ఒంటరిగా-ఒక్కడినే చాప మీద రెండు గంటలు దిగాలుపడి పడుకొన్నాను. నా స్వంత ఇంటిలో అమ్మానాన్నల మధ్య హాయిలేదు. దిగులుతో నిద్రలేకుండా వుండిపోయాను.

ఎన్నో స్థలాలు, ఎందరో స్నేహితులు, ఏమేమో ఆటలు, ఎంతెంతో ఆనందం ఊహించుకొని వచ్చాను. అంతా ఏమయింది. ఆనందం లేకపోగా తెల్లవారితే వీపు వాచే స్థితి ఎదురయింది

నేను పుట్టటమే తప్పు అయింది కాబోలు. పుట్టినా ఈవిధంగా పెరగటమే దోషం కావచ్చు. ఎలా పెరిగినా మామయ్యచేత దెబ్బలు తినకుండా ఉండవలసింది. అది తప్పని సరి అయినా ఇక్కడిదాకా వచ్చి, నాన్నచేత దెబ్బలు తిన కుండా వుండవచ్చునే! పోనీలే, నేనేం చేస్తాను. ఈవూరు, తెనాలినుండి వచ్చింది, వీపు పగిలేటట్లు దెబ్బలు తినటానికే అయివుంటుంది.

మామయ్య మీద కోపం లేదిప్పుడు. మునుపు ఉన్న దంతా పోయింది. నాన్నమీద అసలు కోపమే లేదు. నాకు ఎవరిమీదా కోపం రానక్కరలేదు. వస్తే అది నాకే ప్రమాదం. నామీద ఎవరికీ కోపంరాకుండా వుంటే అదే ఎంతో పుణ్యం.

ఊళ్ళోనే వుంటే నాన్న ఇంకా కొడ్తే ప్రమాదంవుంది. తెనాలి వెళితే మామయ్య కొట్టకపోవచ్చు! ఏది ఏమయినా తెనాలే వెళ్ళిపోవాలి అని చివరికి నిశ్చయించుకొన్నాను.

టిక్కెట్లు ఇస్తున్నారు. కొనుక్కోవాలంటే డబ్బుల్లేవు. టిక్కెట్లు లేకపోతే రైలులో ఎవరయినా కొడతారేమో! ఇక్కడే వుండిపోతే ఇంటికి తీసుకుపోయి నాన్న కొడతాడు ఏమయితే అదే అవుతుంది లెమ్మనుకొన్నాను.

రైలు వచ్చింది, ఎక్కాను. బయలుదేరింది. కంపార్టు మెంటులో అందరూ నిద్రపోతున్నారు. దూరంగా స్థలమున్నచోట పోయి కూర్చున్నాను. కడుపులో ఆకలిగా వున్నందువల్ల నేమో కళ్ళకు నిద్ర రావటంలేదు.

మామయ్య ఏమయినా అంటాడో ఏమో! ఏమీ అనకపోతే మంచిదేకానీ, అలా కాకపోతే నేను మరెక్కడికి పోతాను. నన్నెవరు ఆదరిస్తారు. నాకెవరు అన్నం పెడతారు. ఎవరు చదివిస్తారు, బట్టలిస్తారు.

మామయ్యకు నేనంటే ఎంతో ప్రేమ. అత్తమ్మకూ ంతే! నన్ను ప్రేమకారణంగానే మామయ్య కొట్టివుంటాడు.

వసును పెళ్ళి చేసుకుంటాననని చెప్పివుండ వలసింది. ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా మాట్లాడటం నాదే తప్పు!

నన్ను హైస్కూల్‌లో చేర్చారు. పెద్ద చదువులే చదివించాలని ఉబలాట పడుతున్నారు. నే నదేమీ గుర్తించు కోలేదు. వసుతోపాటు నాకు ఎన్ని బట్టలో కొనిపెట్టారు. ఎన్నో పుస్తకాలు ఉన్నాయి నాకు.

అత్తమ్మ తనే అన్నం వడ్డిస్తుంది. వసూ నేను తిన్నదాకా దగ్గరే కూర్చుంటుంది. నేను తృప్తిగా అన్నం తిన్నాననుకొంటేనే కంచం దగ్గర్నుంచి లేవనిస్తుంది. లేకపోతే తనే అన్నం కలిపి తినిపిస్తుంది. అలాంటి అత్తమ్మను వదిలి వెళ్ళిపోయాను. ఎందుకు? - నాకేం జవాబువుంది?

రైలు తెనాలి స్టేషన్‌లో ఆగింది. దిగాను. వెళ్ళాలి. ఎలా? నాకు టిక్కెట్టులేదు. ఇంతవరకు ఎవరూ ఏమీ అననందుకు సంతోషంగా వున్నా, స్టేషన్ లోంచి వెలుపలికి పోయేది ఎలాగో తెలియటంలేదు.

ప్లాటుఫారం ప్రక్కనే ఫెన్సింగు వుంది. దాని ఇనుప గొట్టాలు రెండు ఎవరో వంచి పారేశారు. త్రోవ వుంది. కొందరు దానిలోంచి దూరి రోడ్డెక్కి మామూలుగా, టిక్కెట్టు తీసుకొనే రైలులో ప్రయాణం చేసినవాళ్ళు లాగా ఠీవిగా వెళ్ళిపోతున్నారు.

నేనుకూడా అలాగే రోడ్డుమీదికి వెళ్లాలనుకొన్నాను. కాని గుండె వేగంగా కొట్టుకుంటూ వుంది. ఎవరయినాచూస్తే ఏమనుకొంటారు. పోలీసులో, టిక్కెట్టు వసూలుచేసేవాళ్ళో

పట్టుకొని కొడతారేమో అని వణుకుతూనే పరుగెత్తుకొంటూ పోయి, అందులోంచి దూరి, రోడ్డుమీదికి ఉరికి, అక్కడినుంచి చకా చకా ఇంటివైపు నడక సాగించాను. ఎవరూ నన్ను ఏమీ అనలేదు? బ్రతికాను.

తీరా ఇంటిదగ్గరకు వెళ్ళింతరవాత లోపలకి పోవటానికి భయం కలిగింది. ప్రతిరోజూ ఆ గేటులోంచి వెలుపలికి రావటం, లోపలికి పోవటం అతి సామాన్యంగా జరుగుతున్నదే అయినా, ఇప్పుడు మాత్రం గేటు దాటటానికి అనర్యావాతతో బాధ పడ్డాను.

ధైర్యం కూడగీసుకొని లోపలికి పోయాను. గేటు ప్రక్క సావిట్లోంచి మామయ్య వచ్చాడు. నాకు వళ్ళంతా వేడి ఎక్కింది. తూర్పున ఉదయిస్తున్నాడు సూర్యుడు.

'మాధవ్'

'ఏం మామయ్యా.'

'ఎక్కడికి పోయావ్.'

'మావూరు.'

మామయ్య ఆశ్చర్యపోయాడు. ఆయన కళ్ళలో ఏ భావాలు మెదిలాయో కాని నేను చదవలేక పోయాను. రెండు క్షణాలు నిశ్శబ్దంగా వూరుకొన్నాడు.

'ఏం చెప్పావ్?'

'ఏం చెప్పలేదు.'

'కొట్టాడు మామయ్య అని చెప్పలేదూ!'

'లేదు.'

ఈసారి మామయ్య రెండు కనుపాపలూ కాంతి మయా లయిన సూర్య చంద్రులు లాగా ప్రకాశించాయి.

'మాధవ్ నిన్ను పొరపాటున కొట్టాను. బాధ పడ వద్దురా.'

నాకెంతో తృప్తి కలిగింది.

'లేదు మామయ్యా.'

'అమ్మా నాన్నా తమ్ముడూ బాగున్నారా?'

'ఆఁ!'

'అప్పుడే వచ్చేశావేం?'

నాకు సమాధానం చెప్పాలనిపించలేదు. నాపైన మామయ్యకు ఎంతో ప్రేమ. ఆయనకూ సంతోషం కలగాలి.

'మామయ్యా, వసుని నేను పెళ్ళి చేసుకొంటాను మామయ్యా.'

ఆయన ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నాడు. ఏమీ మాట్లాడలేదు. అయితే సంతోషించాడనిగుర్తించాను.

వరండాలో అత్తమ్మ నిలబడివుంది. 'ఎవరూ? మాధవ్!' అంది.

'ఊఁ!' అంటూ పరుగెత్తాను.

వెనుక నిలబడి మామయ్య చూస్తూనే వున్నాడు.

'అమ్మ బాగుందా?'

'ఊఁ!'

'నాన్న?'

'ఊఁ!'

'తమ్ముడూ !'

'వాడికి జ్వరం !'

'నీకోసం జీతగాళ్ళు అందరూ వెదుకుతున్నారు.'

'ఆఁ !' నాకు ఆనందం కలిగింది.

'అప్పుడే వచ్చేశావేం ? - రెండు రోజు లుండి రాక పోయావా !'

'నేను లే వసు ఉండలేదుగా ! అందాకని.'

వసు నాకో డుస్తూ వుంటుందని తెలుసు. కానీ ఏడుపు వినబడటంలేదు.

అత్తమ కళ్ళు తుడుచుకొంది.

'వసు ఏది !'

'లోపలుంది. రా.'

వీపుమీద చేయి వేసింది లోపలికి నడిపిస్తూవుంది.

వీపుమీద దెబ్బలకు ఒత్తిడి తగిలి నొప్పి పుట్టింది. ఓర్చుకోలేక పోయాను.

'అబ్బా !'

'ఏమిటి మాధవ్.'

'ఏమీ లేదు '

'ఉండు' అంటూ చొక్కా తొలిగించి చూచింది. 'ఇదేమిటి మాధవ్' అంది బాధగా అత్తమ్మ.

'దెబ్బలు - చెంపలు పగిలిపోయేటట్లు మామయ్య కొట్టాడు - ఈ వీపు వాచిపోయేటట్లు నాన్న కొట్టాడు

అమ్మా - చూడు నా వళ్ళంతా దెబ్బలే' అలా చెబుతుంటే ఏడుపు ఆగలేదు. పెద్దగా ఏడ్చాను.

అత్తమ్మ కారణం అడగలేదు. వణికిపోతూ కళ్ళు తుడిచింది. ఆమె కళ్ళలోంచి కన్నీరు జారిపోతూవుంది.

'వసు ఎక్కడుందమ్మా.'

ఏమీ మాట్లాడకుండా లోపలికి తీసుకుపోయింది.

గదిలో మంచంమీద వసు పడుకొనివుంద. ఏ రోజూ అంతసేపటివరకు సాధారణంగా వసు నిద్రపోలేదు. వంటిమీద చేయి వేశాను. వేడిగా తగిలింది.

'రాత్రంతా జ్వరం మాధవ్.'

'ఎందుకు ?'

'ఏమో !'

నాకు మళ్ళీ ఏడుపు వస్తూవుంది. చెప్పకుండా వెళ్ళిపోయినందుకే జ్వరం వచ్చిందేమో ననిపించింది.

'రాత్రంతా కలవరింతలు - అన్నయ్యా అన్నయ్యా అంటూ మెలకువ వచ్చినప్పుడు అన్నయ్య ఏడి - ఎక్కడికి పోయాడు అంటూ ఒకటే ప్రశ్నలు.'

నాకు ఏడుపు వచ్చింది. అత్తమ్మ ఓదార్చుతుంటే మరీ బాధ ఎక్కువయింది.

అంతలో వసు కదలింది.

'వసూ !' పిలిచాను.

ప్రక్కకు తిరిగి పడుకొంది.

'వసూ !' మళ్ళీ పిలిచాను.

కళ్ళు విప్పి చూచింది.

'వచ్చావా ?'

'ఊఁ! - ఆడుకుందాం రా'

'ఆడుకుందామా ?'

'ఊఁ !'

'అన్నయ్యా !'

'ఊఁ !'

'అన్నయ్యా !'

'ఊఁ !'

'నువ్వు అన్నయ్యవే - బావయ్యవు కాదు-అవునా ?'

'అవును. అన్నయ్యనే - బావయ్యను కాదు.'

'నిజంగా !'

'నిజం !'

'అన్నయ్యా !'

ప్రేమతో ఆనందంతో ఉత్సాహంతో తొందర తొందరగా పిలిచింది.

'అవును వసూ !'

# 6

కాల మెంతో విచిత్రమయింది. పదిహేను సంవత్స రాల గతం నిన్న మొన్నటి జ్ఞాపకం లాగానే మిగిలివుంది. పాతికేళ్ళ వయస్సులో నేనిలా వుంటానని ఎన్నడూ నేను ఊహించలేదు.

ఈ కాలగర్భంలో అనంతకోటి విశ్వరహస్యాలే దాగి వుండాలి నిన్న మొన్నటి దాకా వాస్తవమయిన కొంత ప్రకృతి ఇవాళ వాస్తవం కాదు. ఎందుచేతనో మరి!

పద్మ మెడిసన్‌లో చేరుతుందని ఎవరూ వూహించలేదు. ఊహించని లోకంలో ఎన్నో జరుగుతూ వుంటాయి అన్నీ ఆశ్చర్యం కలిగించవు. కాని పద్మ యం. బి. లో చేరటం నాకు పరమాశ్చర్యం కలిగించింది.

అంత పెద్ద కుటుంబంలో ఆమె నొక్కదానిని అంత ఖర్చుపడి చదివించటం సాధ్యమయ్యే పనిలాగా భావించలేదు. పెళ్ళి కావలసిన అక్కలూ; చదువుకొంటున్న చెల్లెళ్ళూ; ఉద్యోగం రాగానే ఇల్లు విడిచి గృహంతో సంబంధం వదులుకొని, తమ కాపురం తాము చేసుకొంటున్న అన్నలూ; పెళ్ళి అయిందాకా, చదువు పూర్తయిందాకా ఉద్యోగం వచ్చిందాకా, ఇల్లు నే నమ్ముకొని వున్న తమ్ముళ్లూ; ఇలాంటి కుటుంబంలోని పద్మ మెడిసన్‌లో చేరడమంటే వింతే!

వసు యం. బి. లో చేరిందంటే అదేమంత విచిత్రం కాదు. ఎందుకూ అంటే ఏనాటికయినా ఏవిధంగాఅయినా ఆమె డాక్టర్ కావటానికే పుట్టినట్లూ పెరుగుతున్నట్లూ మా అందరి నమ్మకం. డొనేషన్ కట్టి సీటు కొనుక్కోవలసిన అవసరం - ఇంటర్ ఫస్టుక్లాసు - మంచి మార్కులతో పాస్ కావటంతో - తప్పింది.

ఒకటో తరగతినుంచి పద్మపట్ల వసుకీ, ఈమె అంటే ఆమెకీ ఎందుకు తగాదా బయలుదేరిందో కాని, అది వాళ్ళకు కీడుకంటే మేలే చేసిందని చెప్పవచ్చు. ఒకరికంటే ఒకరు మార్కులు తెచ్చుకోవాలనే పట్టుదల వాళ్ళను ఒకే సంవత్సరం ఒకే కాలేజీలో మెడిసన్‌లో చేర్చింది.

వాళ్ళిద్దరకూ నాపైన లక్ష్యం వుందనుకొంటే, వసు ప్రసాదం నాకుందనిపిస్తుంది. నాలాగా డాక్టర్లు కావాలని వాళ్ళనుకొనివుంటే, వసు పుట్టటంతో డాక్టర్ను చేయాలను కొన్న మామయ్య హృదయంలోని వసు చదువు దృష్టి - ఇంటర్‌లో ఫస్టుక్లాసులో పాసయినవెంటనే-నావైపుమళ్ళింది. అని నేను అనుకొంటాను. మామయ్య హృదయంలోని ఒకే బీజం అంకురించి రెండు శాఖలై పెద్దదయింది. ఇప్పుడు నేను డాక్టర్ను అయ్యానంటే అందుకు ఆధారం వసు అనే చెప్పాలి.

వసు ఏం చేస్తే పద్మా అదే చేసేది. ఈమె సంగీతం నేర్చుకొంటే ఆమె నేర్చుకొంది. నాట్యమూ అంతే! వసును చూచి పద్మ నేర్చుకోందీ, సాధించందీ లేదు. ఇదంతా సమ

న్యాయించేది ఒకే వాస్తవాన్ని. ఆమెకంటే నేనేం తక్కువ అనే పద్మ భావం.

పద్మను చేతకాదు కానీ, వీలయితే వసులాగా ఎర్రగా, పొందికగా, పూర్ణంగా; తగిన ఎత్తుతో, తగినంత లావుతో, తీర్చి దిద్దిన కనుబొమలతో, కొస తేలిన ముక్కుతో మిలమిల లాడే కళ్ళతో, ఒంపులు తిరిగిన శరీరావయవాలతో, సున్నితంగా అడుగులుపడే పాదాలతో, నవ్వితే నొక్కులుపడే చెక్కిళ్ళతో, మల్లెమొగ్గల చెండు మాదిరి పలువరుసతో, బాగుగా వ్రేలాడే దట్టమయిన జడతో, పోటీపడి, తనూ అచ్చంగా అలాగే తయారయి వుండేది.

కానీ సన్నగా తమలపాకు తీగలాగా, గాలిలో తేలే పూదోటగా, కదిలీకదలని నడకలతో, ఊగిసలాడే నడుంతో తెల్లగులాబీ శరీరవర్ణంతో, గాలి తాకుకే కమిలిపోయే సున్నితత్వంతో జీవించమని సృష్టికర్త తీర్చి దిద్దటంతో తనేమీ చేయలేక మెదలకుండా వూరుకొంది పద్మ.

కాలం తనువులకు సమర్పించిన వయస్సు వాళ్ళ పట్ల ఎంత కారుణ్యం చూపిందో తెలుచుకొంటే కళ్ళుఅదురుతాయి. నా కళ్ళ ఎదుటే వాళ్ళు అమాయికంగా ఏడ్చే పసివాళ్ళు. నేను చూస్తుండగనే సిగ్గుపడటంఅలవాటు చేసుకొన్నకన్యలు. ఇప్పుడు సుందర దరహాసాలతో వెన్నెలవెల్లులు వెల్లివిరిసీ విరియని పూలు.

వాళ్ళు స్కూల్ఫైనల్లో వున్నప్పుడు స్కూల్ డే మీటింగులోపడిన తగాదా నా కళ్ళ ఎదుటే కదులుతూవుంది.

పద్మ ముందుగా వచ్చి కూర్చుని, లేచి ఎందుకో రూంలోకి తిరిగి వచ్చేసరికి, ఆ సీటులోనే వసు కూర్చుని వుంది. అది తన సీటు అంటుంది పద్మ. ఖాళీ సీటులో తను కూర్చుంది కాబట్టి ఆ సీటు తనదే నంటుంది వసు.

ఆ తగాదాను హెడ్‌మాష్టరు ఎలా పరిష్కరించాడో తెలియదు కానీ వాళ్లిద్దరూ ఒకే కుర్చీకోసం పడిన తగాదా నేను మరచి పోలేను. వాళ్ళుకోరింది లభ్యంకాకపోతే ఇద్దరూ నిద్రపోరు గానీ, ఎవరికీ ఓగ్పు తక్కువ గాదు.

వాళ్ళిద్దరూ ఎప్పుడూ మాట్లాడుకోరు. ఎప్పుడయినా మాట్లాడుకొంటే ఏదో ఘర్షణలోనే చెరి నాలుగు మాటలు వడ్డించుకొంటారు. ఒకరిని చూస్తే మరొకరికి ఎందుకోగాని తీరని కోపం.

ఒక వింతమాత్రం చెప్పక తప్పదు. నేను యం. బి. బి. యస్ పాసయ్యాను అని తెలిసి ఇద్దరూ ఒకేసారి అభినందించారు ఆరోజు పరస్పరం క్రోధంగానీ, ద్వేషంగానీ లేని చూపులతో పలకరించుకొని, ముక్కులతో, నాసళ్ళతో, చెక్కిళ్ళతో నవ్వుకొన్నారు.

విశాఖపట్టణం కే. జి. హాస్పటల్లో హౌస్-సర్జన్‌గా ఉన్నప్పుడే మామయ్య ఆరోగ్యం బాగాలేదని కబురువచ్చింది. చాలా బాధపడ్డాను. పదేపదే అపశకునాలు కనిపించాయి.

చదువు లేక, పొలం పని చేసుకొంటూ, తిండికి బాధతో, నానా అవస్థలూ పడుతూ వుండవలసిన నన్ను చేర

దీసి, చదువు చెప్పించి, డాక్టర్ను చేసిన మామయ్య ఆరోగ్యం నాకు దిగులు కలిగించింది.

పుట్టింది మొదలు ఇంతవరకు ఆయనకు ఏజబ్బూ రాలేదు. అలాంటి మనిషికి జబ్బుచేసిందని తెలిసేసరికి మనస్సు ఏదో అశుభాన్నే శంకించింది. ఈ చదువుతో నా జీవితం కాపాడిన మామయ్య జీవితం ఈ చదువుతో కాపాడాలని నిశ్చయించుకొని తెనాలి వెళ్ళాను.

చివరి చూపులు నాకు మిగల్చకుండా కన్నుమూశాడు మామయ్య. నా తల తిరిగి పోయింది. భూమి సర్వం వలయాలు వలయాలుగా చుట్టుకు పోతూవుంది. అత్తమ్మ గుండె చెరువు అయ్యేలా ఏడుస్తూవుంది. వసు కుమిలిపోతూవుంది. ఓదార్చటం నాకు చేతకావడంలేదు. మామయ్యను బ్రతికించే శక్తి ఎవరికీలేదు. గుండెలో రంపపుకోత వున్నా, మెదడులో గుండు సూదులూ మరమేకులూ దిగుతున్నట్లువున్నా, హృదయం తరుక్కుపోతూవున్నా. నేను ఏమీచేయలేదు.

మామయ్య హాయిగా నవ్వుతూవుంటే ఎలావుండేవాడో ఇప్పుడూ అలాగే వున్నాడు. అసలు నిర్జీవికి తేడా తెలియలేదు ఆయన చనిపోయాడంటే నమ్మే శక్తి నాకు లేదు. ఆ నవ్వు, ఆ కాంతి, ఆ ముఖంలో అలావున్నాయి. నా హృదయంలో నిలిచే వుంటాయి.

బంధువులు ఎందరో వచ్చారు: ఎంతో అనునయించారు నన్ను. ఎందుకో తెలియదు. నాకు భూమి క్రుంగిపోతున్నట్లు భయం కలిగింది. రక్తంలో నిప్పు కణికలు తిరుగు

తున్నట్లుగా భీతి కలిగింది. ఏది శాశ్వతమో, ఏది అశాశ్వతమో నాకు అంతు పట్టలేదు. పట్టుకొన్న తాడు తెగి కత్తుల బావిలో పడిపోయినట్టుగా వుంది.

పెద్దలందరూ చేరి శవ సంస్కారానికి ఏర్పాటు చేస్తున్నారు. ఏది ఎలా జరగాలని వుందో అలాగే జరుగుతుంది లెమ్మని ఓదార్పు చెబుతున్నారు. స్మశానానికి శవ వాహకుడుగా వెళ్ళాను. [illegible]తి ముట్టించారు.

మామయ్య [illegible]ాలిపోతున్నాడు. ఆప్యాయంగా [illegible]రించిన ఆ చేతులు [illegible]ిపోతున్నాయి. అదే నా, ఆ వ[illegible]స్థలమేనా నన్ను కౌగలించుకొంటూ వుండేది. ఆ పెదాలేన నన్ను ముద్దు పెట్టుకొనేవి. ఆ కళ్ళేనా నన్ను ప్రేమగా చూచేవి. ఏవి ? అవన్నీ ఏవి ? ఏమయిపోతున్నాయి. ఎక్కడికి పోతున్నాయి! – అవును అగ్నికణాలలో జ్వాలల్లో ఆయన భౌతికకాయం ఆజ్యంలా ఆహుతి అయిపోయింది.

నేను ప్రతిమలా నిలబడిపోయాను. నాసర్వశక్తులూ నాకు అతీతంగా గోచరించాయి. నా ప్రాణంమీద నాకే అధికారం లేదనిపించింది. నేనూ ఒకనాటికి ఎప్పుడో ఎక్కడో మరణించేవాడినే! ఏ క్షణంకోసం మృత్యువు ఎదురుచూస్తూ వుంటుందో తెలియదు. ప్రతిమనిషీ మరణానికి అభిముఖంగా నడుస్తున్నాడు. గమ్యం ఎంతదూరంలోవుందో, లేకపోతే ఎంత దగ్గరలో వుందో తెలియదు.

ఈ తెలియని తనంలో వెర్రి, అభిమానం, ఆనందం, ప్రేమ, పగ, ద్వేషం, కరుణ – ఎన్ని గుప్తభావాలు ఇమిడి

వున్నారో ! మరణసమయం తెలియదు. తనువు అశాశ్వత మయింది. క్షీణించి, చివరికి బూడిద అయిపోతుంది. అయినా. ఆవేశ కావేశాలు ఎందుకు ? దుర్బుద్ధులూ దుష్ట చేష్టలూ ఎందుకు !

మామయ్య మరణం నాకు వైరాగ్యం తొలగించింది సందేశం అందించింది. నికరం లేని బ్రతుకుల్లో అనవసర అభి మానాలు పెంచుకోకూడదు. ఆత్మద్రోహం చేసుకోకూడదు. ఇసుక సౌధం కూలిపోయేదే ! నమ్ముకొన్న వంతెన పడిపోక తప్పదు. నడిచే బాటలో అగ్నిజ్వాలలు రేగక మానవు. నిన్నా నేనులు రేపులు విలీనం కాకపోవు నిర్మలమయిందీ, నిత్య మయింది. నిర్మలకర ప్రేమే! అదే జీవితాన్ని నడిపించవలసింది.

మామయ్య మరణానంతరం అప్పులవాళ్ళు వచ్చారు. ఆయనకు అంతగా అప్పులు ఎందుకయ్యాయో అత్తమ్మకు తెలియదు. మనిషి జీవించి వున్నంతకాలం మాట్లాడనివాళ్ళు మరణించిన తర్వాత పిచ్చికుక్కలయి కొట్లాడుకొంటూ ఎగ బడ్డారు. అప్పులుపోగా, వీలునామా ప్రకారం ఆస్తులు పంచగా, నా తమ్ముడికి అయిదెకరాలు చెందింది. మాకు మిగిలిన ఆస్తి చాలా తక్కువ.

'వసూ! నీకు నాన్నలేడు నాకు మామయ్యలేడు. అత్తమ్మ చాలాదిగులుపడుతూవుంది. నువ్వు బాధపడవద్దు. ఆయనలేనిలోపం ఏనాడూతీరదు. కాని నాకు వీలయినంతలో నీకు ఏలోపమూ రానీను వసూ! ఆయన లేనిలోపం ఏనాడు

కలగనివ్వను. నాబాధ తీర్చటానికి దేవుడే వున్నాడు. నువ్వు దిగులు పడవద్దు.' అని ఏమేమో చెప్పి ఓదార్చాను

ఆరోజుల్లోనే అమ్మనుచూచి భయపడ్డాను ఆమె మృత్యుముఖంలో ఉన్నట్టు అనిపించింది. హాస్పటల్‌లో చేర్పించాను. టి. బి. అని చెప్పారు ఆపరేషన్ చేయించాను. ఒకలంగ్ పూర్తిగా తీసివేశారు. అమ్మ బతికింది కాని ఆమె వున్న ఆ వాకిలిదాటి ఒక్క అడుగు ముందుకు వేస్తే భయంకర మృత్యువే ప్రత్యక్షమవుతుందని తెలిసి పోయింది.

నేను టి. బి. స్పెషలిస్టు అయితే అమ్మను బతికించుకో గలనేమో అనే ఉద్దేశ్యంతో హైద్రాబాద్‌లో టి. డి. డి. చదవడానికి పోయాను. రెండు నెల లయినా కాకముందే, మామయ్యలాగా అమ్మకూడా నన్ను అన్యాయం చేసింది.

# 7

ఏ మాతృమూర్తి రక్తం పంచుకొని. ఒక ప్రాణిగా ఈలోకంలో అడుగుపెట్టానో ఆ తల్లిలేదు. అంతేకాదు. ఎవరి హృదయం తిని, ఈ హృదయాన్ని ఇంతకోమలంగా పెంచుకొన్నానో ఆ మామయ్య ఈనాడు లేడు.

నేను ఒంటరి నాడినయి పోయాను. ఆ ఒంటరితనం ఇక్కడే ఎక్కువయింది. ఈ హైద్రాబాద్ మహానగరంలో, ఈ రోడ్లమీద ఇంతమంది జనం ఉన్నా, నన్ను ఒంటరితనమే

వెంటాడుతూవుంది. ఆదరణ అనురాగం దూరమయి పోతున్నాయి. నేను అనే ఒక ప్రత్యేకజీవిని వున్నట్లు ఈ పట్టణం తెలుసుకోలేదు. మనుష్యులు పెరుగుతున్నారు. మానవత్వం పెరగటంలేదు. పట్టణం పెరుగుతూవుంది. రాక్షసత్వం పెరుగుతూవుంది.

నిద్ర లేచింది. ప్రారంభమయి, నిద్రపోయిందాకా అంతులేని తొందర ఒక్కరికీ క్షణం తీరికలేదు. ఈ కార్లూ, ఈ బస్సులూ, ఈ మనుష్యులూ ఎక్కడికో పారిపోతున్నారు. జీవితం నుంచి దూరంగా పోతున్నారు. గమ్యం దాటి వెళుతున్నారు. ఎప్పుడు తిరిగి కేంద్రం దగ్గరకు వస్తారో తెలియదు. అంతు తెలియని పరిధిలో అనంతమయిన ప్రాకులాట!

సంవత్సరం పూర్తి అయితే దూరంగా వెళ్ళిపోవచ్చు. ననుకొన్నాను. ఇక్కడ నాహృదయం ఆనందించదని తెలుసుకొన్నాను.

ఆ సంవత్సరమే - మామయ్య పోయి ఆరు నెలలయినా కాకపూర్వమే నేను కొత్తబాధ్యతను స్వీకరించవలసి వచ్చింది. వసు పుట్టినరోజు సమీపిస్తూవుంది. ఆమెకు పందొమ్మిదో సంవత్సరం ఆ రోజుతో ప్రారంభమవుతుండి

మామయ్య లేని లోపం వసును క్రుంగదీయకూడదు. అందుకే విశాఖపట్టణం పోవాలని నిశ్చయించుకొన్నాను.

వసు జరుపుకొనే పుట్టినరోజు వేడుకలో, స్నానంచేసి కురులు ఆరబోసి, ఆయన తెచ్చిన కొత్తబట్టలు కట్టుకొని అరవిసిన మల్లెమొగ్గలా కనబడుతూవుండే తన్మయత్వంలో

బిడ్డముఖంలోని కాంతులు చూస్తూ కూర్చుండే వాడు మామయ్య.

ఆ వేడుకలో జరిగే ముఖ్యమయిన పద్ధతి నాకు ఎంత ఆలోచించినా అందని, ఎంత అనుభూతి పొందినా మిగిలిపోయే ఆనందం ప్రసాదిస్తుంది. క్రొత్తగా చేయించిన వెండి బరిణెలో మంచి కుంకుమ వుంచి, అది వసుకు ఇచ్చేవాడు మామయ్య. ఆమె బొట్టు దిద్దుకొని, అత్తమ్మకు దిద్దేది. ఆ సాయంకాలం తన స్నేహితురాళ్ళలో ప్రియమయిన స్నేహితురాలికి ఆ బరిణ బహూకరించేది.

ఏటేటా వసుకి ఎన్నో బహుమానాలు వస్తూవున్నాయి. అవి దాచుకుంటూవుంది. ఏదీ ఉపయోగించదు. ఎందువల్ల అని విచికిత్స పొందుతుంటే 'పెళ్ళి అయింతరవాత భర్తతో తనూ ఆ వస్తువులు వాడుకో'మ్మని మామయ్య చెప్పినట్లు తెలిసింది. మామయ్యది ఎంత మంచి హృదయమో! అది అర్థంచేసుకున్న వసు ఎంత ఉత్తమురాలో ఆలోచించినా వ్యర్థంకాని నిజం!

కుంకుమ విషయంలో అంతర్యం నీకు ఆనందం అందిస్తుంది. కుంకుమ అంటే ప్రాణి చలనానికి ముఖ్యం అయింది. కుంకుమ రక్తం! శరీరంలోని రక్తమే పొందే శిశురూపం కుంకుమ. భర్త వుంటేనే భార్యకు కుంకుమవుంటుంది. భర్తకు ఆరోగ్యంగా లేకపోయినా భార్యకు కుంకుమ ఉపయోగం ఉండదు. ఆమె కుంకుమ అప్పుడు వాడదు. అది ఇవ్వటంలో నా భర్త క్షేమంగా వుండాలి. నీ భర్త

క్షేమంగా వుండుగాక అనే ఆశంసనం కూడా వుంది. భార తీయుత కే ప్రత్యేకమయిన కుంకుమ నాలో ఇటువంటి పవిత్రమై ఉన్నతమై, నిత్యనూతనమై ఆనందప్రదమయిన అనేక భావాలకు ఆకారమయింది. ఇంకెన్ని గుప్తభావాలు ఇమిడి వున్నాయో!

మామయ్య తెచ్చే ఈ బహుమతులు ఇప్పుడు ఎవరు తెచ్చి ఇస్తారు. నేనే తీసుకి వెళ్లాలి అందుకే బజారుకుపోయి చీర కొన్నాను. జాకెట్టు కుట్టించాను. బంగారు బరిణ చేయించాను కుంకుమ నింపించాను పళ్ళు ఫలాలు పసుపూ కుంకుమ సమర్పించుకొని కుంకుమ బరిణ తీసుకు వచ్చాను.

ఆరోజు ఉదయమే ఎనిమిది గంటలకి డాబాగార్డెన్సులో వసు అత్తమ్మతో ఉంటున్న ఇంటికి వెళ్ళాను. మెయిల్ ఆలస్యం కాకపోతే ఆరెంటికే చేరి వుండేవాడిని

రెండురోజులునుంచి నేనింకా రాలేదని కోపపడుతూ ఏడుస్తూ వుందట వసు అత్తమ్మ ఎంతో బాధతో చెప్పింది. ప్రతి ఏడు ఒకరోజు ముందుగా వచ్చే నేను ఆ ఏడు రెండు రోజులు ముందుగా రావాలనీ, ఆలస్యం చేశాననీ, ఆయన పోవటంతో ఇంట్లో ఆనందం పోయిందనీ అత్తమ్మ దిగులు పడింది.

చదువు కారణంగా ఆలస్యం అయిందనీ, ముందే వద్దామనుకొన్నానని అత్తమ్మను ఓదార్చటంతో సరిపోయింది. వసు గుర్తు రాలేదు.

వసు నిద్రలేవలేదట. స్నానం చేయలేదట. ముఖం కడుక్కోలేదట. అంతా వింటుంటే వసు మరీ పసిపిల్ల కావటం లేదుకదా అనిపించింది వస్తున్నానని ఉత్తరం వ్రాశాను తప్పక వస్తానని ఆమెకు తెలుసు. అంతలోనే అల్లరి చేయ కూడదు. ఆ మాట చెబుదామని లోపలికి పోయాను

అంతలో వసు వచ్చింది. 'ఉదయమే వస్తానని ఇప్పుడా వచ్చావు –' పో నీతో నే నసలు మాట్లాడను' అని మూతి ముడిచింది. చిన్నతనంలో మా పూరునుంచి తెనాలి వచ్చి నప్పుడు పలకరించిన వసు కళ్ళలో కనపడింది ఆమెకూ ఈమెకూ అట్టే తేడా లేదనిపించింది.

తల రేగి, బట్టలు నలిగి, చెక్కిళ్ళమీద చారికలు కట్టి, కళ్ళు ఉబ్బివున్న వసును చూడటంతో ఎంతో దిగులు అయింది. కాని అనునయించవలసిన అవసరమే లేకుండా సూర్యోదయం అయితే చీకట్లు తొలగిపోయినట్లు ఆమెకళ్లలో తృప్తీ, ఆనందమూ, ముఖానికి క్రొత్తఅందం దిద్దుతున్నాయి.

రోజంతా ఆనందంగానే గడచిపోయింది. సాయంకాలం క్రొత్త చీరె జాకెట్టూ ఇచ్చాను. అవి చూచి ఆమె కళ్ళు వలయాలు తిరిగాయి. మెరుపులు మెరిశాయి. ఆమె కను పాపలలో కదిలిన శాంతి క్రమంగా, కనులూ, ముఖం శరీరం అంతా వ్యాపించింది. తృప్తిగా గాలి పీల్చుకొని నిండుగా చూచి, ఉత్సాహంగా అటు తిరిగి, అలవోకగా ప్రక్క గదిలోకి పోయింది.

ఒక్కరొక్కరే ఆహ్వానితులు వస్తున్నారు. మేడమీద పార్టీ ఏర్పాట్లు చేసివుంటే అందరూ అక్కడికే చేరుతున్నారు. అంతలో ఒక యువకుడు - దాదాపు ఇరవైరెండు సంవత్సరాల వయస్సు వుంటుంది - వచ్చాడు. అతన్ని ఎక్కడో చూచినగుర్తు. పలకరించాను. పేరు మధుమూర్తి అనీ, ఫస్టు ఇయర్ యం. బి. లో వున్నాడనీ, వసు క్లాసుమేట్ అని తెలిసింది.

నాకు అకస్మాత్తుగా మామయ్య నన్ను కొట్టినరోజు గుర్తుకువచ్చింది. మధుమూర్తి మామయ్య స్నేహితుడి కొడుకు. ఇతని ఎదుటే ఆరోజు మామయ్య చేయి చేసుకొంది. మాటల సందర్భంలో నేనుగానీ, వసుగానీ, ఫలానా వాళ్ళం అని మధుమూర్తికి తెలియపన్నసంగతి గ్రహించాను. అతన్ని చూస్తే నా కెందుకో బాధ కలిగింది. అంతలో పద్మ వచ్చింది.

పద్మను చూడటంతో బాధపోయి, ఆనందమేకలిగింది. పద్మా, మధూ పరస్పరం విష్ చేసుకొన్నారు. మధు పైకి వెళ్లాడు. ఆమె రావటం విచిత్రంగా కనబడింది. అందుకే అడిగాను.

'పద్మా - మరోలా అనుకోవద్దు. తెలియక అడుగుతున్నాను. నీకు ఆహ్వానం వచ్చిందా ?'

'లేదు.'

మరీ ఉత్సుకత పెరిగిపోయింది. ఆహ్వానం లేకపోయినా ఈమె రావటమంటే ఊహకు అందనిసంగతి. పైగా బహు

మతితో బయలుదేరి వచ్చింది. ఒకవేళ ఇద్దరిమధ్య ఈ ఏడు ఈ కొత్త స్థలంలో స్నేహం ఏర్పడిందేమో! స్నేహితుల మధ్య ఆహ్వానం ఏమిటిలే అనుకొని వచ్చిందేమో! ఆ సంశయ నివారణం కోసం అడిగాను.

'ఇప్పుడు వసూ నువ్వూ మాట్లాడుకొంటున్నారా?'

'లేదు.'

ఈ సః నాసం విచిత్రంగానే వినిపించింది. పిలువని పేమకకు, స్నే లు కాని వారింటికి, ఉ చేతులతో కాకుండా ఉః ంత బహుమానం తీసుకువచ్చింది. పద్మ అంటే సృష్టిలోనే మంచిని అర్థం చేసుకోలేని లోపం. సహృదయతను గ్రహించలేని లోపం ఉందనిపించింది. ఊపిరి సలపలేని స్థితిలో అడిగాను.

'మిత్రుడిలాగా అడుగుతున్నాను. అన్యథా భావించ వద్దు. నీ రాక మాకు ఆనందమే - అయితే పిలవనివోటకు ఎవ్వెందుకు వచ్చావ్?

'రాకూడదా?'

పద్మ కిలకిలా నవ్వింది.

'రాకూడదని కాదు. రావచ్చు. కానీ కారణంలేకుండా రావడం జరగదు కదా!'

'నిజమే! కారణం లేకుండా నేను రాలేదు. అదేమిటో ఇప్పుడు చెప్పలేను. మీకే తెలుస్తుంది త్వరలో ఇంకా ఆహ్వానం అంటారా! - రాలేను - అయితే మీరున్నారని

'తెలుసు. మీతో మాట్లాడకూడదనీ, చూడకూడదనీ, నాకేమీ ఆంక్షలు లేవు. వీళ్ళ ఏర్పరిచేవి అయితే తప్ప ఇతరులు కల్పించేవి నాకు ఆటంకాలే కావు. నన్ను చూడ వద్దు. మాట్లాడవద్దు అని మీరు అనరుకదా!'

నాకు మతి పోతున్నట్లు వుంది. ఎంత సన్నటి పద్మ, ఎంతటి లావు మాటలు మాట్లాడుతుందీ అనిపించింది. ఈ గడుసుదనం ఆమెలో ఎలా చోటు చేసుకుందో తెలియ లేదు.

'రావచ్చు. కానీ, వసు, నీ ప్రజెంటేషన్ తీసుకోక పోతే ఏం చేస్తావ్'

పద్మ వినోదంగా నవ్వింది.

'వసు అంత సంస్కారం లేని మనిషి కాదు. అంతమంది ఎదుట అవమానించి, తను అవమానం పాలుగాదు. నాతో మాట్లాడకపోయినా నా ప్రజెంటేషన్ తీసుకొంటుంది. అప్పు డామె కళ్ళలో తిరిగే ఆనంద తరంగాలు నేను చూడకపోను.'

ఎంత ఆత్మవిశ్వాసం. పద్మపట్ల వున్న అల్లరి చిన్నపిల్ల అనే భావంపోయి గౌరవం ఏర్పడింది. ఆడవాళ్ళ హృదయాలు ఎంత త్వరగానో పంపక్వమవుతాయి. ఆలోచించేకొద్దీ తృప్తే కలిగింది. అందుకే సరదాగా అడిగాను.

'వసు తీసుకోకపోతే... ... ...'

వాక్యం పూర్తిచేయలేదు.

'వసు బర్త్ డే ప్రజెంటేషన్ మీ కిచ్చి వెళతాను. మీరు తప్పకుండా తీసుకోంటారు.'

నవ్వుతూ మెట్లెక్కి గబగబా పైకి వచ్చింది.

లోపలినించి వసు రమ్మంది. విని గబగబా వెళ్ళాను.

తెల్లని పట్టుచీరె కట్టుకొని, జాకెట్టు వేసుకొని ఆరిన కురులతో జడ వదులుగా అల్లుకొని, అందులో సన్నజాజుల మాల తురుంకొని కనులకు కాటుక దిద్దుకొని, చెక్కిళ్ళనిండ సిగ్గులు పులుంకొని నిలబడివుంది ఆమెను చూస్తుంటే నా హృదయంలో ఎవరో గుసగుసలు చెబుతున్నట్లు అనిపించింది.

నేను కూర్చున్నాను. వసు వచ్చి పాదాలకు నమస్కరించింది. నా కెందుకో అది ఇష్టంలేదు అది స్వీకరించే అర్హత నాకు లేదేమో అనిపించింది. అయినా వసును లేవనెత్తాను. ఆ గౌరవం ప్రతి సంవత్సరం మామయ్యకు లభ్యమవుతుంది. నాకు లభ్యమయిన ప్రత్యేకత సిగ్గు తెప్పించింది. ఆ క్షణాలలో బిడ్డ భవిష్యత్తును గూర్చి ఆయన మనస్సులో ఎన్ని భావాలు నిండి వుండేవో, ఆ భావనలు నాలో ఎలా వుంటాయి. ఆ వయస్సు ఏది? ఆ హృదయం ఏది? ఆ ఔన్నత్యం నాలో ఎలా వుంటుంది? ఆశీర్వదించటం కోసమే ఏమో అన్నాను. కానీ, ఆ మాటలు హృదయంలోంచే వచ్చాయి కానీ, మామయ్య పలికే మాటలు హృదయమనే పాల పాత్రను పురగకాస్తే పైకి తేలే మీగడ తరకలు చిలికినట్లు వుండేవికాని, నేను అంత ఆసక్తితో ప్రేమతో ఆదరంతో

ఎలా ఆశీర్వదించగలనూ! మామయ్య ఎదుట నేను ఎంత చిన్నవాడినో అనుభూతిలోనూ అంతే! ఆయన హృదయం ఒక మహాసముద్రం. అందులో ఏ తరంగం లేచినా చల్లని ఆనంద తుషారమే చల్లుతుంది. 'కలకాలం జీవించు తల్లీ'- ఆయన అనటంలో, ఆ మాటలే నేనూ అనటంలో - ఆ భావ తీవ్రతలో ఎంతో దూరంవుంది. వసు కలకాలం జీవించాలని నాకు ఆశవుంది కోర్కెవుంది. కాని అవి ఆమె శిరస్సుమీద అనుగ్రహించే, ప్రసాదించే అధికారం నాకు లేదు. అయితే హృదయంలో వ్యక్తం చేయలేని మమకారం వుంది గనుక. అదే నాకు ఆశీర్వదించి అధికారం అనుగ్రహించి వుంటుంది.

వసు నెమ్మదిగా నడచి, అద్దం ముందుకు పోయింది. నుదుటిమీద కుంకుమబొట్టు లేదు. నేను టేబిల్ డ్రాయర్ లోంచి కుంకుమ భరిణ తీశాను. ఆశ్చర్యముతో నావైపు చూస్తున్న వసుకి భరిణ ఇచ్చాను. వణుకుతున్న చేతులతో అందుకొంది. భరిణ మూతతీసి చూస్తున్న ఆమె కళ్ళలో, కనుపాపలో, తెలుపు నలుపు కూడలిలో, ఆ చుట్టుప్రక్కల కనురెప్పలలో ఒక నూతన కాంతి ఉదయించింది. ఆ కాంతి కళ్ళలో చెక్కిళ్ళలో ముక్కుచుట్టూ వ్యాపించింది. ఆ కాంతి కుంకుములోనుంచి, దాని జీవం, ఆత్మ, అంతరార్థం పరమార్థం ఏవో, ఏమో తీసుకొని కళ్ళలో చేర్చి, ఆ బరువు, ఆ తీవ్రత, ఆ పరిణామం భరించలేక, కళ్ళు మూసివేసింది. మూసిన కనుల వెనుక హృదయ ఉబుకుతున్నట్టు అయింది. ఏ భావాలు అలలులాగా చెలరేగాయోకాని, కళ్ళుమూసుకొనే 'నాన్నా!

నాన్నా !' అని ముమ్మారు మామయ్యను తలంచింది. కనులు తెరిచింది. నావైపు చూచింది. ఆవేశంతో ఊగిపోతుంది. మనిషంతా వణికిపోతూవుంది ముక్కుపుటాలు ఎగిరెగిరి పడు తున్నాయి. పెదాలు చెక్కిళ్ళూ, కళ్ళూ కాళ్ళూ అదురు తున్నాయి. అప్రయత్నంగా నడచింది. అనుకోకుండా నా దగ్గ రకు వచ్చింది. వెర్రిదిలాగా చూచింది. కళ్ళవెంట నీళ్ళు తిరుగుతున్నాయి. చిరుచెమట పట్టింది. 'నాన్నా! నాన్నా! నాన్నా !' అంటూ మీదికి వచ్చింది. మెడ వాలేసుకుంది. 'నాన్నా !' అంటూ వ్రేలాడిపోయింది. అప్రయత్నంగా 'వసూ, లే అమ్మా' అన్నాను. అది హృదయపూర్వకంగా ఆలోచనలేమీ లేకుండా పలికినట్లు భావించి సంతోషించాను. కళ్ళూ చెక్కిళ్ళూ తుడిచాను. మెడ, కనురెప్పలు, నుదురు తుడిచాను. తల స్నానం చేసి ఆరబెట్టుకొన్న తలలో పట్టిన చెమట బిందువులు ముత్యాలు లాగా కనబడుతున్నాయి. నునుపు అదురుతూవుంది. 'లే తల్లీ' అంటూ అత్తమ్మ వసును చేతుల్లోకి తీసుకొంది. అద్దం ముందుకు తీసుకుపోయింది వసు వణుకుతున్న చేతులతో సంతోషంగా కుంకుమబొట్టు పెట్టు కొంది.

ఆ క్షణంలోనే వసు బొటనవ్రేలూ, చూపుడువ్రేలూ కలిపి కుంకుమ తీసి, అత్తమ్మవైపు చూచి, కుంకుమ అలాగే బరిణలో వదిలిపెడుతూ నావైపు చూచింది. నా కళ్లలో నీళ్లు తిరుగుతూ వుండటం చూచి అత్తమ్మ ముఖానికి బట్ట అడ్డం

పెట్టుకుంది. అదే నోటిలో కుక్కుకొంటూ అవతల గదిలోకి వెళ్ళిపోయింది.

మామయ్య బ్రతికివుండగా అత్తమ్మకు కుంకుమ దిద్దే అదృష్టం ఇప్పుడు లేదు వసుకు. అది తాల్చే అదృష్టం ఆమెకు లేదు. వాళ్ళ నుదుళ్ళపై ఎర్రని కుంకుమతో ఉదయించే సూర్యుల్ని చూచే అదృష్టం నాకు లేదు

అప్పటికే చాలామంది స్నేహితులు అక్కడికివచ్చారు. మధుమూర్తికూడా ఎందుకో అక్కడికే వచ్చాడు. అందరి ఆడవాళ్ళ నడుమ మే మిద్దరమే మగవాళ్ళం. ఇక ఉండబుద్ధి కాలేదు. అత్తమ్మ వున్న గదిలోకి వెళ్ళాను. మధు డాబాపైకి పోయినట్టు గమనించాను.

గదిలో అత్తమ్మ ఏడుస్తూ వుంటుందను కున్నాను. అదేమీలేదు. నిర్వికారంగా కూర్చునివుంది. అది సంతోషం అవధి దాటిన స్థితో, ఆనందం సంపూర్ణమయిన పరిధో, దుఃఖం పొంగుతున్న సముద్ర గర్భమో, లావా రేగుతున్న అగ్ని పర్వతమో, నేను పోల్చుకోలేక పోయాను.

మేం అత్తమ్మను అనునయించటానికి ప్రయత్నిస్తున్నాం. మా యిద్దరినీ తనకున్న రెండు చేతుల క్రిందికి తీసుకొని, కోటి హస్తాలతో సంరక్షణ అనుగ్రహించే దేవతా మూర్తిలాగా 'మీ రిద్దరూ కలకాలం జీవించండి' అని అశ్రుసిక్త నయనాలతో ఆశీర్వదించింది.

ఆ అమృత వాక్కు రసనాగ్రంలో లాస్యంచేసే రెండు క్షణాలూ అత్తమ్మ ముఖంలో అనంత విశ్వ రహస్యమే కన

బడింది. ఆమాట హృదయం పలికిందిగానీ, నాలుక, పెదాలు, నోరు, ఉచ్చరించిన అక్షరాలు కావవి. ప్రత్యక్షరం నేరుగా గుండెలోంచి తొలుచుకు వచ్చింద! అప్పటి ఆమె ముఖంలో గంభీరత, ఆర్ద్రత, తీక్షణత నాకు తెలియని భగవంతుని స్వరూపం లీలగా కనబడేటట్లు చేసింది. అమృతమయ మయిన ఆ హృదయంలో లేచిన కాలమేఘాలు అమృతమే వర్షించాయి.

ఆరోజు వసుకు చాలా బహుమానాలు వచ్చాయి. మాకు నచ్చింది, పద్మ ఇచ్చిందీ! అగరువత్తులు వెలిగించు కొనే సెమ్మె!

ఆ సంవత్సరం వేడుక ఆనందంగా జరిగిపోయినట్టే కాని మామయ్య లేని లోపం, అడుగడుగునా అన్ని పనుల్లో కొట్ట వచ్చినట్లు ప్రత్యక్షమయింది. ఆ లేమి తొలగించాలని నేను చేసిన ప్రయత్నం వ్యర్థమే అయింది. మా యిద్దరి పట్లకంటే అత్తమ్మ విషయంలో ఆ లేమి ద్విగుణీకృత మయింది. ఆ లేమి తీరదు. మామయ్యను మేం ఎన్నటికీ చూడలేము!

గెస్ట్సు అందరూ గుడ్ విషెస్ చెబుతూ వెళ్ళిపోయారు. మేం ఆ యింట్లో, ఆనందంతోనూ, విచారంతోనూ మిగిలి పోయాం.

## 8

రెండోరోజు సాయంకాలం బీచ్ నుంచి తిరిగి వచ్చే సరికి పద్మ వరండాలో కూర్చునివుంది. ఎందుకు వచ్చిందో ఒంటరిగా ఎందుకు కూర్చునివుందో తెలియదు. ఆశ్చర్యం కలిగింది. లోపలికి వస్తుంటే నోటిమీద వేలు వేసుకొని వచ్చి కూర్చోమన్నట్లు మాట్లాడవద్దు. అన్నట్లు సౌంజ్ఞచేసింది. నాకు ఏమీ తెలియలేదు. కానీ ఆమె కెదురుగా కూర్చున్నాను. లోపల ఏం జరుగుతుందో వినమన్నట్లు సైగ చేసింది.

'కాఫీ బాగుంది. రియలీ వండర్ ఫుల్.

అది మగ గొంతుక. ఎక్కడో విన్నట్లుగుర్తు. స్పష్టంగా మనిషిని పోల్చుకోలేక పోయాను.

'థాంక్స్!'

అది వసు కంఠం.

ఎవరో స్నేహితుడు వస్తే కాఫీ ఇచ్చింది కాబోలు.

'డాక్టర్ మాధవ్ మీనాన్న తమ్ముడా!'

ఆ మీమాంస నాగురించే! వసు సమాధానం వినాలని ఆతృత కలిగింది. ఆ తొందరపాటి ముఖంలో ఏ భంగిమలు తెస్తుందోనని భయమూ కలిగింది. పద్మ నాముఖంలోకి చూస్తువుంది. సిగ్గు కలిగింది.

'అంతకంటే పూజ్యులు!'

నాలో గర్వరేఖలు పొంగి వుంటాయి. లేకపోతే చిరునవ్వులు చిందించవలసిన అవసరం పద్మకేమీ లేదు!

ఉన్నట్టుండి పద్మ ముఖంలో మెరుపులు కనిపించాయి. అలలపై చంద్రకాంతి పడి తళుకులు కలిగించినట్లుగా వుంది ఆమె. అంతగా ఉప్పొంగి పోవలసినదేమీ కనిపించలేదు. అయినా ఆమె మనస్సు ఎలా తెలుసుకోగలనూ!

వసూ! ...వుగా పిలుస్తున్నాను. ఏమీ అనుకోవద్దు.'

'ఫరవాలేదు!'

నాకు కష్టం కలిగింది. ముఖంలో రంగుమారివుంటుంది. కోపంకూడా వచ్చింది ఆమెలోనూ కళ మారిపోయింది. నాలో వచ్చే మార్పు ఆమెలో వస్తూవుంది. ఆ ముఖం నా ముఖానికి ప్రతిబింబం కాదుగదా! అనిపించింది. విచారంలోనూ ఆనందం కలిగింది.

'ఒక విషయం చెప్పాలని వచ్చాను.'

'ఊఁ!'

లోపలికి పోదామనుకొన్నాను. పైకిలేచాను. పద్మ వారించింది నెమ్మదిగా కూర్చున్నాను.

ఆమె ఎందు కడ్డగించిందో తెలియదు. నేను ఆగిపోవటమేమిటో తెలియలేదు. ఆమె సైగచేయటం, కాదూ కూడదూ అని నోటిమాటయినా లేకుండా ఆమె చెప్పుచేతుల్లో వున్న మనిషిలాగా కూర్చోవటం అంతుపట్టలేదు.

వ్యక్తం చేయదలుచుకొన్న భావమేమిటో, వసు వినటానికి అనుమతించిన తరవాతకూడా చెప్పటానికి ఇంత ఆలస్యం ఎందుకు చేస్తున్నాడో అర్థంకాలేదు.

'హృదయం విప్పి చెప్పుకోవాలని వచ్చాను. ఆగ్రహించకపోతే.........'

ఆపైన చెప్పలేకపోయాడు. ప్రతిపదమూ తూచి తూచి పలుకుతున్నట్టే అనుకొంటూ తొందరలో అక్షరాలు మింగేస్తున్నాడు.

ఎంతసేపటికి జవాబు వినిపించలేదు. కానీ గాఢమయిన నిట్టూర్పుశబ్దం వినిపించింది. వసు నిట్టూర్పో అతని నిట్టూర్పో అర్థంకాలేదు.

బహుశా వసు తల వూపి వుంటుందో, లేకపోతే ఆతనే సమాధానంకోసం అధికంగా ఆగలేకపోయాడో ఏమోకాని మళ్ళీ మాట్లాడాడు.

'నా ఉద్దేశ్యం చెబుతాను.'

వసు ప్రత్యుత్తరం ఇవ్వలేదు. ఆలస్యంగా అనుమతిస్తుందో, అవాంతరంగా వారిస్తుందో, అభిమతంతో ప్రోత్సహిస్తుందో వినాలనేవుంది. లోపలికి పోవాలనేభావం తొలిగిపోయింది. దాని స్థానంలో ఏం జరుగుతుందో గమనించాలనే ఆసక్తి పెరుగుతూవుంది

పద్మ కనురెప్పలు ఆర్పుతూ కూర్చుంది. ఆత్రంతో వుంది. అది అనాసక్తమయిన ఆతృతకాదు. ఆమె నాకు

ప్రతిరూపం అయితే ఆలోచనే లేదు కానీ, అంగీకరించేందుకు వీలు అగుపించలేదు.

'నిన్ను నేను ప్రేమిస్తున్నాను.'

చెప్పాడు. వసు విని వుంటుంది. ఏమనుకుందో తెలియదు. నేనూ విన్నాను. హృదయంలో కొంకీలకత్తి గుచ్చినట్లు వుంది. ప్రాణం విలవిలలాడింది. తల దిమ్మెక్కిపోయింది.

వసు సమాధానం కోసం ఆత్రంగావున్నాను. అటువంటి అనుభూతి ఎప్పుడూ పొందలేదు. ఆమె అసలు మాట్లాడలేదు. అవి అనిష్టమనుకొంటే ఆనందం, మౌనం అర్ధాంగీకారం అనుకొంటే యమయాతన కలుగుతున్నాయి.

పద్మకు నాబాధ తెలిసిపోతుందేమోనని శంక కలిగింది. ఈ బాధ కంతకూ కారణం పద్మే! ఆమె రాకపోతే, తనని ఆపకపోతే, ఇదంతా వినవలసి వచ్చేదికాదు. అసలు ఆమె ఎందుకు వచ్చింది?

నాకోసమయితే వచ్చినసంగతి చెప్పి వెళ్ళిపోవచ్చు నోరు కదపకుండా ఆగి పోనక్కరలేదు. వసుతో పనివుండి వచ్చివుంటే ఇది తగిన సమయం కాదు కాబట్టి వెళ్ళిపోవచ్చు.. ఆ లోపలున్న వ్యక్తికోసమయితే ఇక్కడ వుండటం వల్ల ఆ సంభాషణ వినటంవల్ల ప్రయోజనంలేదు. మరి ఆమె ఎందుకుంది! ఎందుకు సంభాషణ వినాలని ఆతృత పడుతూ వుంది!

'నువ్వెంతసేపటికీ మాట్లాడకపోతే నాకు బాధగా వుంటుంది... ...వసూ!... ...ఇంతలో మూగవయిపోలేదు

కదా !......నేను చెప్పింది వినిపించిందా ?......చెవుడు వచ్చిందా ?......తెచ్చి పెట్టుకొన్నావా......మాట్లాడితే నీ నోటి ముత్యాలు రాలిపోవు......నీ సౌందర్యం ఆరాధించే వాడిని......భిక్షార్థినై వచ్చాను ...... కాదనవద్దు...... అంగీకరించితేఅనంతం అవతలి అంచులు జయించినంత ఆనందం పొందుతాను.......కాదంటే.......కాదంటే.........నే నూహించలేను......హృదయమే పగిలిపోతుంది......అవు ననటానికి ఆలస్యం వద్దు......ఈ వ్యవధి నేను భరించలేను. కాదనటం అయితే...వద్దు వద్దు వసూ !...ఏమీ మాట్లాడ వద్దు... ఈ నిశ్శబ్దం అయినా భరించగలనుగానీ...తిరస్కారం సహించలేను...నా కక్కర లేనిమాట వినలేను...విషంలాగా వుంటుంది...నా సుందర స్వప్నం మధ్య అనిమాత్రం చెప్ప వద్దు...నా గుండె బలహీనత మయింది—పెడమాట తట్టుకో లేను—నా ప్రేమ—ఎడారిలో మొలిచిన పిచ్చిమొక్క కాదు. —హృదయ కాసారంలో వికసిన పద్మం—నీ జీవితం— నీ సౌందర్యం—అడవికాచిన వెన్నెలలాగా—వసూ ! వృథా కాకూడదు—నువ్వు శిలవో—మానువో—తెలియటంలేదు —చేతనంలేని నిన్ను చూస్తుంటే అజంతా శిల్పాలు గుర్తుకు వస్తున్నాయి—నీ కనురెప్పలుకదులుతున్నాయి—సజీవంగా వున్నట్టే—నువ్వు పీల్చే గాలి నేను విశ్వసించిందే !—ఏమిటీ నిశ్శబ్దానికి అర్థం—దాసుడిని యజమాని దండించవచ్చు— నన్నేమయినా చేయి—కానీ బాధించకు—కన్నెత్తిచూడని కర్కశత్వం అన్యాయం వసూ !—దాసోహం అన్నవాడిని కాపాడకపోవటం — కరుణ చూడకపోవటం — ఎవరూ

చేయలేరు. గాలిలో తేలివచ్చిన స్వెలతీగె కాలికి చుట్టుకొంటే —కరినంగా నలిగ్ ద్రొక్కిపోక చేతితో తీసుకొని—కంటితో చూచి —ఎక్కడ పుట్టిందో పెరిగిందో ఇక్కడ ఇలా అయిందని జాలి తలచి అయినా దూరంగా పారేస్తారే!—ఆపాటి జాలి కూడా లేదేం నీకు ?—భగవాన్.'

పోటు పుట్టి, అల్లకల్లోలంగా తరంగాలు లేచి, నిరంతరంగా ఘోషించి, మేరమీరి శాంతించింది హృదయసముద్రం. వ్యధ చెప్పుకొన్నాడు. సమాధానం ఎలావుంటుందో! హాలాహలమే పొందుతుందో అమృతమే ఉబుకుతుందో అనూహ్యమే!

నాకు చెమట పుట్టింది. కళ్ళు తడి అయ్యాయి. ఆతృత ఏమీలేదు. ఏది ఎలా జరగవలసివుంటే అలాగే జరుగుతుంది. ఎవరూ ఏదీ ఆపలేరు. చేయించలేరు. పూవును పుష్పించవద్దు అని శాసిస్తే ఆగిపోదు. పుష్పం సౌరభం వెదజల్లవద్దని ఆజ్ఞాపిస్తే నిలిచిపోదు. సముద్రంలో అలలు లేవవద్దని చెప్పటానికి శక్తి చాలదు. కొండను నేలమట్టం కమ్మని బోధించటం వ్యర్థ ప్రసంగమే !

కాని పద్మ ఏడుస్తూవుంది. కన్నీరు చెక్కిళ్ళపై మున్నీరై కాల్వలుకట్టి జారుతూవుంది. నిష్కారణంగా ఎవరూ విలపించరు. ఆనందం విచారం అనవసరంగా కలగవు. ప్రేమా క్రోధం ఉన్నట్టుండి ఏర్పడవు. ఊరికే ననలు తొడగవు. పద్మ నాకు ప్రతిబింబమే అయితే నా కళ్ళలోంచి జారని నీరు ఆమె కళ్ళలో కనిపించకూడదు. అయితే ఆమె నా హృదయానికి బాహిరరూపం కావచ్చు ఆ వ్యక్తిపైగాని పద్మకు అనురాగం

వుందేమో ! అలే మొగ్గుతూవుంది ఆలోచన. అయితే కోరి కోరి ఎవరూ కొనుక్కోని దుఃఖాన్ని ఈమె ఎందుకు కొలుస్తూ వుంది. అదే అంతు చిక్కని, రహస్యం, కాలి బొటనవ్రేలి గోరు నాపరాళ్ళ మధ్య సున్నం గీతలో అడ్డంగా వంచుతూ వుంది. వీలుతప్పితే గోరు మొదట్లోకి విరిగిపోవచ్చు.

ఎంతకీ వసు జవాబు చెప్పకపోవటం చిరాకు కలిగింది. ఆమె కంఠస్వరం మృదువుగా, కఠినంగా, నెమ్మదిగా, తీవ్రంగా వినిపించింది.

'క్లాస్‌మేట్ కదా ఇంటికి వచ్చాడని కాఫీ ఇచ్చాను. కాసేపు కూర్చునే ప్రయత్నంలో వుంటే కాదనలేకపోయాను. కాలక్షేపంకోసం కబుర్లాడు తున్నాడనుకొంటే కాకపోయింది. కానీ తూలనాడ లేకపోయాను. ఆత్మీయత పోయి అర్థం పర్థం లేని అలవాట్లు ప్రబలిపోతున్న మనుష్యుల మధ్య అదరణతో పిలుస్తుంటే ఫరవాలేదన్నాను. మనిషినిపట్ల మర్యాదచూపాలి కాబట్టి ఎంత ఇష్టంలేని మాటలయినా విన్నాను. కారణం ఎదుట మనిషిని నొప్పించటానికి ఇష్టంలేకే! మౌనంగా వింటున్నదంతా ఇష్టమయిందే అనుకొంటే భ్రమపడ్డట్లే ! స్వేచ్ఛగా నోటికి వచ్చిందంతా మాట్లాడే అధికారం నేనెవరికీ ఇవ్వలేదు. ప్రేమించటం ప్రేమింపబడటం తప్పుకాదు. కాని, పాత్రత, అర్హతఎరిగి ప్రవర్తించటంఉచితం. హద్దులుమీరటం అవధులు అతిక్రమించటం ఎవరికీ ఎప్పుడూ మంచిదికాదు. మంచిపని చేయమని, చెడ్డపని చేయవద్దని చెప్పగలనేకాని అలా చెప్పవలసిన అవసరమేలేదు. ఒక్క విషయం గుర్తుంచు

కోవచ్చు. నా దగ్గర ఎప్పుడూ ఇలాంటి ప్రస్తావన తేకూడదు. ఈ దృష్టితో నన్ను చూడనేకూడదు. ఆ భావం హృదయం లోంచి తొలగి పోకపోతే నన్ను చూడకూడదు. మాట్లాడ కూడదు. ఇక వెళ్ళవచ్చు'

వసు అంత నిష్కర్షగా ఎలా చెప్పిందో తెలియదుగాని పరమానందం కలిగింది. నా హృదయం మరింత ప్రకాశంతో వెలుగుతూవుంది.

పద్మ తృప్తిగావుంది. పరవశించి పోతూవుంది. ఆమె ఆనందానికి అవతలిగట్టు లేదు. ముఖం వికసించింది. వెన్నెలే నడచిపోతున్నట్లుంది ఆమె వదనంలో.

'వసూ! నువ్వు చెప్పింది అంతా విన్నాను. నాపట్ల నీ నిర్ణయం మారింది. అయితే ఏమి చేయగలను. నువ్వు పాషాణం వంటి మనిషివి కాబట్టి నీలో కరుణలేదు. జాలి లేదు. కరిగిపోయే స్వభావములేదు. పైగా కాఠిన్యం వుంది. నీ యిష్టానికి భిన్నంగా ప్రవర్తించలేదు. నిన్ను ప్రేమిస్తు న్నాను. కాబట్టే, నీమాటల - సేవకుడు యజమాని మాటలు శిరసావహించినట్లే - తల దాల్చుతాను. కాబట్టి, నిన్ను చూడను. చూచినా మాట్లాడను. కాని ప్రతిక్షణమూ నీవైపుకి ఆకర్షింపబడుతూ నన్ను నేనుదూరంగా లాక్కుపోతూవుంటాను. నిన్నుతప్ప ఎవరినీ ప్రేమించలేను. ప్రత్యక్షంగాకానీ పరో క్షంగాకానీ నువ్వే నా జీవితం. వస్తాను.'

అతను వెలుపలికి వచ్చాడు. మధుమూర్తి! నా నరా లలో విద్యుత్తు ప్రవహించినట్లు అయింది. రెప్పపాటుకాలం

అతను నన్ను చూచాడు. చూపులు చెదిరిపోయాయి. మరు క్షణం పద్మను చూచాడు. ఆశ్చర్య పోయాడు. ఎవరూ మాట్లాడే అవకాశం లేకుండా మధు వెళ్ళిపోయాడు.

బాధ వున్నా, సంతోషమూ వుంది. కళ్ళలో హృదయం అశ్రువులు లేవు. పద్మ ఏడుస్తుంది. నాకు ఏవిధంగానూ ఈమె ప్రతిరూపం కాదా అనిపించింది.

'పద్మా !' పిలిచాను.
'ఊఁ !' అంది, దుఃఖం దిగమ్రింగుకొంటూ.
'నువ్విక్కడికి ఎందుకు వచ్చావ్ ?'
'రాకూడదా ?'
'రావచ్చు. కానీ ఎందుకూ !'
'మీకోసం.'

'నాకోసమా ?' నా కంఠంలో అపనమ్మకం ధ్వనించి వుంటుంది.

'అవును' చాలా స్థిరంగా చెప్పింది. కానీ స్వరంలో బలహీనత వినిపించింది.

'నువ్వు ఏడ్చింది ఎందుకు ?'
'తెలియదు.'
'నవ్వింది ?'
'తెలియదు.'
'తెలియకుండా నవ్వావా ? ఏడ్చావా ?'
'నవ్వటం ఏడ్వటం తెలుసు. కాని కారణం తెలియదు.'
'ఈ తెలియని తనంలో . . .'

'ఆనందం వుంది !'

'నాకోసం వచ్చానన్నావు. ఏం పనీ ?'

'తెలియదు.'

'చూడటానికా ?'

'కాదు !'

'మాట్లాడటానికా ?'

'కాదు !'

'మరి ?'

'ప్రశ్నించ చేసుకోటానికి. ప్రతి ప్రశ్నకూ తెలియదనో, కాదనో సమాధానం చెప్పటానికో.'

'నీకు పిచ్చి లేదుకదా !'

'లేదు !-లేదా !- లేకపోవట మేమిటీ - వుంది !— వుందా ? లేదు !—ఏమో నాకు తెలియదు. అదిగో మళ్ళీ తెలియదన్నాను.'

నాకు నవ్వు వచ్చింది. నవ్వేశాను. పద్మ నవ్వింది. లేచి నిలబడింది.

'వస్తాను.'

'వెళతావా ?'

'ఆఁ !'

'అప్పుడే !'

'ఆఁ !'

'రావటం పోవటం నీ యిష్టమేనా ?'

'కాదా ?'

'కాదు !'

'ఎందుకని ?'

'తెలియదు.'

నవ్వేశాను పద్మ నవ్వింది.

'నా సమాధానాలు నాకే అప్ప చెబుతున్నారా ?'

'తెలియదు ?'

మళ్ళీ నవ్వింది.

'ఇక్కడిదాకా వచ్చారు. వచ్చింది. ఎందుకయినా కానీండి. కాస్త కాఫీ తీసుకొని మరీ వెళ్ళండి.'

'ఇప్పుడు వద్దు.'

'వాట్లల్లో ఏం తిండో ఏమో - అసలే సన్నటి మనిషివి. మరీ చిక్కి సగమయి పోతున్నావు'

'చిక్కా - ఎవరికి చిక్కి ?'

'చిక్కా ? - ఎవరికి వచ్చింది చిక్కు ?' అంటూ వసు వరండాలోకి వచ్చింది. పద్మను చూచి నవ్వింది.

నావైపు తిరిగి 'ఎంత సేపవుతుంది వచ్చి' అంది, అనుమానంగా, భయంగా.

ఇప్పుడే ! తోవలో పద్మ కనిపించింది. వెంట తీసుకు వచ్చాను. మేం ఇలా వచ్చామో లేదో నువ్వు వెలుపలికి వచ్చావు.

'ఉండండి' అంటూ లోపలికి పోయింది. రెండు క్షణాలలో మూడు గ్లాసులతో కాఫీ తెచ్చింది.

వసును చూస్తుంటే పవిత్ర హిమాలయ పర్వత శిఖరాగ్రాలు దృష్టిలో మెదులుతున్నాయి.

కాఫీ తాగుతూ కూర్చున్నాం. వసు పలికింది.

పద్మా నీ ప్రజెంటేషన్ మాకు చాలా నచ్చింది. పార్టీ అయింతరవాత వెదికితే నువ్వు కనుపించనేలేదు.

'త్వరగా వెళ్ళిపోయాను. అది వచ్చినందుకు థాంక్స్.'

'పద్మా! నువ్వంటే నాకెంతో ప్రేమ. కోపమేమీ లేదు.'

'నాకూను.'

'బాగుంది మీ రిద్దరే మాట్లాడుకుంటారా - లేక నాతో ఏమయినా మాట్లాడతారా?'

నేను మాట్లాడాను.' వాళ్ళ సంభాషణ ఆపుతూ.

'మాట్లాడుతూ వుండండి. వస్తాను.'

ఖాళీగ్లాసులు తీసుకొని వసు లోపలికి పోయింది.

'పద్మా! హాస్టల్లో ఎలా వుంది?'

'తెలియనట్లు అడక్కండి!'

'ఆడవాళ్ళ హాస్టల్ సంగతులు నాకెలా తెలుస్తాయి?'

అంతలో వసు వచ్చింది.

'వసూ! పద్మ సరీగా అన్నం తినటంలేదో ఏమో మరీ సన్నబడి పోతూవుంది - బాగా అన్నం తినమని చెప్పు!'

'మీరు తినిపిస్తే బాగా తింటుందేమో - మీరు అడిగితేనే బాగా వుంటుంది' అంటూ నవ్వింది. చేతిలోవున్న పూలు పద్మ తలలో పెట్టింది. కుంకుమ బరిణ - బంగారు

కుంకుమ బరిణ - నేను తెచ్చింది - మూతతీసి బొట్టుపెట్టి, మళ్ళీ మూతవేసి, పద్మకు అందించింది. చేయి పట్టుకుంటూ 'అప్పుడప్పుడూ ఇక్కడికి వస్తూవుండవే' అంది.

'అలాగేనే' అంది పద్మ.

అసంకల్పితంగా నానేత్రాలలో అశ్రువులు కదిలాయి.

## 9

హైద్రాబాద్‌స్టేషన్‌లో రైలెక్కుతూవుంటే బాధేమీ కలగలేదు. పట్నంతో సంబంధం తొలిగింది అనుకొంటే ఆనందమే కలిగింది. హృదయంతో సంబంధించినంతవరకు పొందిందీ, పోగొట్టుకొందీ ఏమీలేదు. చదువుకున్నందుకు డిప్లొమా మాత్రం వెంట వస్తూవుంది. టి. డి. డి తెచ్చుకొన్నా టి. బి. నయం చేయగలనన్న అచంచలమైన గర్వమేమీలేదు. చదువు విషయం, జీవితంతో పోల్చిచూస్తే అల్పత్వమే గోచరమవుతుంది.

తెనాలి రాగానే స్వంత ఇంటిలోనే ప్రాక్టీస్ పెట్టమని అత్తమ్మ కోరింది. అదెందుకో ఇష్టంలేకపోయింది. ఇంట్లో ఏ గదిలో తిరిగినా మామయ్యే గుర్తుకు వస్తున్నాడు. ఆ జ్ఞాపకాలు కలిగితే చిన్ననాటి వాడినే అయిపోయాను. బాధకూడా కలుగుతుంది. పోనీ అత్తమ్మ వసు అయినా వుంటే ఆ దోవ వేరు. అదీవీలుకాదు. వసు చదువుకోసం వైజాగ్‌లో కాపురం పెట్టిన అత్తమ్మ ఎప్పుడో ఒకసారి వేసవిలో వస్తుంది. ఒకనెలలో

రెండుమూడు నెలలలో వుంటుంది. పోతే సంవత్సరంలో మిగతాకాల మంతా ఒంటరిగా - ఒంటరిగా గడపాలంటే నాకు పిచ్చి ఎక్కినట్టు వుంటుంది.

వాళ్ళు లేకుండా ఉండలేనని కాదు. ఉండగలను. కానీ మా యింట్లో మాత్రంకాదు. ఎక్కడయినా అయితే అభ్యంతరం లేదు.

అమ్మను బ్రతికించుకొందామని టి. బి. స్పెషలిష్టు నయ్యాను. అమ్మ పోయింది. నేను ఉపయోగ పడకుండానే అమ్మ గతించిపోయింది. నా తల్లి మరణం నాకెంతో బాధ. ఎవరి తల్లి మరణించినా ఎవరయినా అంతే బాధ పడతారు. లోకంలో ఉన్న తల్లులు ఎందరో టి. బి. తో బాధపడుతూ వుండవచ్చు. చదువుకొని ప్రయోజకుడినయి, లోకానికి నిరుపయోగంగా తయారయితే దానివల్ల తల్లికీ, ధరణికీ తీరని బాధే! పుణ్యలోకాలలో వున్న అమ్మ, తన బిడ్డను చూచుకొని గర్వంగా, తృప్తిగా, ఆనందంగా పొంగిపోవాలంటే నా చదువు వృధా కాకూడదు. మదనపల్లి శానిటోరియంలో ఉద్యోగం సంపాదించు కోవాలనుకొన్నాను. వెంటనే బయలు దేరాను.

మదనపల్లి ఎంత అనుభూతి కలిగించింది. అంతఆరోగ్య వంతమయిన ప్రదేశం అంతకుపూర్వం ఎక్కడా చూడలేను. శానిటోరియం - అన్నిహంగులూ ఉన్న పట్టణంలాగా వుంది. దైనందినావసరాలు అన్నీ అక్కడే లభ్యమవుతాయి అది చాలా విశాలమయింది. నాలు గయిదు మైళ్ళు పొడవూ

అంతే వెడల్పూ వుంటుంది. కాని ప్రవేశిస్తున్నప్పుడు ఈ కొంచెమేనా శానిటోరియం అనిపించకపోదు. లోపలికి పోతున్నకొద్దీ విశాలంగా నబడుతూవుంటుంది. చాలా కాటేజెస్ వున్నాయి. చాలా బీదవాడు మొదలుకొని మరీ ధన ధనవంతుడు వరకు అందరూ నివసించటానికి యోగ్యంగా కాటేజెస్‌వున్నాయి జనరల్ వార్డ్‌వుంది. స్పెషల్ ఎయిర్ కండిషన్ భవనాలూ ఉన్నాయి. రెండు కాటేజెస్‌కి మధ్య ఎంతో దూరం. అలాగే ప్రతి రెండు భవనాలమధ్య దూరం వుంటుంది. డాక్టర్స్ క్వార్టర్స్, నర్సెస్ క్వార్టర్స్‌వున్నాయి. హోటల్స్, విశ్రాంతివసతులూవున్నాయి. శానిటోరియంఅంతా పర్వత ప్రాంతంలోవుంది. ఎత్తు పల్లాలూ, మిట్టలూ, గుట్టలూ వల్ల కాటేజెస్, అన్ని కట్టడాలు ఎదుడుదిగుడుగా వున్నాయి. ఎన్నో చెట్లు. ప్రతి కాటేజ్ చుట్టూ లెక్కలేనన్ని చెట్లు. ఒక కాటేజ్‌లోంచి చూస్తే సాధారణంగా మిగతా కాటేజెస్ కనిపించవు. ప్రకృతి ప్రశాంతంగా సమశీతలంగా ఆనందదాయకంగా వుంటుంది. ఆ శానిటోరియం చూడటంతో హృదయం ఉద్రూత లూగిపోయింది.

దాని మేనేజ్‌మెంటుఅంతా యూరోపియన్స్ చేతుల్లో వుంది. డాక్టర్సు అందరూ - దాదాపు - యూరోపియన్స్! చాలామందికి తెలుగు స్వచ్ఛంగా వచ్చు. రోగిపట్ల వాళ్ళు చూపే శ్రద్ధా, ఆసక్తి, జాగ్రత్త నన్ను ముగ్ధుడ్ని చేశాయి. ఏపని చేసినా నిశితంగా, నేర్పుతో చేసేవారు. వాళ్ళ కృషి చూచి పరవశించి పోయాను. వాళ్ళవద్ద నేర్చుకోవలసింది

తెలివితేటలు కాదు. విద్యకూడాకాదు కృషి! నిరంతరకృషి! శ్రద్ధ!! మొక్కవోని శ్రద్ధ!! దీక్ష!!! అచంచలమయిన దీక్ష!!! - ఇంకా నేర్చుకొన్నాను అక్కడ. రోగికి మందు కంటే ప్రకృతి పరమౌషధం. మందుకంటే మంచిమాట ముఖ్యం!

అది మిషనరీ హాస్పటల్ కావటంవల్లకైస్తవులుకాని డాక్టర్లకు ఉద్యోగావకాశం ఆకాశపుష్పమేఅయింది. అయినా వెళ్లాను. అధికారుల్ని కలుసుకొన్నాను. ఉద్యోగం ఇచ్చే వీలులేదని ఖచ్చితంగా చెప్పారు. అక్కడ డాక్టర్లు అందరూ ఫారిన్ డిగ్రీలు ఉన్నవాళ్ళే! నా పట్టుదల చూచి అధికారి అన్నాడు. నీకు సేవచేయటమే ఇష్టమయితే ఇక్కడెలాగూ యథాశక్తి కృషి జరుగుతూవుంది. కాబట్టి మరోస్థలంలో ఇలాంటి ఏర్పాటుచేస్తే బాగుంటుంది' అని. నిజమే అనిపించింది. కాని ఇంత భారీ ఏర్పాటు చేయటం కుదురుతుందా ?- నాకు వెళ్ళటానికి ఇష్టం కలగలేదు. నేను 'నాకు జీతం వద్దు. నే నిక్కడ ఉద్యోగం చేయను. విద్యార్థిగా వుంటాను. రోగుల్ని, రోగ లక్షణాలనీ, మనుష్యుల్ని మనస్తత్వాలనీ, మానవత్వాన్నీ నేర్చుకోనీయండి' అన్నాను.

అధికారులు అభ్యంతరం చెప్పలేదు. డాక్టర్స్ క్వార్టర్స్‌లో నాకూ నివాస భవనం ఇచ్చారు. రెండోనెలలో ప్యూను వచ్చి, పిలిస్తే ఆఫీసుకిపోయాను. అపాయింట్ మెంట్ ఆర్డరిచ్చారు. ఒకనెల జీతం ఇచ్చారు. అంతజీతం - అసలు జీతమే నేను ఊహించలేదు. అక్కడ డాక్టర్లు మొదట్లో ఎంత

జీతంతో జీవితం ప్రారంభిస్తారో అంత జీతం నాకూ ఇచ్చారు. నా ఆనందానికి హద్దుల్లేకుండా పోయాయి.

నాసంతోషం నాఒక్కడిదేకాదు. అందులో అత్తమ్మకూ వసుకూ భాగంవుంది. నాతృప్తి, నా ఉత్సాహం వాళ్ళతో పంచుకోకపోతే నాకు నిద్రవుండదు. ధర్మవరం పట్టుచీరెలు నాలుగు తీసుకొని ... పంపించాను. సంతృప్తితో జవాబు వ్రాశారు. ... ఆనందం కలిగింది.

ఆ స్థితిలో ఎలావున్నానో చూచుకోవా లనిపించింది నిలువుటద్దం ముందు నిలబడ్డాను. ప్రతిబింబం కనబడుతూవుంది కళ్ళు నల్లగా విశాలంగా ముద్దు వస్తున్నాయి. నుదురు వెడల్పుగా అందంగావుంది. ముక్కు కోటేరులాగావుంది. మరీ మరీ చూచుకోవాలనిపించింది. జుత్తు వంకీలు తిరిగి, చక్కగా వుంది. దొండపండువంటి శరీరం చాయ ఆనందం కలిగిస్తూ వుంది. ఎత్తుగా, లావుగా పుష్టిగావున్న శరీరం నన్నే ముగ్ధుణ్ణి చేస్తూవుంది. గాలి పీల్చి వదులుతూవుంటే చెస్ట్ ఎంతో ఎత్తు ఉబుకుతూ వుంది.

ఉన్నట్టుండి పద్మ ఊపిరితిత్తుల్లో కదిలింది. అప్పుడు ఆమె విషయమే మరచి పోయాను. చీరెలు పంపలేదు. సరికదా ఉత్తరమయినా వ్రాయలేదు. తప్పు జరిగిపోయింది. వెంటనే ఉత్తరం వ్రాశాను. అందు కామె చాలా ఆలస్యంగా జవాబు వ్రాసింది. ఆ ఉత్తరం నిండు గుండెతో అరమరికలు లేకుండా వ్రాయలేదు. హృదయం ఒక నల్లని తెరతో రెండు

భాగాలు చేసుకుందేమో అనిపించింది. పద్మ ఉత్తరం నిరాశే కలిగించింది.

ఒకరోజు జనరల్ వార్డులో రోగులను చూచి, వెలుపలికి రాగానే డాక్టర్ ఎల్మర్ ఆడమ్స్ - సీనియర్ యూరోపియన్ డాక్టర్ ఎదురుగా వచ్చి, ఆప్యాయంగా భుజం తటి, ప్రేమగా కళ్ళలోకి చూస్తూ చెప్పాడు.

'నువ్వు చేస్తున్నపని చాలా సంతృప్తిగా వుంది. డ్యూటీలో హద్దులు మరచిపోవద్దు. టి బి. అంటువ్యాధి అని చెప్పనక్కరలేదు. రోగులదగ్గర అంతసేపు ఉండవద్దు. జాగ్రత్త!'

వెంటనే జవాబు చెప్పాను.

'వాళ్ళలో ఒకడినిగా, ఆత్మీయుడినిగా వుండకపోతే; నువ్వు రోగివి, నేను డాక్టర్నూ అన్నట్లు ప్రవర్తించితే, వాళ్ళ హృదయం జయించలేను. ఆనందం కలిగించలేను. మందులు వాడలేను. రోగం నయం చేయలేను.'

సంతోషంతో తల వూపాడు.

'వాళ్ళకు ఆనందం కలిగించాలి. తప్పులేదు. రోగం బాగుచేయాలి. అది ధర్మం బాధ వున్నంతకాలం సాధారణంగా జబ్బు కుదరదు. కాని నువ్వు జబ్బు తెచ్చుకోకుండా వుండాలి'

'నాకు టి. బి. రాదు. భగవంతుడు కరుణామయుడు.'

'నిజమే! ఆ నమ్మకం కూడా న్యాయమే! కాని ప్రకృతి

ధర్మానికి మనం అందరం బద్ధులమే. తగిన జాగ్రత్తలో ఉండాలి.'

'అలాగే వుంటాను. మీ ఆదరపూర్వక ఆప్త వాక్కులకు కృతజ్ఞుడ్ని – అయినా నేను ఒకవేళ టి. బి. పేషెంట్ నయితే నన్ను రక్షించటానికి మీరున్నారు కాబట్టి నాకు ఏ చింతాలేదు.'

'అలా అనొద్దు. సంతోషంగా వుండు. రైట్.'

భుజం తట్టి అడుగులో అడుగులు వేసుకొంటూ నెమ్మదిగా వెళ్ళిపోయాడు.

డాక్టర్ ఎల్మర్ ఆడమ్స్ మొదట్లో పేషేంట్స్‌ని ఎంతో ప్రేమతో చూచేవాడనీ, తరవాత టి. బి. ఎటాక్ అయిందనీ, అక్కడే నయం చేయించుకొన్నాడనీ, అయినా టి. బి రోగులకే, టి. బి. డాక్టరుగా వుండిపోయాడని తెలిసింది. హృదయం ఆనందంతో ఆయనకు జోహారులర్పించింది.

కాలచక్రం గిరున తిరిగిపోయింది. మధూ పద్మా వసూ యం బి. బి. యస్. ఒకేసంవత్సరం పాసయ్యారు, నా కోరిక ప్రకారం వసు టి. డి. డి చదవటానికి సిద్ధమయింది. మధుకీ అదే నిర్ణయం! పద్మకూ అదే ఆలోచన! తలిస్తే విచిత్రంగా వుంటుంది. ముగ్గురికీ టి డి. డి తో ప్రవేశం వచ్చింది.

విజయవాడ స్టేషన్‌లో వసునూ, అత్తమ్మనూ ఫస్టు క్లాస్‌లో కూర్చోబెట్టినప్పుడు, అదే రైలులో ప్రయాణమయిపోతున్న మధు కనిపించాడు. ప్రక్కనున్న వరో ఫస్టుక్లాస్

'వసూ!' అన్నాను.

'ఊఁ!' అంది.

'వచ్చావా?'

'ఊఁ!'

వసును చూడటంతో నాకు ఎంతో బలం వచ్చినట్లు అయింది. శరీరం అంతా ఏదో కొత్తశక్తి ప్రవేశించింది. కళాయి పోయిన ఈ శరీర పాత్రకు కొత్త కళాయి వేసినట్లు అయింది.

'అత్తమ్మ బాగుందా?'

'ఆఁ!'

నేను ఇంకా మాట్లాడబోతుంటే వసు నోటిమీద చేయి వేసి 'మాట్లాడవద్దు' అంది నోరు కదపకుండా వూరు కొన్నాను.

మంచం - మంచంమీద నేను - చుట్టూ చెట్లు - అంతా చూచింది వసు మంచంక్రింద పాత్రలో ఉమ్మిన రక్తం చూచింది.

కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే, వసు పెద్దగా ఏడ్చింది. వద్దంటున్నా వినలేదు. చదువుకొన్నదీ, డాక్టరూ దుఃఖం గుండెల్లో మింగు కొంటుందనుకొన్నాను గానీ ఇంత బేలగా, పసిపిల్లలాగా అమాయికంగా ఆవురుమని ఏడుస్తుందనుకోలేదు.

వారించినా ఆలించకుండా తలుచుకు తలుచుకు ఏడుస్తుంది. కాలుతున్న కట్టెలపైన మంటలు రేగుతున్నట్లు ఏడుస్తూ వుంది. మంటలు ఆపటంకంటే - చేతకాదు - కట్టెలూ అగ్ని

కణాలు తీసి పారవేయాలి. అప్పుడే మంటలు ఆరిపోతాయి. వసును ఆపలేకపోయాను. నా బలహీనత, దౌర్భాగ్యమే. దురదృష్టమే వసును ఏడిపిస్తున్నాయి.

ఆమె ఏడవకుండా వుంటే హాయిగా వుంటుంది నాకు. ఇప్పుడది చెప్పలేను. చెప్పినా లాభంలేదు. ఏడ్చినందువల్ల ఏం ప్రయోజనం ? నన్ను బాగుచేయాలిగానీ... ...

ఏడవటం వసుకు తేలికయిన పని. అంత సులభంగా ఆమె మరేమీ చేయలేదు! చిన్నప్పుడు ఎన్నోసార్లు ఏడ్చింది. పెద్దదయిం తరవాతకూడా కొన్నిసార్లు ఏడ్చింది. ఆమె జీవితంలో ఎప్పుడు ఏడ్చినా పంతంకోసం, ప్రయత్న పూర్వకంగా బాధలేకుండా ఏడ్చింది. కావలసిన వస్తువు, రావలసిన విధంగా రావటంకోసం ఏడ్చింది. అప్పుడామె కళ్ళవెంట నీళ్ళు వచ్చేవి కావు.

కాని ఇప్పుడు కుమిలి కుమిలి ఏస్తుంది. గుండె పగిలేలా విలపిస్తుంది. ఇది పంతంకోసం కాదు. ప్రయత్న పూర్వకంగా కాదు. బాధ లేకుండా కాదు. గుండె ఆనకట్ట గండి పడితే పొంగివచ్చే వరదలాగా ఆమె నేత్రాలలోంచి కన్నీరు ప్రవహిస్తూవుంది. ఈ దుఃఖం స్వతసిద్ధమయింది. సహజమయింది. ఇదే మొదలు వసు ఇలా దుఃఖించటానికి. ఇంతకు మునుపు ఈ దుఃఖం ఆమె ఎరుగదు. మామయ్య పోయినప్పుడు కూడా ఇంత బాధగా దుఃఖించలేదు. అప్పటికామెకీ దుఃఖం తెలియదు. ఈ విచారం ఆమెకు స్త్రీత్వం ఇస్తుంది. ఈ కన్నీరు అందమే ప్రసాదించింది. ఈ ఘోష ఆమె హృదయంలోనే మోగింది.

ఈ యాతన ఆమె గుండెల్లోంచి రేగుతూవుంది. ఏడ్పులేని గుండె ఎందుకు ? కాల్చనా ! కన్నీరు లేని కళ్లు ఎందుకు ? తగలేయనా ! ఈ దుఃఖంతో, బాధతో కన్నీటితో నా హృదయం కైవశం చేసుకొంది. నన్ను జయించింది. నాసర్వశక్తుల్నీ జయించింది. నన్నంతా ఆక్రమించుకొంది.

'వసూ !'

'ఊఁ !'

'ఏడ్వద్దు !'

వసు కళ్ళు తుడుచుకొంది. కాని పెదాలు అదురుతూ వున్నాయి. ముక్కుపుటాలు కంపిస్తున్నాయి. కళ్ళు నీళ్ళ చక్రాలులాగా తిరుగుతూ వున్నాయి.

'చెప్పేమాట విను. విచారించవద్దు.'

కళ్ళు పైటచెంగుతో తుడుచుకొంది. కళ్ళ తడి రక్తం మరకమీాదే అయింది.

'వసూ !'

'ఊఁ !'

'ఏడవద్దు'.

'ఏడవను' ఏడుస్తూనే జవాబు చెప్పింది.

'విచారించి ప్రయోజనం లేదు – నీ దుఃఖం చూడలేను.'

'దుఃఖించను !'

'కళ్ళు తడి కాకూడదు – భవిష్యత్తు బాటలో చీకటి తొలగించి కాంతి ప్రసరించి నడిపించవలసిన నీ నేత్రజ్యోతులు

ప్రకాశించాలిగానీ కొడిగట్టి, మసిపట్టి, తేజస్సు కోల్పో కూడదు.'

'విచారించను!'

'మాటమాత్రమే చెబుతున్నావు. కానీ కంఠం వణుకు తూవుంది. నాకు ధైర్యంచెప్పి కాపాడవలసిని నువ్వే క్రుంగి పోతే ...'

'లేదు నేను మామూలుగా వున్నాను!'

మళ్ళీ పైటచెంగుతో కళ్ళు ఒత్తుకొంది.

'నన్ను బ్రతికించు వసూ!'

'అంతమాట అనవద్దు! - నే నెంతదాన్ని - దేవుడే బ్రతికించాలి - మీరు దిగులు పడకండి.

'నువ్వు రావడంతో నా కెంతో శక్తివచ్చింది'

'ఈ దశలో - ఈ విధంగా ఇక్కడ మిమ్మల్ని చూస్తా ననీ, చూడవలసి వస్తుందనీ, మంచితనమే రూపందాల్చిన మీకు ఇంతకష్టం వస్తుందనీ నేను కలలోకూడా వూహించ లేదు.'

'ఈ ప్రాణాలు మనవికావు వసూ! - వీటిమీద మనకే అధికారమూలేదు. నే నేమవుతానో ఏమో!'

'మీరు బ్రతుకుతారు - బ్రతికితీరాలి - మీరు బ్రతుకు తారు.'

నేను కళ్ళు తుడుచుకొన్నాను. ఎదురుగా స్టూలుమీద కూర్చున్న వసుకళ్ళు తుడిచాను.

# 11

కాటేజ్‌లోనుంచి క్వార్టర్స్‌లోకి మారిందాక వసు నిద్రపోలేదు. క్వార్టర్స్‌లోవుంటే చూచేవాళ్ళెవరూ ఉండరని, నర్సులు చూడటానికి అయినా వీలువుంటుందనీ కాటేజ్ మారాను. వసు రాగానే పరిస్థితి తారుమారయిందో, యధాప్రకారమయిందో ఈ విధంగా జరిగింది.

డాక్టర్ ఎల్‌మర్ ఆడమ్స్‌వచ్చి చూచి పోతున్నాడు. ఆమెతో ఏమేమో చెబుతున్నాడు. నాకు ధైర్యం చెబుతున్నాడు. ట్రీట్‌మెంటు నాకు తెలుసు. కాని టీ. బీ. ఏ పరిస్థితిలో వుందో తెలియదు. వాడేమందుల్నిబట్టి, పరిస్థితి తెలుసుకుందామంటే వీలు కావటంలేదు. ఎక్స్-రే ఫొటోకూడా నాకు చూపించలేదు. అదే మంచిదనిపించింది. తెలియకపోతేనే హాయి.

కాల్చిన బ్రెడ్‌స్లైస్ చిన్నచిన్న ముక్కలుచేసి, ఆమ్లెట్ తుంచి, రెండూకలసి నోటికి అందిస్తుంది. పాలు హార్లిక్స్ కలిపి ఇచ్చింది. పగలే నిద్రపోదామనిపించింది. కళ్ళు మూసుకొన్నాను. వసు వెలుపలికి వెళ్ళింది.

ఆమెవచ్చిందగ్గరనుంచి ఆరోగ్యంమెరుగు అవుతున్నట్లే వుంది. దగ్గితే రక్తం పడటం లేదు. నా కెవరూలేరు అనే చింత కలగటం లేదు.

డైట్ విషయంలో ఆమె ప్రత్యేకకృషీ ఏర్పాటూ నచ్చాయి. సమయానికి కావలసినవి తి పిస్తూవుంది. వద్దని మారాం చేసినా కోప్పడో లాలనగా తిని పెడుతూవుంది.

నిద్రగావుంది. మగాతత్తా అటునుంచి ఇటుతిరిగి పడు కొన్నాను. తలుపు నెట్టుకొని ఎవరో వచ్చారు. కళ్ళు విప్పి చూశాను. మధుమూర్తి!

'నమస్కారమండీ!' అంటూ బెడ్ దగ్గరకు వచ్చాడు. నమస్కరించి 'కూర్చోండి' అన్నాను.

మధులో మార్పు కనబడింది. ఉత్సాహంగా వుండే అతని ముఖం విళావిహీనంగా వుంది. లోపలున్న బాధని అణచి పెట్టుకోటానికి చేసే ప్రయత్నం నిరర్థకమై, భావ శూన్యమయి, కేలవంగా వుంది. మునుపటికంటే లావు అయ్యాడు. కళ్ళలోవుండే చలాకీతనం మాయమయింది. దాని స్థానంలో నిరాశ, నిస్పృహ, భయం అలుముకొన్నాయి.

'బాగున్నారా?' అని ప్రశ్నించాడు.

'థాంక్స్, బాగున్నాను' అని జవాబు చెప్పాను.

మళ్ళీ కొన్ని సెకండ్లకాలం నిశ్శబ్దం. మధులో మార్పుకి కారణం తెలుసుకోవాలనుకొన్నాను. ఎలా అడగాలో తెలియదు. నిశ్శబ్దం భరించరానిదిగావుంది. అతన్నిచూస్తుంటే ఈర్ష్య బయలుదేరుతూవుంది. కాని లోపల ఎక్కడో అజ్ఞాత అజ్ఞాతశక్తి ఆ ఈర్ష్యను చంపివేస్తూవుంది.

నేనే ప్రారంభించాను.

'ఇక్కడికి ఎప్పుడు రావటం?'

'పదిరోజు లయింది.'

'ఏమయినా పనివుండి...'

'లేదు – పనేమీ లేదు.'

'నన్ను చూడాలనా !'

మధు అవునంటే విని ఆనందిస్తానని నాకు తెలుసు. నన్ను చూడాలని ఎవరయినా ఎంతో దూరం నుంచి వచ్చారంటే తృప్తిగావుంటుంది.

'లేదు - మిమ్మల్ని చూడాలని రాలేదు. కాని ఇక్కడికి వచ్చింతరవాత, చూచి మాట్లాడాలనిపించింది.'

పూర్తిగా ఆనందం కలక్కపోయినా బాగానే వుంది. చెప్పాను 'థాంక్స్.'

మధు ఏమీ అనలేదు. గదీ, గోడలూ, పైకప్పు కిటికీలూ తలుపులూ బెడ్ ఉమ్మిపాత్ర అన్నీచూచి తలదించుకొన్నాడు. అటూ ఇటూ చూచి సిగరెట్టుపాకెట్టు, అగ్గిపెట్టె పాంట్ జేబులోంచి వెలుపలికతీసి కాల్చనావద్దా అన్నట్టు చూశాడు. కాల్చుకోమన్నట్టు తలవూపాను సిగరెట్టు ముట్టించుకొన్నాడు. కిటికీలోంచి పొగ బైటికి వదులుతూ ఆలోచనల్లో పడిపోయాడు.

నిద్ర పోదామనుకుంటుంటే వచ్చాడు. కాదనలేకపోయాను. సిగరెట్టు వాసన నా కిష్టం లేదు. పొగ తగిలితే దగ్గు వస్తుంది. అయినా సిగరెట్టు కాల్చుకోమనే చెప్పాను. ఉన్నట్టుండి మాట్లాడటం ప్రారంభించాడు.

'నా మనస్సు ఏమీ బాగాలేదు. విశ్రాంతి కోల్పోయాను ఆశించింది అందలేదు. నిరాశే ఎదురయింది. జీవితం ఎడారిలా విస్సారమై నికృష్టంగా కనిపించింది మనస్సు కోల్పోయిన విశ్రాంతిని తిరిగి పొందాలనే ఆశతో మదనపల్లి వచ్చాను.

కానీ ఇక్కడ బాధ ప్రత్యక్షమయింది. నే నేమీ మర్చిపోలే కుండా వున్నాను.'

అకస్మాత్తుగా చెప్పటం ఆపివేశాడు. చెబుతున్నది సంతృప్తి నిచ్చినట్లులేదు. నేనే అడిగాను.

'మీ రెందుకు బాధపడాలి?

'ఎందుకు బాధ పడకూడదు. ఏం చూసుకొని ఆనందించాలి. ఏం నమ్ముకొని జీవించాలి'?

'ఎలా తెలుస్తుంది కారణం చెప్పకపోతే...'

'చెప్పటానికి ఏముంది' రెండుక్షణాలు ఆగి మళ్ళీ చెప్పాడు. 'మీ అమ్మాయి - వసుమతిని - నేను ప్రేమించాను.' చెప్పటం పూర్తిఅయినట్లు ఆపివేశాడు.

ఇది తెలుసు. అందుకు వసు సమాధానంకూడా తెలుసు. అయినా బాధ కలిగింది. గుండెలు నొప్పిపుట్టాయి. మనస్సు క్షోభ చెందింది. ఈ పరిణామం భరించలేను. ఉన్నట్టుండి శరీరంలో మార్పు వచ్చింది. దగ్గు తెర రేగింది. దగ్గుతుంటే కడుపు, పక్కటెముకలు జవజవలాడాయి. వెన్నుపూస ఊగిసలాడింది. ఉమ్మివేయబోయాను. పాత్ర నోటి దగ్గరకు తెచ్చాడు. ఉమ్మివేశాను రక్తం పడింది.

మధు చలించిపోయాడు. కూజాలో నీళ్ళు గ్లాసులో పోసి ఇచ్చాడు. కొంచెం పుక్కిలించి, మరికొంచెం తాగాను. నీళ్లు పారబోసి కూజా మూతమీద గ్లాసు పెట్టాడు మధు.

కొంచెంసేపు కూర్చుని, లేచి వెళ్ళబోతూ 'మిమ్మల్ని తరవాత కలుస్తాను. ఇప్పుడు విసిగించను' అన్నాడు. 'ఫరవా లేదు. కూర్చో' మన్నాను. కూర్చున్నాడు.

'చెప్పు !'

'ఇప్పుడొద్దులెండి. మళ్ళీ వస్తాను'.

'ఫరవాలేదు. చెప్పు'.

మధు ప్రారంభించాడు.

'వసుమతిని హృదయపూర్వకంగా ప్రేమించాను పెళ్ళి చేసుకొంటానని చెప్పటానికి వచ్చాను......ఎందుకో అకారణంగా నేనంటే ఆమెకు ఇష్టంలేదు. నాతో మాట్లాడవద్దని ఆజ్ఞాపించింది. ఆ మాటను ఆరు సంవత్సరాలలో ఎప్పుడూ ధిక్కరించలేదు. గౌరవించాను. కానీ ఆమెను చూడకుండా వుండలేను......మీదగ్గర వాస్తవం దాయటం నాకిష్టంలేదు. ఆమెను చూడటంకోసం వచ్చాను మీవూరు'.

'ఊఁ !'

'ఆమెను ఆరేళ్ళనుంచి చూస్తూనేవున్నాను. కానీ, ఎప్పుడూ మాట్లాడించలేదు. ఇక మాట్లాడకుండా వుండలేను. అందుకు పెళ్ళి జరగాలి. అది కావాలంటే మీరు ఒప్పుకోవాలి. ప్రార్థించటానికే వచ్చాను చిన్నాన్నగా మీరు మీ విధిని ఎప్పుడయినా తీర్చవలసే వుంటుంది. నా ప్రేమను చులకనగా చూడక ఆదరించమని కోరుతున్నాను.

సత్యం చెబుదామనిపించింది. గొంతులోకళ్ళె అడ్డం పడ్డింది అంతలో ఆలోచన కమ్ముకుంది. నాకు ఆరోగ్యం సమకూడితే వసును పెళ్ళాడతాను. పాడయిపోతే, ఇంకా ఏమైనా, జరిగితే వసుకు పెళ్ళికాకుండా పోతుందేమో ! నన్ను కాపాడిన మామయ్య కుటుంబం కాపాడవలసిన భారం నామీదే ఆధార

పడి వుంది. మరణమే నిశ్చయమయినప్పుడు వసు పెళ్ళి చేసే కన్నా మూయాలి. అందుకు ఆధారం మధు. అతనికి అన్ని అర్హతలూ వున్నాయి వసుకి అన్నివిధాలా తగినవాడే! ఇప్పుడు మధుకి ఏం చెప్పినా అనవసరమే! విధి బలీయమయింది. దాటరానిది జరగవలసింది జరగనున్నప్పుడు ఆటంక పరచకూడదు. వసుతో పెళ్ళివిషయం నిశ్చయంగా మాట్లాడాలనుకొన్నాను. మధుతో చెప్పాను.

'వసుతో మాట్లాడి చెబుతాను.'

మధు కళ్ళు వెలిగిపోయాయి. ఆనందాశ్రువులు వెన్నెలలు లాగా కురిశాయి. పరవశత్వమే పొందాడు. తృప్తిగా చెప్పాడు.

'నాకు ఈ జీవితం ప్రసాదిస్తే, మీ మేలు జన్మ జన్మాలకీ మరచి పోలేను'.

కొంచెం సేపుండి 'మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను' అని వెళ్ళిపోయాడు.

మధు వ్యక్తిత్వంలోని ఉదాత్తతనుగూర్చి ఆలోచిస్తున్నాను. నా కళ్ళ ముందే ఎంతో ఎత్తుగా ఎదిగి పోతున్నాడు. అతని కోర్కెపట్ల సానుభూతిలేదు. కారణాంతరాలవల్ల రాజీపడ బోతున్నాను. అతని మానసిక ఔన్నత్యం పట్ల ప్రేమవుంది. చిన్నవిషయం చూచిన సంగతి – వీటికి పెడఅర్థాలూ భాష్యాలూ తీయకుండా నమ్మే మధు మనస్తత్వం నన్నాకర్షించింది.

తలుపు ఎవరో తట్టారు. తలుపులు తట్టారు.

'నేను లోపలికి రావచ్చునా ?'

'రండి !'

ఎవరయి వుంటారా అని ఆలోచించేలోగా పద్మ ప్రవేశించింది.

ఆమెను చూడగానే అలంకరణే కనిపించింది. ఎంతో మారిపోయింది. హైదరాబాద్ వాతావరణం పద్మమీద తన ప్రభావం బాగా చూపించింది. ఈమె తెనాలి అమ్మాయి కాదు. హైదరాబాద్ అమ్మాయే అంటే నమ్మేట్లుగా వుంది. అసలే సుకుమారంగా వుండే ఆమె మరీ నాజూకుగా తయారయింది. చెవులకు వెడల్పు రింగులూ, తల దువ్వుకోవటంలో మార్పూ, నడకలో క్రొత్త సొగసులూ, బట్టలు కట్టుకొనే తీరులో క్రొత్తదనమూ - ఇవన్నీ హైదరాబాద్ నేర్పిన పాఠాలే ! ఇవి పద్మకట్ల అసహ్యం కలిగేట్లు చేయలేదు. ఆమెకు తగినట్లుగానే వున్నాయి. కానీ సంవత్సరం క్రితం చూచిన పద్మకూ ఈమెకూ చాలా తేడా వుంది.

'వసు లేదా ?' అటూ ఇటూ చూచింది.

'లేదు !'

'ఎక్కడికి పోయింది ?'

'వెలుపలికి !'

'ఎందుకు ?'

'ఏమో !'

'అయితే వెళతాను !'

'వద్దు కూర్చో'.

'ఎందుకు' అంటూ కూర్చుంది.

'వసుతో ఏం పని?'

'ఏంపనీ లేదు'.

'నన్ను చూడడానికి వచ్చావా?'

'అవునంటే - ఎందుకు చూడటానికి వచ్చావు? చూశావుగదా వెళతావా? ఉంటావా? అని ప్రశ్నలవర్షం కురిపించటానికా? నేను వసుకోసం వచ్చాను - అంతే!'

'నా ఆరోగ్యం బాగా లేనప్పుడు నువ్వు రావటం సంతోషం కలిగిస్తుంది కాని ప్రశ్నలు వేయించదు.'

పద్మ మాట్లాడలేదు.

'మదనపల్లి గవర్నమెంట్ హాస్పటల్‌లో టి. బి. స్పెషలిస్టువు కదా!

'అవును.'

'వచ్చి రెండు వారాలయింది కదా!

'అవును.'

'ఇంతదాకా మమ్మల్ని చూడటానికి రాలేదేం?'

'క్షమించాలి. వీలుపడలేదు.'

'ఉద్యోగం ఎలావుంది. కొత్త జీవితం కదా!'

'బాగావుంది.'

నాకిక మాటలు లేవు, నిశ్శబ్దంగా పడుకొన్నాను. లేచి అలా తిరగాలనిపించింది. మళ్లీ అంతలోనే ఎందుకులే అని నిస్పృహ కలిగింది.

పద్మ మాట్లాడింది.

'మీ ఆరోగ్యం ఎలావుంది ?'

'బాగానేవుంది !'

'ఏమయినా బాగుఅయినట్లేనా ?'

'కొంచెం.'

'వసును మధు ప్రేమిస్తున్నాడు.'

'తెలుసు.'

'ఇష్టమేనా ?'

'ఎవరికీ ?'

'ఇద్దరంటే ?'

'డాక్టర్ మాధవ్, డాక్టర్ వసుమతి – వీళ్ళిద్దరికీ డాక్టర్ మధు ప్రేమ ఇష్టమేనా ?'

'డాక్టర్ పద్మావతికి ఇష్టమేనా ?'

'నాదేముంది వాళ్ళ ప్రేమ వ్యవహారంలో...'

'నీ స్నేహితురాలి ప్రేమ నీకు ఇష్టమయిందేకావాలిగా'

'కష్టమయింది అయితే.'

'పెళ్ళి జరగదు.'

'నిజమా ?'

'నిజం – సరేనా – నాసంగతి ఎలావున్నా వసుకి ఇష్టం లేదట.'

'ఎవరు చెప్పారు ?'

'మధుమూర్తే చెప్పాడు.'

'ఏమిటో – ప్రేమించే హృదయాన్ని ఎవరూ అర్థం చేసుకోరు.'

'అంటే ?'

'ఏముంది ? - వేదాంతం కాదే నేను చెప్పింది.'

'ఎవరినిగూర్చి ఆ మాటలు ?'

'మిమ్మల్ని గురించే.'

'నన్నా ?!?'

'అవును - మిమ్మల్ని ప్రేమించే వాళ్ళను మీరు అర్థం చేసుకొన్నారూ ?'

'ఆఁ! అర్థమయింది పద్మా ! - నువ్వేం మాట్లాడు తున్నావో బాగా అర్థమయింది. నీ అన్వేషణకు అంతరార్థం కూడా తెలిసింది నీకు హామీ ఇస్తున్నాను నీ ఉద్దేశ్యం నెర వేరుతుంది. అది నాకు కష్టమయినా వసుకూ, మధుకూ కష్ట మయినా నీకుమాత్రం కష్టంకాదు.'

'మీ మాటలు నా కర్థం కాలేదు.'

'నీ హృదయమే నాకు అర్థమయింది. మధు అదృష్ట వంతుడే !'

వెలుపలికి పోవాలనిపించింది. పద్మను ఇంతకాలంసరీగ్గా అర్థంచేసుకోలేదు. ఇప్పుడే అన్వయం చిక్కింది. అందుకే ఆనందం కలిగింది మంచ మీంచి లేచాను. తూలు వచ్చినట్లు అయింది పద్మ చేయి పట్టుకొంది. నిలబడ్డాను.

వెలుపలనుంచి వసు వచ్చింది. మమ్మల్ని చూచింది.

'పద్మా! ఎప్పుడొచ్చావే ! బాగున్నావా ? ఈ ందు లోపలపెట్టి వస్తాను అలా చెట్టుక్రిందికి తీసుకుపోయి కూర్చో బెట్టు. ఇప్పుడే వస్తాను. అలా చూస్తావేం బైటికి తీసుకుపో!'

వసు లోపలికి పోయింది. నా వసును చూడటం నా కెంతో తృప్తి నిచ్చింది

# 12

ఆ రాత్రంతా నిద్రలేదు. దగ్గు తెరలు తెరలుగా నిర్విరామంగా వచ్చింది. దగ్గుతో శరీరం వణికిపోయింది. కళ్ళే, రక్తం పోటీపడి పడిపోయాయి. ఆకాశంలో చీకటి నిద్ర పోతూనే వుంది కాని నా కళ్ళు నిద్రకు దూరమయిపోయాయి. కళ్ళలోనే తెల్లవారింది.

వసుకు నిద్రలేదు. దగ్గుతుంటే గుండె నవలించింది. కళ్లే ఉమ్మినేస్తే పాత్రపట్టింది. నోరు తుడిచి, నీళ్ళు పుక్కిలింపచేసి, కొంచెం తాగించింది. అలా చాలా రోజులున్నంచి చేస్తూవుంది. నిద్రలేమితో క్రమక్రమంగా చిక్కిపోతుంది. రాత్రి మండుతున్న నిప్పుకణికల్లా ఆమె కళ్ళు కనిపించాయి. ఆ కళ్ళు నిద్రించలేదు. హృదయమూ నిద్రించలేదు.

ఆ స్థితిలో ఆమెను చూస్తే నే నే స్థితిలోవున్నా దిగులు కలుగుతూ వుంటుంది. ఎంతో బాధ పెడుతున్నాను. అదంతా సహిస్తూ రాత్రంతా మేల్కొని, పగలు నిద్రపోకుండా ఇంట్లో ఆ పనీ ఈ పనీ చూస్తూవుంటే, ఆమె కోల్పోతున్న విశ్రాంతి గూర్చిన చింత నన్ను వ్యథపెడుతూ వుంది.

తెల్లగా తెల్లవారిం తరవాత కంటిమీద కునుకుపట్టింది. మెలకువ వచ్చేసరికి గోడ గడియారం ఏడు కొట్టింది. కళ్ళు తెరవక ముందే గుండెలమీద బరువు గమనించాను. వసు చెస్ట్‌మీద తల ఆనించి నిద్రపోతూవుంది. కుర్చీలో కూర్చుని తల నామీద పెట్టుకొని నిద్రపోతూవుంది.

గుండె నొప్పిగావుంది. దానికి కారణం వసు తల అలా నొప్పివస్తే దగ్గు వస్తుంది. అయినా శారీరకంగా మానసికంగా, హార్దికంగా అలసి, సోలిపోయిన వసును నిద్ర లేపటం అపచారమనిపించింది. ఆమె నిద్రాభంగం నా అభిమతం కాదు. ప్రక్క నొప్పిపుడుతున్నా ఓర్చుకొని పడుకొన్నాను. ఎటయినా తిరిగితే కదలిక కలిగి ఆమె నిదపోయి మెలకువ రావచ్చు. ఊపిరికూడా గట్టిగా పీల్చటంలేదు. ఆ ధ్వనికి ఆమెకు మెలకువ వస్తుందేమోనని భయం! వెలుపల చెట్లమీద పక్షులు రొద చేస్తున్నాయి. ఆ రొద తొలిగించటానికి తోలాలనుకొని, దాని వల్ల అధికశబ్దం అవుతుందని మానేశాను. గోడ గడియారం టిక్కు టిక్కుమంటూ వుంది. ఆ శబ్దం ఆమె భరించలేదేమో నని భీతి కలిగించి కాని చేయగలిగింది లేను. చాలావరకు నిశ్శబ్దంగానేవుంది. పక్షులు వెళ్ళిపోయాయి. రొద లేదు. గడియారం మామూలుగావుంది ధ్వని తక్కువ! నా గుండె టిక్కు టిక్కుమంటూ వుంది ఆగకుండా నిరంతరంగా వినబడుతూ వుంది. ఈ ధ్వనికి వసుకు నిద్ర పాడవుతుతుందేమో అనిపించింది. కొంచంసేపు హృదయ స్పందన ఆపుకొందామంటే అదీ నా ఆధీనంలో లేకుండా పోయింది.

వసు ఇలాగే ఇక్కడే నిద్రపోవాలి. నాకు దగ్గరగా, నా హృదయానికి చేరువగా ఆమె కలకాలం వుండాలి. ఆకలి దప్పులు లేకుండా యుగాంతం వరకు ఇలాగే వుండిపోగలిగితే ఎంత ధన్యమో కదా జీవితం అనిపించింది.

కాని ఎవరో రాకపోరు ఈ స్థితి విడిపోకపోదు. అలాగే అయింది. నర్సు వచ్చి, గదిలో టేబిల్ మీద ఏవో వుంచి

వెళుతుంటే, ఆమె అడుగుల చప్పుడు విని వసు నిద్ర లేచింది. మేల్కొన్న వెంటనే అప్రయత్నంగా గుండెమీదినుంచి తల నెమ్మదిగా బరువుగా లాక్కుంది. మెల్లగా ఆవులించి కుర్చీ వెనక్కి వాలి పోయింది.

వసు తల పెట్టుకొని పడుకొన్నచోట ఎర్రని కుంకుమ మరక కనబడింది. కళ్ళు తిరిగిపోయాయి నిజమే! అది నిజంగా కుంకుమే! ప్రాణం తల్లడిల్లిపోయింది. ఆమె నుదుటిబొట్టు చెరిగిపోయి గుండెలమీద చొక్కాకు అయింది. మరేమీ చూడలేకపోయాను.

ఎవరి నుదుటి కుంకుమ చెరిగిపోవటం నా కిష్టంలేదు. ముఖ్యంగా వసు. అది అప్రయత్నంగా తుడుచుకుపోవటం భయం కలిగించింది. ఇది దేనికి నాందీ అవుతుందో, దేనికి భరతవాక్యం అవుతుందో - ఊహించలేకపోయాను. అపశకునం అనిపించింది. నా వసు నుదుటి కుంకుమ - అందులోనూ ఆమె జన్మదినోత్సవంలో, ఉత్సాహం లేకుండా, నిన్ననే ధరించిన కుంకుమ నా చొక్కాకు తగిలి, పడిపోయి, వేరయిపోయి, నుదురంతా బోసికొట్టి, దిగాలు పడ్డట్లయి పోవటం కళ్ళవెంట నీళ్ళు తెప్పించింది - ఇది నాకే ఏదో అశుభం!

అంతదాకా వసు తల ఉండటంతో కదలని గుండె, పైన బరువు పెట్టిన రాయి తీయగానే తోసే గాలికి కదిలే మళ్ళకంప లాగా రేగుతూవుంది. క్షయ కారణంగా దగ్గు వచ్చిందో, లేక ఆలోచనల బరువుకీ, బాధకీ, తట్టుకోలేక దగ్గు పుట్టిందో తెలియదు కానీ ఆపుకోందామన్నా ఆగకుండా

వచ్చింది. దగ్గి దగ్గి కళ్ళవెంట, ముక్కులవెంట నీళ్లువచ్చాయి. ఆయాసంవచ్చింది. నవ పుట్టినట్లుగా వుంది. బాధ ఓర్చుకో లేకపోయాను.

వసు, దగ్గు తగ్గటానికి చేతనయినంత ప్రయత్నం చేసింది కాని లాభం లేకపోయింది. ఈ జబ్బు నయం కాదు. మళ్ళీ మామూలు మనిషిని కాలేను. అద్దంలో నా ప్రతిబింబం చూచుకోవాలనిపించింది. ముఖం పీక్కుపోయి, కళ్ళు లోతుకు పోయి, అసహ్యంగా కనిపించవచ్చు. అద్దంలో చూడను. చూచి ఓర్చుకోలేను. అయితే వసువెలా చూస్తూఉంది నన్ను? ఎలాసహిస్తూవుందీ మార్పు అవును ! స్త్రీ ఓర్పు !

క్రమంగా దగ్గు తగ్గింది ఊపిరితిత్తులు ఉబుకుతూ వున్నా, త్వరలో దగ్గు రాదని చెప్పుకొన్నాను. ఆమె చేతుల వైపు చూశాను. ఒక్కొక్క చేతికి రెండేసి బంగారు గాజు లున్నాయి. అవి తృప్తి కలిగించలేవు. ఉండవలసినవి అవికాదు వేరే గాజులుండాలి అవేఉండాలి అనుకొన్నాను. మెల్లిగా పిలిచాను.

'వసూ !'

'ఊఁ !'

'నా కోర్కె వింటావా ?'

'చెప్పండి.'

'పెట్టెలో నీ గాజుల పులారం వుందా ?'

'ఉంది ?'

'అందులో వేర్వేరు గాజులు చాలా వున్నాయికదా ?'

'ఉన్నాయి !'

'అవి వేసుకో !'

'ఇప్పుడా ?'

'ఆఁ ! ఇప్పుడే ! వెళ్ళు – నీ చేతులకు దట్టంగా ఎన్ని గాజులు పట్టుతాయో అన్నీ వేసుకో ! అందంగా వుండదని ఆలోచించవద్దు ప్లీజ్ ! వెళ్ళు !'

వసు వెళ్ళింది. ఆమెకు గాజులంటే ఎంతో యిష్టం. చిన్నతనంనుంచీ అంతే ! క్రొత్తరకం గాజు కనబడితే అవి కొనుక్కోవలసిందే ! గాజులంటే అలవిమాలిన మమకారం వున్నవాళ్ళకి, అన్నిగాజులు వేసుకొనే అదృష్టం భగవంతుడు అనుగ్రహించడంటారు ఎంత నిజమో !

గుండ్రంగా సుకుమారంగా, డెలికేట్‌గా వుండే గాజులకీ దాంపత్యానికీ ఏం సంబంధమో తెలియదు. భర్తపోతే, భర్తతోపాటు అవీ పోతాయి. స్త్రీ జీవితం గాజు లాగా అతి సున్నితమయిందనో, గాజుల వలయాలు లాగా స్త్రీ ఆలోచనా వలయాలు వుంటాయనో, స్త్రీ ఆలోచనలకు గాజులకంటే కరుగుతనం, పదును, సుకుమారత, సౌందర్యం వుంటాయనో ఏదో భావం వుండాలి. హృదయం పగిలి, జీవితం ఛిద్రమయి పోయినప్పుడు గాజూ పగిలి, భిన్నమయిపోతుంది. పగిలిపోయిన గాజుముక్క ఎవరికీ పనికిరాదు. భర్తలేనిభార్య సమాజంలో సాటివారితో మెలగలేదు. భార్యా భర్తలమధ్య గాజు జీవితం ఏనాడు ప్రారంభమయిందో, ఎవరు సృష్టికర్తలోగాని, భావి తరాలకుకూడా దానిప్రాణం భద్రంగా సృష్టిఅంతర్వ్యాపిసిగా

వుంటుంది. భారతీయత తెలిసే గాజు యువ జీవితాలకు ప్రాచీన సంస్కృతి చిహ్నంగా చిరంజీవి!

వసుని గాజులు వేసుకోమని రమ్మనటంలో నా స్వార్థం వుంది. జరిగిన ఏర్పాటు మా నిర్ణయం ప్రకారం ప్రస్తుతం పెళ్ళిఅయినా, కాకపోయినా, ముందు ముందయినా వసూ నేనూ భార్యాభర్తలం కావటమనేది - భగవంతుడికి ఇష్టమయితే - నిశ్చయమే నుదుటి కుంకుమ చెరిగిపోతే నామరణం ఆలోచన కలిగింది అది నాకు ఇష్టంలేదు!

అప్రయత్నంగానో, ప్రయత్న పూర్వకంగానో దేవుడు పన్నుతున్న మాయాజాలంనుంచి, మానవ ప్రయత్నం చేసి నన్ను నేనూ, తన్మూలంగా వసునూ కాపాడుకోవాలనీ దేవుడినే మాయ చేయబోతున్నాను. కుంకుమ తొలగి కలిగించిన లోపాన్ని గాజులున్న ఆమె చేతులతో పోగొట్టాలని నా ప్రయత్నం. ఇదే నిజమయితే నాకు ఆనందం మిగులుతుంది. ఈ ఆలోచన కల కాకూడదు. కల అయితే ఈ కలే నిజం కావాలి. ఈ జీవితం వాస్తవం కావాలి.

'ఏమండీ!'

'ఊఁ!'

కళ్ళు తెరిచాను. ఎదుట వసు నిలబడివుంది.

'గాజులు వేసుకున్నాను'

చేతులు చూశాను. చాలాగాజులు! మోచేతిదాకా వేసుకొంది. ముఖంలోకి చూశాను. ప్రాభాత శోభా సమయాన ఉదయించే సూర్యబింబంలాగా నుదుటిమీద

కుంకుమ మెరిసిపోతూవుంది హృదయం అనే పాలవెల్లి తొణికింది. శరీరంలో ఉన్న శీతలత్వంపోయి వేడిమి వచ్చింది. ఆనందం వేడికి హృదయపు పాలవెల్లి కాగి, పాలు పొంగాయి. అప్పుడు కళ్ళలోంచి వచ్చింది. కదుష్ణ బాష్పకణాలు కావు. కన్నీరు అనలేను. పాలపొంగులు. కళ్ళలో కవోష్ణ పయః తరంగాలు కదిలాడాయి.

'కంట తడి పెడుతున్నారా?'

'లేదు !'

'మరి !'

'ఆనందం !'

'ఈ కన్నీరు !'

'ఆనంద భాష్పాలే !'

'ఆనందమే అయితే నాకూ ఆనందమే ! అదే విషాద బిందువు లయితే నేనే శోకార్తిమూర్తినయిపోతాను. నా కోసం - నా ఆనందంకోసం - మీరు కంట తడిపెట్టకూడదు.

'లేదు !'

'మీకు ఆనందంగావుండాలి - అందులో నేనూ భాగం పంచుకొంటాను. మీరు సంతోషంగావుంటే చాలు. ఈ జీవితానికి అంతే చాలు - అదే వరప్రసాదం !'

'వసూ ! నీత్యాగం నన్ను జీవింపచేస్తుంది. కంటికి నిద్రలేక, విశ్రాంతిలేక, అలవాటులేని ఉపచారంచేస్తూ నిన్ను నువ్వు కృశింప చేసుకొంటున్నావు.'

'మీకు పూర్ణారోగ్యం వచ్చేదాకా ఈ కళ్ళకు నిద్ర రాదు. ఈ తనువుకు విశ్రాంతి కోరదు.'

'వసూ! నన్ను కాపాడటానికి దేవుడు నిద్రెరుగని దేవతను పంపించాడు. నేను తప్పకుండా బ్రతుకుతాను. బ్రతుకుతాను వసూ!'

'అంతే చాలు! నాకు అంతేచాలు! భగవాన్ మమ్మల్ని రక్షించు.'

'నువ్వు బాధ పడుతున్నావ్? – నీ దిగులు చూడలేను.'

'లేదు – నా కేబాధాలేదు. దిగులుపడటం లేదు. ఆనందంగా వున్నాను. ఎంతో ఆనందంగా వున్నాను.'

'నేను బ్రతుకుతాను వసూ! దయామయుడయిన పరమాత్ముడు నన్ను బ్రతికిస్తాడు.

వసు చేతులు జోడించి, కళ్ళు మూసుకొని "భగవాన్ భగవాన్" అంటూ వుంది రుద్ధకంఠంతో, తనువు కనుపించేలాగా.

వసు తల నిమిరాను మేకపిల్లలాగా తల వంచింది.

'భగవాన్ నా కీ అదృష్టం చాలు.' ఆమె గొంతుక వణికిపోతుంది.

వసూ! మనం ఏం చేశామని దేవు డీ శిక్ష విధించాడు.'

'ఈ పరీక్షతో మనల్ని ఏ మహోన్నత శిఖరాలకు చేర్చాలని భగవత్సంకల్పమో ఎలా చెప్పగలం!'

'ఈ బాధ మన కెందుకు వసు?'

'ఈ బాధలోంచే హృదయం వెన్నముద్దలయి తీరుతుంది.'

'ఏమో - కన్నీరు కళ్ళలో ఇంగలకుండా పోతూవుంది.'

'బాధాగ్నిలో కాలిన హృదయాన్ని చల్లార్చి శీతలం చేస్తుందీ కన్నీరే!'

'సృష్టి కార్యంలో నిమగ్నుడయిపోయిన దైవంమనల్ని సృష్టించిందే మరచిపోయాడేమో! ఎన్నాళ్ళీ చావు బ్రతుకుల మధ్య పెనుగులాట.'

'ఈశ్వరుని ఆజ్ఞలేందే చీమయినా కుట్టదు. దుఃఖం, యాతన లేకపోతే ఆనందానికి, అభ్యున్నతికీ అర్థమేముంటుంది. ఈ క్షయ మనకొక పరీక్ష! అంతే!'

బాధలోవున్నా, కుమిలిపోతూవున్నా, వసునుచూచినా, మాటలు వింటున్నా, నాకు ఆనందమే కలుగుతుంది. ఆమె తలలో పూలు, నుదుటిబొట్టు, చేతుల గాజులు చూస్తూంటే ఆనందమే కన్నీరయి, కళ్ళలోంచి చెక్కిళ్ళమీదుగా జారుతూ వుంది పూర్వజన్మలోని పుణ్యఫలంగా లభ్యమయింది వసు. ఈ అనుబంధం. ఆత్మీయత దైవత్వానికి సన్నిహితత్వం కలిగిస్తున్నాయి.

'చూడండి! మళ్ళీ కన్నీరు' అంటూ దగ్గరగావచ్చింది. కుడిచేతితో చెక్కిళ్ళు తుడిచింది కనురెప్పలు తుడిచింది. పైటచెంగుతో అద్దింది. వసు కళ్లు తుడుస్తూవున్నా కళ్ళలో చేతిగాజులే ప్రతిబింబిస్తున్నాయి. ఎన్నిగాజులో ఎంతఅందమో ఎంతజీవమో, ఆ గాజుల్లో నా ప్రాణం నా కళ్ళలో గాజులు,

ఆమె చెయి దూరంగా తీసుకోబోయింది. ఎంతో దగ్గరగా కనబడుతున్న గాజులూ చేయితో పాటు దూరంగాపోతున్నాయి, పోబోతున్నాయి. అది నా కిష్టంలేదు. ఆ చేయి అలాగే వుండాలి. ఆ గాజులంత దగ్గరగా కనబడుతూ, కంటి రెప్పపైన అలాగే వుండాలి. ఆమె చేయి తీసివేస్తూ వుంది. గాజులు వెళ్ళుతున్నాయి. ఎలా ? అలా వీలులేదు.

వసు గాజుల చేతిని పట్టుకొన్నాను. పట్టుకొంటానని ఆమె ఊహించలేదు. అంతదాకా చేతిని ఆపుదామని నేనూ అనుకోలేదు. బహుశా త్వరగా గట్టిగా పట్టుకొని వుంటాను. ఆ తొందరలో ఆ సంకల్పిత చర్యతో గాజు పగిలి, ఒక ముక్క రాలి క్రిందపడిపోయింది మిగతా భాగం చేతిని అంటి పెట్టు కొనే వుంది.

గాజు పగిలింది అని తెలుసుకొనేలోగా వసు కంగారు పడిపోయింది వణికిపోతూవుంది. కళ్ళు నీళ్ళలో గోళీకాయలు లాగా తిరుగుతున్నాయి.

గాజు చిట్లిపోవటం, ఒక ముక్క రాలిపోవటం ఊపిరి తిత్తుల్లో ఏదో తెగి పడినట్లు అనిపించింది. నా ఆశ నాశన మయింది. ఎందుకు ? ఎందు కిలా అయింది ?

వసు నా వూహా గుర్తించిందో, మతి పోగొట్టుకొందో కాని తన గాజులచేయి నా కళ్ల దగ్గరనుంచి తీయలేదు. కంటి కింపుగా గాజులు కనబడుతున్నాయి. భయంతో, ఆనందంతో విచారంతో, ఆశ్చర్యంతో, బాధ కలిగింది. కళ్ళు ఎండి పోయాయి

# సౌభాగ్యవతి

పగిలిపోయిన గాజుని మిగతా 7,
వేయాలి. అందుకు అడ్డంగా గాజులే ఫ
ఎడంచేత్తో విరిచి తీసివేయబోయింది. గాజు
రెండు పెద్దముక్కలు కొన్ని చిన్నముక్కలూ అయి
ముక్కలు పట్టుకోనేవుంది. కాని చిన్నముక్కలు చేతికి చిక్క
లేదు అంతా చూస్తూవున్నాను. కంటిలో ఏదో గుచ్చు
కొన్నట్లు అయింది. మంట పుట్టింది దురదపుట్టింది. ఇనుం
ముల్లులాగా ఉక్కుతీగలాగా కంటిలో ఏమో గుచ్చుకొంటూ
వుంది.

దుమ్మూ ఇసుకా కళ్ళలోపడితే కళ్ళు నులుంకొన్నట్లు
నలుపుకోబోయాను. వసు వారించింది. ఆమెవైపు రెండో
కంటితో చూశాను. ఆమె రెండు నేత్రాలలో సంభ్రమం.
బాధ కనబడ్డాయి. కంటిచుట్టు చేసనీరు భూతద్దంలాగా కన
బడింది.

వసు నా కనురెప్పలు రెంటినీ ఎడం ఎడంగా వంచి
పెద్ద నలుసు తీసింది! అది గాజు పలుకు! అప్పుడు వళ్ళంతా
జలదరించింది.

'మీ కన్ను ఎలావుంది?'

'ఇంకా నలుసు లున్నాయి!'

'మీరు నలపకండి – కనుగుడ్డుకి గాజు పలుకుల గరుకు
కుచ్చుకొని ఏమయినా కావచ్చు.'

'ఏమవుతుంది?'

'ఏమో! – దయచేసి నలపకండి!'

# సౌ భా గ్య వ తి

...ం !'

వసు కళ్ళల్లో ఇంకా వెదుకుతూనేవుంది. అయితే ఆమె కేమీ కనిపించటంలేదు. కన్ను మెర మెర లాడుతూ వుంది కంటికి కనిపించని నలుసుల్లో, తెల్లగుడ్డులో కలిసి పోయిన నలుసుల్లో, రెప్పలచాటుకిపోయిన నలుసుల్లో కంటిలో ఇంకా వున్నాయి.

కన్ను నలుంకొంటే గ్రుడ్డు జనగారిపోవచ్చు. నాకు భయం కలిగింది. అది పెరిగిపోతూవుంది ప్రాణభయమే పెరుగుతూవుంది. కన్ను ఉన్నా, పోయినా ప్రాణంతో సమానంకాదు. ప్రాణమే అంతిమ యాత్రకు సిద్ధమవుతున్నట్లు గుండె స్పందిస్తూవుంది.

కంటిలో నలుసులు గిర గిరా తిరుగుతున్నాయి. కన్ను కదిలిన దిక్కుకి అవీ పోతున్నాయి. బాధ సహించుకొం టున్నాను. ఎంత ఓర్చుకొంటే అంత అధికమవుతూవుంది.

కుంకుమ తొలగిపోతే, ఆ అపశకునం గాజులతో వారించా లనుకొన్నాను. గాజూ పగిలిపోయింది. నా ప్రాణంవంటి గాజు. శరీరంలో ప్రాణం పోవటం ఎంతో దూరంలో లేదనిపించింది. భయమే కావచ్చు కారణం! నేను మృత్యువువైపే నడు స్తున్నానో, మృత్యువే నావైపు వస్తూ వుందో తెలియదు.

అమ్మ చనిపోయింది. ఆమే చావువైపు వచ్చింది. ఆమె కాలం తీరి గతించలేదు. కాలం కలసిరాక మరణించింది. మామయ్య మరణం అమ్మ చనిపోవటం వంటిదికాదు. ఆయనకు కాలం తీరిపోయింది.

పసుపూ కుంకాలుపోయి, గాజూ పూసా, పూలూ మాంగళ్యం పోయి, అత్తమ్మ ఎంత బాధపడిందో! చిన్నచిన్న గాజుముక్కలు కంటిలో ఉన్నందుకే ఇంత బాధ పడుతున్నాను. చేతి గాజులన్నీ పగిలిపోయి, కంటికి కనిపించనంత చిన్న చిన్న నలుసులు అయిపోయి, అవి అన్నీ కళ్ళనిండా నిండిపోయి, లోకం కనిపించక, కళ్ళు దురదపెట్టి, అత్తమ్మ ఎంత శోష చెందిందో! ఎవరూహించగలరు! అమ్మలాంటి అత్తమ్మ వుంది. అత్తమ్మలో లేని అమ్మ గతించిపోయింది. ఆమె నాకిక లేదు.

ఈ అపశకునాలూ, అశుభాలూ నన్ను అమ్మ దగ్గరకు తీసుకుపోతాయి. ఆమె జాలిగా ప్రేమగా చూస్తుంది. గోరుముద్దలు తినిపిస్తుంది. ఎత్తుకుముద్దాడుతుంది చిన్నతనంలో ఆటలాడి, మట్టిలో పొర్లాడి ఇంటికివస్తే స్నానం చేయిస్తుంది. కంటిలో దుమ్ము పడితే కడిగి తుడుస్తుంది. నలుసుపడితే ఊది పైటచెంగుతో తీస్తుంది. క్రిందరెప్పపై, పైరెప్పవేసి నలిమి, నలకా, దానితోపాటు బాధ తీసివేస్తుంది.

ఒకేకంటితో వసును చూశాను. వసు ముఖంలో అమ్మ పోలికలు కనబడ్డాయి. ఈమె ముక్కులాగా అమ్మ ముక్కు ఉండేది. నుదురు, చెక్కిళ్ళు, పెదాలు, చిన్నగడ్డంఅన్నీ అవే! మరీ ముఖ్యంగా కళ్ళు - వసు కళ్ళు - ముమ్మూర్తులా అమ్మ కళ్ళే! ఆ కళ్ళే! అచ్చంగా అవే కళ్ళు! అమ్మ కళ్ళకూ వసు కళ్ళకూ తేడాలేదు. ఈమె కళ్ళలో అమ్మకళ్ళలో లాగా అదే చూపు, అదే ఆత్రుత. అదే భయం! అవును అమ్మ

వసులోవుంది. వసుతో అమ్మవుంది. వసులో స్త్రీత్వంవుంది. అమ్మలో స్త్రీత్వంవుంది. స్త్రీత్వంలో ఆ చూపు, ఆ కళ్ళు, ఆ భయం ఉన్నాయి. అమ్మ వసు, స్త్రీలే! ఇద్దరూ స్త్రీలే! అదే ప్రేమ! అదే ఆప్యాయత! అవును అమ్మే వసు!

భయంతో, ప్రమాదం తప్పించాలని, నీళ్ళు తిరిగే కళ్ళతో చిన్ననాటి అమ్మలాగా ఈనాడు వసు, నా కనులెత్తి గాలి ఊదింది! అదే చల్లదనం! అదే గాలి! అమ్మ అప్పు డూదిన గాలి! ప్రాణం!

కనురెప్పల వెంట్రుకలమీద చేతివ్రేళ్ళతో గోరుల స్పర్శ! అరిచేయి చెక్కిలిమీద! అదే స్పర్శ! అమ్మే చేతి స్పర్శ.

వసుకు కొడుకుపుడితే వాడి కంటిలో ఏదయినా నలుసు పడితే, ఆమే తీయవలసివస్తే, ఈలాగే రెప్పలు పట్టుకొని నలుసు తీస్తుంది. అమ్మ అయినా అంతే! వసు అయినా అంతే! వసులో మాతృత్వం! వసు మాతృమూర్తి, వసులో అమ్మ!

వసు నన్ను పట్టుకుంది. తన బిడ్డలాగా పట్టకొంది. దీక్షతో చూస్తూవుంది. శరీరం ప్రేమతో ఏకీకృతమయి పోయింది అసహాయుడనై, బాధతో ఏడ్చే పసివాడినికాను. పెద్దవాడిని బాధతో పసివాడినయి పోయాను. అమ్మకావాలి! అమ్మకావాలి! వసు వుంది! అమ్మవుంది.

వసు కళ్ళలోకి చూశాను. మాతృమూర్తి – అమ్మ కళ్ళల్లోకి చూచినట్లు! చేతులెత్తాను. దగ్గరకువచ్చి, చేతులు

పట్టుకొంది. ఆనందం, ఆప్యాయత తృప్తి, మెలికలు, హృద యంలో తిరుగుతున్నాయి. గుండె మెలొక్కింది. తీవ్రభావాలు చెలరేగుతున్నాయి. మెదడు, రక్తం, ప్రాణవాయువు, పిచ్చెక్కి పరవశించి పోతున్నాయి. రక్తనాళాల అదుపు శరీరం అంతటిలో ప్రతిధ్వనించింది. ఆ క్షణంలో నోరు తప్ప నవరంధ్రాలు మూతపడ్డాయి. నోటిలో ప్రతిధ్వని గింగురు మంటుంది, నోరు తెరిచాను. ప్రతిధ్వని రసఘనిఅయింది అక్షరరూపం ఏర్పడింది నాకే నా కంఠసర్వం పెద్దగా వినిపించింది. 'అమ్మా' - పర వశత్వంలోనే వున్నాను. 'అమ్మ' - హృదయం అధీనంలోకి వచ్చింది 'అమ్మా' - సర్వశరీరం అదుపులోనేవుంది 'అమ్మా 'అమ్మా.'

'ఏమండీ' వినిపించింది గొంతు. 'ఏమిటీ' అంది. మరు క్షణంలో 'అబ్బా!' అనటం విన్నాను. తక్షణం 'బాబూ' చెవుల సోకింది.

'అమ్మా - అమ్మా' అంటూ వసు మెడ పట్టుకొని ఊగిపోయాను.

'బాబూ! బాబూ' అంటూ వసు చెక్కిళ్ళు తడిమింది కాళ్ళు తాకింది. మెడ నవరించింది. నుదురు ముద్దు పెట్టుకొంది.

మంచంమీద వాలి, వసునుచూస్తూ నిశ్చలంగా భక్తి తో "అమ్మా" అని పిలిచాను.

కరుణతో, జాలిగా 'బాబూ!' అంది వసు.

చూస్తుండగానే వసు ఎంతో పెద్దదయిపోయింది. ఆమె ఆత్మోన్నత్యం ఎదుట పసిపిల్లవాడినే అయిపోయాను. ఆమె

ముఖంలో తేజః కిరణాలు ప్రస్ఫుట మవుతున్నాయి. ఉత్సాహంతో, ఉద్వేగంతో ఊగిపోతూ ఒక కాంతి గోళంలా సృష్టికి పాడ వచ్చింది ఆమెలోనుంచి కాంతి వెలివడి అనంత లోకాలకు సాగుతున్నట్లు అనిపించింది. ఆ హృదయంలోంచి పొంగివచ్చే సంగీతం విదూరపథాలకు ప్రాకి, సుదూర తీరాల నుంచి అవ్యక్త మధురంగా, అజీతమనోహరంగా వినబడుతూ వుంది. వెలిగిపోతున్న వసు వ్యక్తిత్వం అందుకోలేనంత ఉన్నతం అయింది.

ఉన్నట్టుండి నా కళ్ళలో సంచలనం కదిలింది. కన్నీటి బిందువులు జారాయి. చెక్కిళ్ళమీద చారికలు కట్టిన కన్నీటిని తుడిచింది. కంఠంలో మెరమెరలు తగ్గిపోయాయి. నలుసు లున్నట్లే లేదు.

కంటికి కనిపించక, చేతికి దొరక్క, వెలికి తీసే వీలులేక దాక్కున్న గాజు నలుసులు కన్నీటిలో పడి వెలుపలికివచ్చాయి కాబోలు. కన్నీటిమీద ప్రేమ కలిగింది.

బాధపోయి, అనిర్వచనీయ మయిన ఆనందంతో చలించి పోతున్నప్పుడు - వసు సపర్యలతో సాహచర్యంతో సంతోషం పొందుతున్నప్పుడు - దిగులునదిగమించి, సంతోషం ప్రాంగణంలో కాలిడుతున్నప్పుడు - డాక్టరు ఎల్మర్ ఆడమ్స్ లోపలికి వచ్చాడు, అన్నాడు.

'డాక్టర్ మాధవ్ - నీకు చెప్పవలసిన అవసరం ఏమీ లేదు కానీ చెబుతున్నాను. నువ్విప్పుడు ఆనందంతో వున్నావో విచారంలో మునిగావో - అంతా గమనించికూడా- తేల్చుకో

లేకపోయాను. కన్నీటితో విచారించావో ఆనందంతో కన్నీరు నించావో లేక, దుఃఖం సంతోషం రెండూ మిళితమై కానీ, అతీతమయి కానీ, విషాదానంద బాష్పాలో, ఆనంద విషాద బాష్పాలో? పొందావో కానీ, టి. బీ. పేషెంట్ ఆవేశ పడ కూడదు. మంచో, చెడో కలిగిన పరిణామం ఉద్ధృతమయి, విపరీతమయి, ఆవేశంగా మారిపోకూడదు. డాక్టర్ వసుమతి సాన్నిధ్యంవల్ల నీకు ఆరోగ్యం కలగాలిగానీపాడయి పోకూడదు. ఈ మధ్య కోలుకొంటున్నా వనుకొంటే, అది తారుమారయ్యే అవకాశం కనబడుతూవుంది. ఈ స్థితి ఇకముందు రాకుండా చూచుకొంటే మంచిది. లేకపోతే డాక్టర్ వసుమతిని నువ్వే మీ యింటికి పంపివేయ వలసివస్తుంది. అది ఇష్టంలేకపోతే, నేనే పంపించివేస్తాను అర్థమయిందనుకొంటాను.

నేను తల వూపాను.

'జాగ్రత్త! రైట్ - గుడ్ లక్.'

వెళ్ళిపోయాడు.

నాకు నవ్వు ఆగటంలేదు జరిగిందివేరు ఆయన తలంచింది వేరు. అయినా ఆయన మంచిమాటే చెప్పాడు నిజమే! ఆవేశపడకూడదు. అది భవిష్యత్తుకు మంచిది.

వసుకు బాధ కలిగివుంటుంది, అందుకే దూరంగా నిలబడింది. దగ్గరకు రాలేదు పిలిచానురానేరాలేదు. దగ్గరకుపోయి కన్నీరు తుడిచి 'నవ్వు' అన్నాను. నవ్వలేదు మళ్ళీ అడిగాను నవ్వమని.

కాలమేఘాలుకమ్మిన ఆకాశంలో చంద్రోదయం అయినట్లు ఆమెముఖంమీద వెన్నెలలు ప్రాకాయి.

# 13

ఉదయం నిద్రలేవటంతో పెళ్ళిప్రస్తావన తేవాలనుకొన్నాను. నా ఇష్టానిష్టాలు వేరు బాధ్యతవేరు ఈ విషయంలో నా ఆరోగ్యం బాగుంటే ఏ ఆలోచనా లేదుగాని అది తారుమారయినప్పుడు మార్గాంతరం తప్పని సరే అవుతుంది.

ఆరోగ్యం బాగుకావచ్చు. ఆపరేషన్ చేసి అయినా బాగుచేస్తారు ఈ స్థితి దాటిపోతే మరణమే ప్రాప్తించవచ్చు. మరణం రాకపోయి, బ్రతికితే పెళ్ళి అనవ్వాడినే కావచ్చు.

వసు ఎంతో శ్రమపడుతూవుంది. దానికి ఫలంవుండాలి. నా సేవవల్ల ఉపయోగం లేదనిపిస్తుంది. ఎన్నో కష్టాలకు గురి అయింది ఈయ వసు ఊపిరితిత్తుల్లోకి ప్రాకుతుందేమో నన్న భయం నన్ను వెంటాడుతూవుంది. ఆమె సపర్యలతో నేను పూర్తి ఆరోగ్యం పొందాలనుకొంటున్నానే కాని, అందువల్ల ఆమె జీవితంలో ఎటువంటి మార్పు రాగలనో ఊహించటం లేదు.

ఆమె ఆరోగ్యం బాగున్నప్పుడే – నన్ను చూచేవాళ్ళు లేకపోయినా ఫరవాలేదు – పెళ్ళి చేయాలి. అందువల్ల ఆమె అయినా హాయిగావుంటుంది ఆత్మీయురాలినీ, తన సర్వశక్తినీ నాకు సేవగా మార్చి అందిస్తున్న వసునూ, వదులుకోవటం

ఇష్టంలేదు. కానీ ఈ స్వార్థం అన్యాయమయింది. ఆరోగ్యంగా వుండి. వివాహ అర్హతవుండి, వసు నాకే కావాలి అనుకొనే స్వార్థంలో అర్థంవుంది కానీ, నా యీ కోర్కెలకు అర్థమే లేదనిపిస్తూవుంది.

స్త్రీ పురుషులు పరస్పరం ఆకర్షితులై అనురాగం, ఆత్మీయత పెంచుకుంటే. వారి వివాహం, దాంపత్యం నిత్య కళ్యాణం పచ్చతోరణంగా వుంటుంది వసు హృదయం ఎలా వున్నా మధు మనస్సు ఆమెకోసం అహోరాత్రాలు తపించి పోతూవుంది. అతని ఆరాధన ఉన్నతమయింది. మధుతో వసు జీవితం అందాల ఒనందమే అవుతుంది.

అయితే, నే నేమయిపోవాలి ! – ఏమవుతాను ! ఏమీ కాను. నాకెవరూ అక్కరలేదు. నే నెవరికీవద్దు. ఏమీ కోరుకో కూడదు నా శరీరం జబ్బు, హృదయంమీాద ఎలాంటి పరి ణామాలు బలవంతంగా తీసుకు వస్తూవుందో తలుచుకొంటే బాధ కలుగుతుంది.

వసుకి పెళ్ళి చేయాలి అదీ నీ మధుతోనే జరిపించాలి. వాళ్ళు బిడ్డా పాప కలిగి, ఆనందంగా సంసారం చేసుకొంటూ వుంటే – బ్రతికిఉంటే – చూడాలి. చనిపోతే నా ఆత్మ కయినా శాంతి వుంటుంది.

వసును ఎవరికో ఇచ్చి పెళ్ళిచేయటంఇష్టం లేకపోయినా పరిస్థితులు కల్పించిన అన్యాయం కారణంగా నాకు నేనై ఏర్పరచుకొన్న, గుర్తించిన బాధ్యతలమూలంగా – రాత్రంతా మధనపడి, ఆవేదనతో నిశ్చయానికి వచ్చాను.

తెల్లవారింది. వసు ముఖంలో ఏదో క్రొత్త తేజస్సు కనబడింది. ఏదో పనులు చేస్తూవుంది తీరికలేకుండా రాత్రీ పగలూ అలా పనులు చేయటం తోలగిపోతే బాగుంటుంది. ఈ బరువు బాధ్యతలనుంచి ఆమెకు విడుదల కలిగించాలి.

వసు పాలగ్లాసు చేతికి అందించింది. తాగుతూ వున్నాను.

'రాత్రి బాగా నిద్రపోయారు ! మీరు ?'

నా ముఖంలోకి చూస్తూ తృప్తిగా చెప్పింది.

'నేనూను !'

సమాధానంగా చెప్పాను నిజంఆలోచిస్తే అది అబద్ధం రాత్రంతా భవిష్యత్తు ఆలోచనలతో బుర్ర వేడి ఎక్కి నిద్ర లేదు. వాస్తవం బాధగా వుంటుంది. అందుకే చెప్పలేదు.

పాట పూర్తిచేశాను. గ్లాసుతీసుకొని లోపలికిపోయింది. వసు రాత్రి నిద్రపోయింది. కాబట్టే ఆలోచించుకోగలిగాను. నిర్ణయానికి రాగలిగాను. ఆమె మేల్కొ వుంటే, ఆ బాధ చూస్తూ నేను బాధపడటం తప్ప అన్యథా ఆలోచనకు అస్కారం వుండేదికాదు. ఆమె మళ్ళీ వచ్చింది.

'వసూ ! నీతో చాలా ముఖ్యమయిన సంగతులు మాట్లాడాలను కొంటున్నాను' అన్నాను.

'ఏమిటో !' నవ్వుతూ అనోమాదిరిగా చూచింది.'

'ఏమీలేదు – నీ పెళ్ళి గురించి.'

'పెళ్ళా ? – అంతతొందర ఇప్పుడేం కలిగింది.'

'తొందరా ఆలస్యం కాదు వసూ - ఎన్నాళ్ళు ఇలా వుంటావు'.

'ఎన్నాళ్ళయినా వుంటాను - అంటే...' అర్థంకానట్లు చూచింది. మాట్లాడబోయే విషయం ఎంత తీవ్రమయిందో ఆమెకు తెలియదు.

'కాలం ఎవరికోసమూ ఆగదు - కాలానుగుణంగా జరగవలసిన అన్నిపనులూ జరిగిపోతూనేవుండాలి - నువ్వు పెళ్లి చేసుకొని, హాయిగా సంసారం చేసుకొంటూవుంటే చూచి ఆనందించాలి - నన్ను నమ్ముకొని, నిన్ను నువ్వు, నీ జీవితాన్ని నాశనం చేసుకోవద్దు - నీ పెళ్ళి చేయవలసిన బాధ్యత నాకుందని మరచిపోవద్దు'.

వసు కళ్ళలో ఆశ్చర్యం కనబడింది. అలా మాట్లాడ తాడని ఆమె ఊహించకపోవటమే అందుకు కారణం అయి వుంటుంది.

'చెప్పు ! మాట్లాడవేం ! నువ్వు సుఖంగా ఉండటం నేను కోరుకోవద్దూ ! నీ జీవితం ఆనందమయం కావాలనీ, చేకూరాలనీ నేను ఆశించవద్దూ !'

అవును. నా బాగోగులు మీరే చూడాలి. నా ఆనందం నా దుఃఖం అంతా మీతోనే వున్నాయి. మీకు ఆరోగ్యం చేకూరింతరవాత మనం ఏమయినా మాట్లాడుకోవచ్చు.'

'అలాకాదు వసూ ! - నేను పెళ్ళికి యోగ్యత కోల్పోతానేమో భయంగావుంది. అందుకే నువ్వు నీకు నచ్చిన, లేక నాకు నచ్చిన వ్యక్తిని పెళ్ళి చేసుకోవాలి.

'నాకు పెళ్ళంటూజరిగితే మీతోనే ! అలా కానినాడు నాకు పెళ్ళే అక్కరలేదు. నిన్ను సంతోషంగా వుంచవలసిన బాధ్యత మీకు వుంది నిజమే ! కాని నాకు ఇష్టంలేని ఏ పనీ మీరు తలపెట్టకూడదు. అదే మీ బాధ్యత !'

'నా బాధ్యత బలీయమయింది. అది తీర్చటం నాకు ధర్మం అది త్వరలో జరిపిస్తాను.'

వసు ఏమీ మాట్లాడలేదు. కళ్ళు చెమ్మగిలిపోతా యను కొన్నాను. అదీలేదు. అస లీ మాటలపట్ల ఆమె చలించలేదు. అచంచల విశ్వాసం వున్నసంగతి పట్ల ఎవరికీ విచారం రాదు కాబోలు.

'డాక్టర్ మధుమూర్తి పట్ల నాకు సదభిప్రాయంవుంది. అతనితో నీపెళ్ళి నిశ్చయించదలచాను.'

వసు మాట్లాడలేదు.

'అతను స్థితిపరుడు, డాక్టర్, ఒక్కడే కొడుకు! అంద చందాలు ఉన్నవాడు. అన్నిటికంటే అతను ఆలోచనవంతుడు నిన్ను కోరుకొంటున్నవాడు'

తొణుకూ బెణుకూ లేకుండా కూర్చునివుంది.

'మధు మనఃపూర్వకంగా నిన్ను ప్రేమిస్తున్నాడు. ఆ ప్రేమ చాలా పవిత్రమయింది - నీతో మాట్లాడకుండా నీమాటకు కట్టుబడిన మధు నాకు ఇష్టుడయ్యాడు.'

కదలకుండా, మాట్లాడకుండా గంభీరంగా అలలు లే అగాధమయిన లోతు సముద్రంలా కూర్చుని ఉన్న ఆమెను చూస్తుంటే నాకు భయమే కలిగింది.

'అతన్ని పెళ్ళాడితే ఆనందమే పొందుతావు. అతని ఆరాధనా నెరవేరుతుంది. మానవులూ మాధవులూ మెచ్చు కొంటారు.'

'ఇలా మీరుమాట్లాడుతారని కలలోకూడా వూహించ లేదు. నాకు ఇష్టంలేని విషయం నాతో మీరు చెప్పవద్దు. డాక్టర్ మధుమూర్తిపై నాకు ప్రేమలేదు. పెళ్ళాడలేను— ఆమాటకేవస్తే మిమ్మల్ని తప్ప మరెవరినీ నేను పెళ్ళి చేసు కోను—మీ హృదయంలో నాకు చోటువుందని తెలుసు. అది కలకాలం ఉంటుందనీ ఎరుగుదును. మీమనస్సు మారితే నేనంటే ఇష్టంలేకపోతే, మీ హృదయంలోని ప్రత్యేకత తొలగిపోతే నాకు పెళ్ళొద్దు. అంతే!'

'వసూ! వసూ! నా పరిస్థితి అర్థం చేసుకోవటం లేదు. నేనూ - ఈ క్షయా - వసు నువ్వు ఆలోచించటం లేదు.'

'మీ క్షయ తగ్గుతుంది.'

'తగ్గకపోతే......'

తగ్గుతుంది - తప్పక తగ్గిపోతుంది.'

'తగ్గితే మంచిదే! లేకపోతే నే నూహించలేను— ఏమవుతుందో - ఏమయినా కావచ్చు - నీ ఆరోగ్యం ఏమవు తుందో భయంగా వుంది.'

'ఏమీకాదు.'

'ఏమో - నువ్వు సంసారంతో హాయిగా నయినా వుండాలి - ఆరోగ్యంగానయినా - ఈ జబ్బుకి దూరంగా వుండాలి తెనాలి వెళ్ళిపో!

# 13

ఉదయం నిద్రలేవటంతో పెళ్ళిప్రస్తావన తేవాలను కొన్నాను. నా ఇష్టానిష్టాలు వేరు బాధ్యతవేరు ఈ విషయంలో నా ఆరోగ్యం బాగుంటే ఏ ఆలోచనా లేదుగాని అది తారుమారయినప్పుడు మార్గాంతరం తప్పని సరే అవుతుంది.

ఆరోగ్యం బాగుకావచ్చు. ఆపరేషన్ చేసి అయినా బాగుచేస్తారు. ఈ స్థితి దాటిపోతే మరణమే ప్రాప్తించవచ్చు. మరణం రాకపోయి, బ్రతికితే పెళ్ళి అనర్హుడినే కావచ్చు.

వసు ఎంతో శ్రమపడుతూవుంది. దానికి ఫలంవుండాలి. నా సేవవల్ల ఉపయోగం లేదనిపిస్తుంది. ఎన్నోకష్టాలకు గురి అయింది క్షయ వసు ఊపిరితిత్తుల్లోకి ప్రాకుతుందేమో నన్న భయం నన్ను వెంటాడుతూవుంది. ఆమె సపర్యలతో నేను పూర్తి ఆరోగ్యం పొందాలనుకొంటున్నానే కాని, అందువల్ల ఆమె జీవితంలో ఎటువంటి మార్పు రాగలదో ఊహించటం లేదు.

ఆమె ఆరోగ్యం బాగున్నప్పుడే – నన్ను చూచేవాళ్ళు లేకపోయినా ఫరవాలేదు – పెళ్ళి చేయాలి అందువల్ల ఆమె అయినా హాయిగావుంటుంది ఆత్మీయురాలినీ, తన సర్వశక్తినీ నాకు సేవగా మార్చి అందిస్తున్న వసునూ, వదులుకోవటం

పట్టుకొంది. ఆనందం, అవ్యాయత తృప్తి, పొలికలు, హృద యంలో తిరుగుతున్నాయి. ఒంటె మేల్కొంది. తీవ్రభావాలు చెలరేగుతున్నాయి. మెదడు, రక్తం, ప్రాణవాయువు,పిచ్చెక్కి పరవశించి పోతున్నాయి. రక్తనాళాల అదుపు శరీరం అంత టిలో ప్రతిధ్వనించింది. అక్షణంలో నోరు తప్ప సకలాంగాలు మూతపడ్డాయి నోటిలో ప్రతిధ్వని గింగురు మంటుంది, నోరు తెరిచాను. ప్రతిధ్వని రసధునిఅయింది అక్షరరూపం ఏర్పడి ది నాకే నా కంఠస్వరం పెద్దగా వినిపించింది 'అమ్మా' - పర వశత్వంలోనే వున్నాను. 'అమ్మ' - హృదయం ... లోక వచ్చింది 'అమ్మా' - సర్వశరీరం అమ్మ... 'అమ్మా 'అమ్మా.'

'ఏమండీ' వినిపించింది గొంతు. 'ఏమిటీ' అంది. మరు క్షణంలో 'బాబ్బా!' అనటం విన్నాను. తక్షణం 'బాబూ చెవుల సోకిరది.

'అమ్మా - అమ్మా' అంటూ వసు మెడ పట్టుకొని ఊగిపోయాను.

'బాబూ! బాబూ' అంటూ వసు చెక్కిళ్ళు తడిమింది కాళ్ళు తాకింది. మెడ సవరించింది. నుదురు ముద్దు పెట్టుకొంది.

మంచంమీద వాలి, వసునుచూస్తూ నిశ్చలంగా భక్తి తో "అమ్మా" అని పిలిచాను.

కరుణతో జాలిగా 'బాబూ!' అంది వసు.

చూస్తుండగానే వసు ఎంతో పెద్దదయిపోయింది.ఆమె. ఆత్మౌన్నత్యం ఎదుట పసిపిల్లవాడనే అయిపోయాను. ఆమె

'ధన్యురాలిని, మీకు సర్వధా కృతజ్ఞురాలిని మిమ్మల్ని కాపాడుకొంటాను.'

తృప్తిగా బాధతో ఆనందం పొందుతూ వసు లోపలికి చరచరా వెళ్లింది.

## 14

ఈ వారమంతా హాయిగావుంది. చుట్టూ జరుగుతున్న అన్ని పనులూ ఇష్టంగానే వున్నాయి. ప్రకృతి ఆనందకరంగా వుంది. ఏదో తృప్తి, హాయి! నాపైన నాకే అభిమానం కలుగుతుంది. అసహ్యంలేదు. బాధలేదు. అంతా సంతోషం. అంతులేని సంతోషం.

నాకు జబ్బు నయమవుతుందనీ, మళ్ళీ మామూలు మనిషినే అయిపోవాలనీ, భవిష్యత్తు అందాలబాటగానే వుంటుందని ఆశపుట్టి చివుళ్ళు వేసి, పూలు పూస్తూవుంది,

ఎదురుగా కుర్చీలో కూర్చుని వసు పుస్తకం చదువుకొంటూ వుంది. మంచంమీద పడుకొన్నాను. మధురమయిన ఊహలు మనస్సు మత్తెక్కిస్తున్నాయి.

ఎవరో తలుపు తట్టారు.

వసు తీసింది.

మధుమూర్తి !

క్షణ కాలం వసు వేపు చూశాడు. ముఖంలోకి, ముఖ్యంగా కళ్లలోకి, కళ్లలోనించి హృదయంలోకి చూసి

నట్లుగావుంది. అతనిచూపు! నావైపు చూచి, గదంతా పరి కించి, మళ్ళీ ఆమె ముఖంలోకిచూచి, తల దించు కొన్నాడు.

వసు అతని చూచింది. నావైపు చూచింది. గదిలో అన్ని వస్తువులు - భద్రంగా వున్నాయో లేదో, దొంగలు ఎక్కువైపోయారు. ఏ వస్తువుపోతుందో, ఏవస్తువుఉంటుందో, తలుపు సరీగ్గా వేసివున్నానో లేదో అనే నెపంతో, జాగ్రత్తపడే ఇల్లాలులాగా చూచి, పుస్తకం మడిచి, తలగడ దగ్గర పెట్టి లోపలికి పోయింది.

వాకిలి దాటి, గదిలోకి వచ్చి, బెడ్ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు మధు దీనవదనంతో.

'ఆరోగ్యంగా వున్నారా ?'

ఆ ప్రశ్న నేనే అడగాలనుకొన్నాను. కానీ తనే అడిగేశాడు.

'అవును, జవాబు చెప్పాను. మామూలుగా అడిగాను 'మదనపల్లె ఎలా ఉంది ?'

'బాగుంది' వెంటనే బదులు చెప్పాడు.

మళ్ళీ మాటలులేవు. నిశ్శబ్దతే తాండవించింది.

'మిమ్మల్ని' డాక్టర్ వసుమతి విషయం అడిగి తెలుసు కుందామని వచ్చాను.'

'తెలుసు ! - కానీ ఎలా చెప్పాలో తెలియటంలేదు'

'అంగీకరించిందా ?'

లేదు !'

'లేదా !'

'లేను.'

మధు ముఖంలో మార్పు వచ్చింది. ఆ మార్పు చాలా భయానకంగా వుంది. అతడేమయి పోతాడో అన్నంత భీతి కలిగింది. పెనుగాలి వీస్తే పెద్ద వటవృక్షం కూలిపోయి నట్లయింది. మధు ఆకారం.

మధుపట్ల సానుభూతి భీతి జాలీ కలిగాయి. అతని కోర్కె నా స్వార్థంతో సంబంధించింది కాకపోయినట్లయితే ధర్మమయిందే! నా హృదయం మీదే అతని కాంక్ష దండయాత్ర చేస్తూవుంది కాబట్టి, తగిన సామర్థ్యంతో ఎదుర్కొని నా ఉనికి నేను రక్షించుకోను సిద్ధమవుతున్నాను

అతనికి సహాయం చేయాలన్న తలంపు లేకపోలేదు. కాని చేతగాని, శక్తిలేని సానుభూతి వృథాప్రయాస.

ఆ మనిషిపట్ల అభిమానానికి ఒకే ఒక్క బలమయిన కారణం వుంది. అది అతని ఆరుసంవత్సరాల నిరీక్షణ !— ఆలోచించగా అదే ఒక లోపంగా కనబడుతూవుంది. ప్రేమించటం తెలిసిన హృదయం ప్రేమింప చేసుకోవటం కూడా తెలుసుకోవాలి.

అయస్కాంతానికి ఆకర్షితమయిన ఇనుముకు స్వంతంగా ఆకర్షించే గుణం పొందుతుంది. అలాగే ప్రేమలో చిక్కుకొన్న వ్యక్తి, తను కోరుకొనే వ్యక్తిచేత ప్రేమింపబడటంకూడా జరగాలి. అలా జరక్కపోతే, ఆ ప్రేమకు నిలువలేదనీ, అది ఉన్నతం కాదనీ అనిపించవచ్చు.

ప్రేమకు అనేకం కొండంత అడ్డుగోడలు ఉండవచ్చు ఉన్నా, ప్రేమహృది వాటిని దాటుతుంది. నేలమట్టం చేస్తుంది.

ప్రేమకిరణం ఆటంకాల చీకటి తెరలు చీల్చుకొని ముందుకు పోతుంది కానీ, నిర్జీవంగా పడిఉండదు. అలా పడిఉంటే ప్రేమ లోనే లోపం ఉందని అర్థం.

నాతో మాట్లాడవద్దు. అన్నంతమాత్రంచేత ఆరేడు ఏళ్ళు కిక్కురుమనకుండా ఉండే మనిషి ప్రేమలో ఎంతతీక్షణత ఉందో ఊహకు అందటంలేదు. అంతకాలం నీరసంగా నిద్ర పోయే హృదయంలో ప్రేమ ఎండిపోతున్న గులాబి తీగేకాని పూలుపూస్తున్న మల్లెతీగ కాదు.

అకస్మాత్తుగా మధుపట్ల అసహ్యమే కలిగింది. ఎందు కింతకాలం అవ్యవస్థలో జాప్యం చేశాడు. తిరస్కారం భరించ లేకో, ఆహ్వానమే అందుకోవాలనో, ఇతరత్రా మనస్సు లగ్న మయ్యో, ఈ వ్యవధి ఏర్పడి ఉంటుంది.

మళ్ళీ మధుపట్ల ప్రేమా జాలి! తెలిసి తెలిసి అగ్ని జ్వాలను ఎవరు తాకుతారు. ఎరిగి ఎరిగి మంచుగడ్డను ఎవరు ముట్టుకొంటారు. మధు స్థితి అలాగే అయిపోయింది.

మళ్ళీకోపం! తను గాఢంగా వాంఛించే వ్యక్తికోసం తన సర్వం త్యాగం చేయనక్కరలేదూ! తనని తాను-ప్రత్యేక స్థితిలో - నలుగురికంటే భిన్నంగా వ్యక్తీకరించుకోవద్దూ!

'మధూ! నువ్వంటే నాకు ఇష్టం? వసుకి ఇష్టంలేదు. ఆమెను ఎంతో. గాఢంగా వాంఛించే నువ్వు ఇంతకాలం స్తబ్ధంగా వున్నావంటే నాకే బాగాలేదు. ఆమెలో అనురాగ లత పుష్పింపచేసుకోవద్దూ! అయినా కాలం మించిపోయింది.'

ఎవరో తలుపు తట్టారు.

'రండి' అన్నాను.

పద్మ ప్రవేశించింది. చేతులు జోడించింది. 'కులాసాగా వున్నారా' ప్రశ్నించింది.

'ఆఁ !' ప్రతినమస్కారం చేశాను.

'గుడ్ మార్నింగ్' మధుని చూస్తూ అంది.

'వెరీ గుడ్ మార్నింగ్' బదులు పలికాడు బాధగా.

'వసు ఎక్కడుంది ?'

కుర్చీలో కూర్చుంది.

'లోపల !'

'అక్కడేం చేస్తుంది !'

'ఏమో !'

'నేను వస్తానండి' మధు లేచాడు. పద్మను చూచి ఎందుకో సాలోచనగా తల పదికిస్తూ.

'నేనూ వస్తాను బస్‌స్టాప్‌లో దిగవిడిచి వస్తాను.'

'రాగలరా ?'

'ఫరవాలేదు.'

'సరే మీ యిష్టం !' అన్నాడు మధు.

'మీతో నేనూ వస్తాను.' అంది పద్మ.

'నీయిష్టం' అన్నాను.

మధుని బస్సెక్కించి తిరిగి వస్తుంటే తోవలో పద్మ చెప్పింది.

'మీతో చాలాసంగతులు చెప్పాలి. సలహాతీసుకోవాలి. క్వార్టర్సులో అయితే వసు వుంటుంది. ఆమె వినటం నాకు

ఇష్టంలేదు. ఆ చెట్టుక్రింద కూర్చుందాం మీకు అభ్యంతరం లేకపోతే.'

'అలాగే !'

పద్మలో కొంత విచిత్రత కనబడింది. ఇంతకుముందు తను వసుకంటే ఏవిధంగానూ తక్కువకాదు. అన్నట్లు ప్రవర్తించేది. ఇప్పుడు ఆమె తనతో ఏవిధ గా సాటిఅన్నట్లగా వుంది. అనిష్టంగా అంగీకరించి, చెట్టుక్రింద రాతి బెంచీపైన కూర్చున్నాను. ఎదురుగా పద్మ కూర్చుంది.

కొంచెంసేపటిదాకా పద్మ ఏమీ మాట్లాడలేదు. కళ్లు నిర్లిప్తంగా కదిపింది. తల పంకించింది. పెద్దగా నిట్టూర్చింది.

ఇటువంటి పద్మను ఇంతకుముందు ఎరుగను ఈమేనా పద్మ అనిపించింది. చలాకీగా, ఏ విషయంకూడా తన కవసరం లేనట్లుగా లెక్కలేనితనంతోవుండే పద్మ ఎందుకిలా మారిందీ అనుకొన్నాను.

ఉన్నట్టుండి చాలా రహస్యం చెబుతున్నట్లుగా మెల్లగా అటూ ఇటూ చూచి స్పష్టంగా చెప్పింది.

'నేను మధును ప్రేమిస్తున్నాను.'

'తెలుసు !'

పద్మ ఆశ్చర్యపోయింది. ముఖంలోకి సిగ్గుగా, భయంగా, అమాయకంగా, ఆశగాచూచి, వెంటనే అడిగింది.

'ఎలా తెలుసు !'

'ఊహించుకొన్నాను.'

అంతేనా అన్నట్లు నిరాశగాచూచింది. మధు చెప్పాడు. అని ఆశగా అడగలేదు.

'మధు నన్ను ప్రేమించటంలేదు.'

'మరి?'

'వసును ప్రేమిస్తున్నాడు.'

'ఎందుకు?'

'ఏమో!'

'నిన్నెందుకు ప్రేమించటంలేదు?'

'ఏమో!'

'నువ్వెందుకు ప్రేమిస్తున్నావ్.'

'ఏమో!'

కోపంగా ముఖంలోకి చూస్తూ పద్మ అంది.

"పిల్లికి చెలగాటం ఎలుకకి ప్రాణసంకటం అన్నట్లుగా వుంది. మీ ధోరణి. బాధ చెప్పుకొంటుంటే అడ్డదిడ్డంగా ప్రశ్నిస్తారేం? సానుభూతి చూపవద్దూ! బాధపడే మనిషిని మరీ బాధించవచ్చా? అన్నింటికీ ఏమో అని సమాధానం చెబుతావేం అనికూడా అడగలేదేం?—ఏడేళ్ళనుంచి నా హృదయం తెలుసుకొనే ప్రయత్నమే చేయటంలేదు మధు. ఎందువల్ల అని అడక్కండి. మధు వసును ప్రేమిస్తున్నాడు. నేను మధును ప్రేమిస్తున్నాను. అయితే—నన్ను మధు తలెత్తి చూడడు. మధుని వసు పలకరించలేదు ఈ చక్రానికి అర్థం లేదు. ఇలా ఎంతకాలం ఎడారిలో ఎండమావుల్ని నమ్ముకొని

జీవించాలో - ఈ జీవితలత ఒయాసిస్సు దగ్గరే పూలు పూసి, వాడిపోవాలి కాబోలు.'

'బాధపడకు పద్మా !'

'బాధపడక ఏంచేసేది?-మధు మనస్సు మారే దెప్పుడు?- నా జీవితానికి వెలుగు కనబడేదెప్పుడు ? అసలు నే నెందుకు జీవించాలి.'

'పద్మా మధు వసును పెళ్ళాడితే నువ్వేంచేస్తావ్ ?'

'ఉరిపోసుకు చస్తాను.'

'ఆక్షణంలో పద్మ నిజంగా అంతపనీ చేస్తుందనిపి చింది ఎలా ఓదార్చాలో తెలియలేదు.

'విచారించకు పద్మా ! జీవితమంతా కష్టాలే వుండవు. మంచిఘడియలువస్తాయి. మధు మారుతాడు. నీవాడేకావచ్చు ఆనందంగా వుండు.'

'నిజమా ? నిజంగా నేనా?' పద్మకళ్ళలో నీళ్ళుతిరిగాయి. 'నిజంగా నాకు అంత అదృష్టం వుందంటారా ? - చెప్పండి - మీమాట దేవతలు దీవించుగాక !-నాకు ఆనందం కలుగు తుందా ?' ఆమె గొంతు వణికిపోయింది.

'అవును పద్మా !'

'మీ నోటివాక్కు- ఫలిస్తే... ...'

'నీహృదయం తెలుపుకొనే ప్రయత్నం చేయలేమా ?'

'చేశాను. ఎన్నో చేశాను. పలకరిస్తే పలికేవాడుకాదు. ఉత్తరం వ్రాస్తే జవాబు వ్రాశేవాడుకాడు. అంతకంటె ఏం చేయగలను. స్త్రీని - బలహీనురాలిని, పురుషుడిలా స్వేచ్ఛ

లేనిదానిని, అంతకంటే ఏం చేస్తాను మీరే చెప్పండి. ఆలోచించి చెప్పండి. నన్నర్థం చేసుకోటానికి మధు ప్రయత్నించనే లేదు '

'పద్మా ! నాకిలాఅనిపిస్తుంది. వసు పొందలేని మధును పొందాలనే నీ తాపత్రయంతో వసుకంటే నేనే అధికురాలిని. అనే గర్వం వుందికదూ !'

'లేదు ! లేదండి ! అదేమీలేదు ! ఆమె కక్కరలేని మధు నాకు కావాలి అంతే మధు ఆమె కిష్టుడయితే. నా కోర్కె ఎలావున్నా నోరు తెరిచి వుండేదాన్ని కాదు. ఇప్పుడయినా వాళ్ళ కిష్టమయితే, నాకేమీ వద్దు - ఇలాగే - జీవితాంతం - వుండిపోతాను !

'నీ కిష్టమయిన నీ మధుని గౌరవంగా సంబోధించవేం.?

ఆమె ఆశ్చర్యంగా చూచింది !

'పద్మా ! వెళదాం లే ! నీకు శుభం అవుతుంది నా హృదయం జయిస్తుంది' అని అనునయించాను.

క్వార్టర్సుకి పోయాం. వసు వాకిట్లో వుంది.

'రండి ! - పద్మా ! మీ మధుతో మాట్లాడావా ! ఏం సిగ్గులేదే నీకు మగవాళ్ళవెంట పోవటానికి తగుదునమ్మా అని. వాళ్ళు వెళ్ళితే వెళ్ళేరు గాని నువ్వయినా ఇక్కడుంటే కాస్త కులాసాగా కబుర్లు అయినా చెప్పుకొందుంగా' అంటూ పద్మ భుజం పట్టుకొని లోపలికి తీసుకుపోయింది.

నిష్కల్మషమయిన వసు హృదయం నాకు పరిపూర్ణమయిన తృప్తి నిచ్చింది.

# 15

బెడ్ మీద నిశ్చలంగా కూర్చుని వున్నాను. తల దువ్వుకొని, జడ వేసుకొని, నుదుటి కుంకుమ దిద్దుకొని చేతుల గాజులు గలగల లాడుతుంటే గదిలోకి ప్రవేశించింది వసు. ఆమె చేతిలో అప్పుడే అల్లుకొన్న సన్నజాజుల మాల వుంది అది చేతికిస్తూ, తలలో పెట్టండి' అంది.

జడపైన, వెంట్రుకలు పాయతీసి, జుత్తు చెదురు బెదురు కాకుండా, మాల అడ్డంగా తిప్పి, వెంట్రుకలు లాగిన నొప్పి రాకుండా, తలలో పెట్టాను. జడ సవరించుకొంటూ లోపలికి పోయింది,

పూవు సుకుమారమయింది, హృదయంలాగా, ఏ రేకు నలిగినా, ఊడినా, వు పూర్ణస్థితి కోల్పోయినట్లే! దాని పరమార్థం ఆనందం కలిగిస్తుంది. పూవులో స్త్రీత్వం దాగి వుందేమో! భర్త ప్రక్కనున్న భార్యలా తీగనున్న పూవు శోభించినంతగా అందాలు కురిసినంతగా భర్తలేని భార్యలా త్రుంచివేసిన పూవు ప్రకాశించదు. తీగమీద, పైకి ఎగ ప్రాకుతూ, తన కాంతులతో తీగకే వెన్నెల ప్రసాదించే పూవు జీవితం చాలా అల్పమయిందే! దాంపత్య జీవితానికి పూవుకీ మధ్య అనుబంధం! పూవులాగా సుకుమారమయి, సుందరమయి, పరిమళభరితమై స్త్రీ భర్తను ఆనందపరుస్తుంది. భర్త లేని స్త్రీకి పూవుండదు స్త్రీత్వానికి ప్రాచీన భారతీయ సంప్రదాయ సందేశం పూవు! స్త్రీ పూవు!

స్త్రీ హృదయం పువ్వువంటిది. కోమలం, సుకుమారం అయిన పురుష హృదయమూ పుష్పంవంటిదే! ఆ సుమ పరిమళం ప్రేమ. పరిమళంలేని కుసుమం ప్రేమలేని హృదయం రెండూ నిరర్థకాలు, నిరుపయోగాలు, హృదయపుష్పం ప్రేమ పరిమళంతో అనేక వాహినులై నిరంతరం ప్రవహించాలి. పూవు గుండెలోని వెన్నెలలు పరిమళం, మకరంద బిందువులు హృదయంలోని జ్యోత్స్నలు ప్రేమా, దయా, జాలి, సాను భూతి, సమర్పణా త్యాగం, పుష్ప జ్యోత్స్నలు చిరంజీవులు

పూవులో ఎంత ఆలోచనో – తలంచినకొద్దీ హృదయం ఉద్రూత లూగుతూంది భూమి తన చుట్టు తాను తిరుగుతూ సూర్యుడిచుట్టు తిరగటంలేదు. హృదయపుష్పం చుట్టూ తిరుగుతూఉంది.

హృదయపుష్పంతో స్త్రీ భర్తను ఆకరిస్తుంది. గౌర విస్తుంది. ఈ లోకంలో పూలులేని స్త్రీ భర్తనుకోల్పోతుంది. భూమిమీద గింజలు లేని వ్యక్తి ప్రాణం పోగొట్టుకొన్నట్లు పుష్పం పురుషుడికి ప్రాణదాత! నా ఆలోచనలకు అందని అంతరార్థం నా కళ్ళముందే తిరుగుతూఉంది. నేను వ్యక్తం చేయలేని భావమే నన్ను పులకింప చేస్తూఉంది.

వసు లోపలునుంచి వచ్చింది. మళ్ళీ తలలో పూలు చూశాను. ఈసారి ఆ పన్నజాజులమాలే క్రొత్తగాకనబడింది. ఆ పూలమాల వెనుక తల నీలిమలో సృష్టి రహస్యం మెరిసి నట్లయింది. వసులోనే ఏదో మార్పు పొడకట్టింది. ఆమెతో నాకు తెలియని అనంత భాష్యం భామతి అయింది.

వసు నవ్వుతూ 'అలా చూస్తారేం. పాలు తీసుకోండి' అనటంతో మంచం మీదే కూర్చున్న నేను ఎక్కడో లేనని తెలుసుకొన్నాను. గ్లాసు అందుకొని గబగబా తాగాను.

బైటికివెళ్ళి, చెట్లమధ్య తిరిగి రావాలనిపించింది. వసుతో చెప్పి వెలుపలికి వచ్చాను. ఎక్కడా కూర్చో బుద్ధి పుట్టలేదు. అటూ ఇటూ తిరగాలనిపించింది. అలా తిరుగుతూ బస్ స్టాప్ దగ్గరకు వచ్చాను. కాలి కేదో తగిలింది. తీసి చూశాను. పూలపొట్లం ! లోపల సన్నజాజుల మాల !

ఆ దండ క్రిందపడి పోయినందుకూ, మన్నులో దొర్లి నందుకూ కాలికి తగిలినందుకూ బాధ కలిగింది. తీసుకొని ఇంటివైపు మళ్ళాను.

వాకిట్లో మధుమూర్తి నిలబడివున్నాడు. అతనివాలకం చూస్తే ఎదురుదెబ్బ తగిలి, పడబోయి నిలదొక్కుకుని, నలుగురూ చూస్తారేమో అన్న దిగులుతో కుంబించుకుపోయిన వాడిలాగా కనబడ్డాడు.

నా ముఖంలోకీ, పొట్లం వైపూ అదేపనిగా చూస్తున్నాడు.

'ఏం?' అన్నాను.

'ఆ పొట్లం మీకెక్కడిది ?'

'నీకెందుకు ?'

'అది నాది !'

'కాదు. నాది.'

'మదనపల్లినుంచి తెచ్చాను.'

'నాకు బస్ స్టాప్‌లో దొరికింది.'

'అది నాదే!'

'నాదెందుకు కాకూడదు.'

'నాది కాబట్టి.'

'మీదని ఋజువు చేయలేరుకదా - కనుక నాది - పూలు ఎవరి స్వంతమూ కాదు. ఈమాల మీదయితే పోగొట్టుకోవటం తప్పు! నాకు దొరకటం నా తప్పు కాదు.'

'నామాట వినండి!'

'లోపలికి పోయి!'

గదిలోకి వచ్చి, కూర్చున్నాము.

'పూవుల్ని భద్రంగా దాచుకోవాలి. పారేసుకోకూడదు. తీసుకోండి' అందించాను. ఆనందంగా తీసుకొన్నాడు.

ఎవరో తలుపు తట్టారు తీశాను. పద్మ! చాలా కంగారుగా వుంది. మధువైపు చూచి 'మీరిక్కడున్నారా?' అంది. 'ఊఁ!' అని తల వూపాడు.

'మీతో మాటాడాలి. అలా వస్తారా!' నన్నడిగింది.

'ఇప్పుడేనా?'

'మీ యిష్టం ఇప్పుడే వస్తే మంచిది.'

'సరే!'

వెలుపలికి బయలుదేరుతూ, ఇప్పుడేవస్తాను' అని చెప్పి, పద్మవెంట వెళ్లాను.

కొంచెం దూరం పోయినతరవాత చెప్పింది.

'ఒక విచిత్రం జరిగింది!'

'ఏమిటి !'

'మధు నన్ను మాట్లాడించాడు.'

'ఎప్పుడు ?'

'ఉదయం మాయింటికి వచ్చాడు.'

'చాలాసంతోషం పద్మా !'

'ఎందుకు అని అడగలేదేం ?'

'ప్రతిసారి ప్రశ్నఅడిగేందుకు అనువుగా నువ్వుమాట్లాడతావు. ప్రశ్నించితే జవాబు చెప్పటం అలవాటు నీకు. పోనీ ఇప్పుడు చెప్పు ! ఎందుకు ?'

'ఎందుకంటే ఎలా చెప్పేది.'

నవ్వింది. ఎందుకు నవ్విందో తెలియదు. ఏమయినా ఆమె సంతోషంగా వున్నందుకే ఆనందించాను. అంతలోనే విచారంతో చెప్పింది.

'అన్యాయం చేశాడు.'

'ఏమయిందో స్పష్టంగా చెప్పు పద్మా ! ప్రశ్నలు వేయించక.'

'నాగదికి వచ్చి పద్మా నాకు సన్నజాజుల పూలమాల కట్టిపెడతావా - అన్నాడు. ఊఁ - అన్నాను ఆనందంతో. సంతోషంగానేఉంది. ఎందుకూఅంటే నాకలలు ఫలించాయి. పూలమాల నా తలలో తురుముతాడు కాబోలు అని. అది నాకోసమే ఉద్దేశించకపోతే, ఎవరికోసమో అయితే బజారులో ఏపూల అంగడిలోనో మాల కట్టించుకోవచ్చుగా అనుకొని, అర్థగంటలో తయారుచేస్తాను - అన్నాను. అయితే మళ్ళ

వస్తాను - అని వెళ్ళిపోయాడు. నాకెంతో విచారం కలిగింది. మళ్ళీ అరగంటకు వచ్చాడు. అయిందా - అన్నాడు. ఊఁ - అన్నాను. ఇలా ఇవ్వు - అంటే ఇచ్చివేశాను. తీసుకొని మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. మీతో చెబుదామనివచ్చాను అని ముగించింది,

ఆ పూలమాల తీసుకొని, వసుకి ఇవ్వటంకోసం మధు ఇక్కడికి వచ్చాడు.'

'నిజమా ? ? !'

ఊఁ !'

'నేను నాచేతులతో కట్టిన దండ-ఆదండ ఆప్యాయంగా హృదయమంతా కూర్చి కట్టినదండ వసుకి ఇస్తారా? అందుకా నాచేత కట్టించింది ? ఇదా న్యాయం'?

పద్మకి కోపం, బాధా పెచ్చుమీరివుండాలి. 'వెళదాం రండి' అంది. బయలుదేరాం. క్వార్టర్స్‌లో కిటికీ తిన్నగా వచ్చేసరికి 'గెటౌట్ - యూ గెటౌట్' అనే మాటలు విని లోపలికి చూచేసరికి కిటికీలోంచి దూకిన పాము మెడచుట్టూ చుట్టుకుపోయింది. తీరా చూస్తే అది సన్నజాబులమాల ! నామెడచుట్టూపడింది. ఆనందంతో వళ్ళు తెలియలేదు. కమ్మని సువాసన !

గదిలో అగ్నిశిఖలాగా జ్వాలలు రేగుతూవుంది వసు. గెటౌట్ - ఐసే గెటౌట్' అని మళ్ళీ వినిపించింది.

కదలకుండా మెదలకుండా శిలా ప్రతిమలా మధు నిల బడి వున్నాడు. నోటివెంట మాటలేదు. గుండెలు ఎలా వున్నాయో, ఊపిరి ఆడుతూ వుందో లేదో అనిపించింది.

వసు కోపాగ్ని జ్వాలలకు రాతివిగ్రహంవంటి మధు కరిగి కాలి బూడిదయి పోతాడేమో నన్నంత భయం కలిగింది.

'ఇదే! ఇదే మాల నేను కట్టింది. ఈసన్నజాజులమాలే! ఆ దండ నా కివ్వరా' అని అడిగింది పద్మ మెడలో దండతీసి చేతికిచ్చాను పుచ్చుకొంది.

గెటౌట్ అనిపించుకొన్న మధు బైటిక రాలేదు "కాన్' కమిన్ అనిపించుకొని మేము లోపలికి పోయాము. వసు పద్మ చేతిలో మాల చూచుకొని ఆశ్చర్యపోయింది మధు మమ్మల్ని చూచి తల దించుకొన్నాడు.

పద్మ దగ్గర్నుంచి దండ తీసుకొని, 'ఈ చెండు నేను తలలో పెట్టుకోవాలట. అలా కాకపోతే తనే అలంకరిస్తాడట- ఎవరిచ్చారీ అధికారం - చెప్పాలి ?! ప్రేమించి, తనవెంట క్రీనీడలాగా - తిరుగుతున్న అనురాగ జ్యోత్స్నను చూడలేని వారు, ప్రేమించామనీ, ప్రేమించమనీ,నీచాతినీచంగా, దాసాను దాసుడిలాగా, మగసిరి కోల్పోయి, ప్రాధేయపడే సిగ్గూఎగ్గూ లేని ప్రవర్తన ! ఛీ! చదువులెందుకు ! సంస్కారంలేని చదువులు ! డిగ్రీలు తగలేసుకొంటే మంచిది - నేనూ డాక్టర్ నే అని తిరిగేకంటే—'

వసు కోపంతో ఊగిపోతూవుంది. అంతకోపం నే నెన్నడూ చూడలేను ఆమెను చూస్తుంటే గుండెలు అవిసి పోయాయి.

'ఈ చెండు నాకు వద్దు - పద్మా నీకూ ఇవ్వను-ఎవరికి కావాలి ! త్వరగా అడగండి. మానవత్వం ఉన్నవాళ్ళకిస్తాను.'

నాకెందుకో తీసుకోవా లనిపించలేదు. మధు తీసుకుంటాడేమోనని చూశాను. అతనూ ఆసక్తి చూపలేదు. కళ్ళలో తిరుగుతున్న నీళ్ళు తుడుచుకొన్నాడు.

'ఎవరికీ వద్దా? మీరు తీసుకోండి' వసు మాల నాకు ఇచ్చింది. 'ఈ చెండు పద్మ తలలో పెట్టండి నామాట దయ చేసి వినండి. ఇప్పుడయినా చలనంలేని రాతి గుండెలకు కదలిక వస్తుందేమో! ప్రేమించే సుకుమార హృదయం అర్థం చేసుకొనే అవకాశం కలుగుతుందేమో! - పద్మా తల ఒగ్గవే!'

పద్మ దగ్గరకు వస్తుందనుకొన్నాను. రాలేదు. అక్కడే వుంటుందనుకొన్నాను అదీలేదు. దూరంగాపోయింది. నా చేతికి అందకూడదను ఉన్నంత దూరంగా నిలబడింది. నాతో చెప్పింది.

'మీరంటే నాకు గౌరవమే! కాని తలలో సన్నజాజుల మాల అలంకరిస్తుంటే ఆనందించేంత గౌరవంలేదు వసూ నువ్వేమీ బాధపడవద్దు. నాకు ఆదండవద్దు నేను ఎవరినీ అగౌరవం పరచటంలేదు. ఎవరికీ బాధకలిగించాలని ఉద్దేశం కాదు. క్షమించండి. నాకు గౌరవంవద్దు. ఆధిక్యంవద్దు. ఇలా బ్రతికితే చాలు. వస్తాను.'

వెళ్ళిపోబోయింది. 'పద్మా' మధు పిలిచాడు. ఆగింది. దగ్గరకుపోయి, కళ్ళలోకిచూస్తూ 'బాధ పడుతున్నావా?' అన్నాడు. 'లేదండి!' అంది. నా దగ్గరకు వచ్చాడు. దండ తీసుకొన్నాడు. ఇచ్చాను.

పద్మ ఆశగాచూస్తూవుంది. కళ్ళలో కోటి నక్షత్రాలు మెరిశాయి. తనువంతా వెలిగించిన జ్యోతిలాగా అయింది. బాధ, ఆశ్చర్యం, ఆనందం, ముప్పిరిగొన్నాయి. ముడిపడ్డాయి. పద్మ కదల్లేదు. ఆనందంలో సిగ్గుపుట్టింది. సిగ్గుతో మెలికలు తిరిగింది.

పద్మ జడపైన దుగుసుగా పాయతీసి, గబగబా దండ తలలో కట్టాడు. పద్మ బాధ ఆనందంగా సహించింది. తల సవరించి, కిటికీలోంచి చెట్లమీదుగా ఆకాశంలోకిచూస్తున్నాడు.

వసు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పద్మ కళ్ళు నీటికుంత లయ్యాయి. నా హృదయం అంతా ఆనందమయమయి పోయింది.

## 16

క్షయ నయమవుతుం దనుకోలేదు నిశ్చయమయిన మరణం దూరమవుతుందీ. తొలగిపోతుందీ అనుకోలేదు. ఆప రేషన్ విజయవంతంగా ముగుస్తుంది అనికూడా భావించలేదు. కుడి ఊపిరితిత్తిలో కొద్దిభాగం తీసేసినా చింతించలేదు.

అర్ధాంగి భాగమయిన ఎడం ఊపిరితిత్తి బాగున్నందుకు సంతోషించాను. నా శరీరంలో భార్యకోసం భగవంతుడు దాచివుంచిన ఆస్తినీ, హక్కునూ, దుర్వినియోగ పరచలేదని తృప్తిపడ్డాను.

డాక్టర్ ఎల్మర్ ఆడమ్స్ నన్ను తన బిడ్డలాగా చూచుకొన్నాడు. ఏకష్టమూ రానీయలేదు. నా స్థితిని సాను భూతితో అర్థం చేసుకొన్నాడు. మందులు అందీయలేని ఆరోగ్యం ఆయన మమకారం అందించింది. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, ఇక్కడకు వచ్చి, ఆవిధంగా అయి, కోలుకొని ఇలా వున్నామాఅంటే, ఇదంతా ఆనందంతోనో, గర్వం తోనో తిలకించి, పొంగిపోతూవుండే పరమాత్మ హృదయ భావం అర్థంకాదు.

భగవంతుడుగుర్తుకువస్తే తక్షణం కళ్ళలో వసు మెదలు తుంది ఆమె లేకపోతే నే నేమయి ఉండేవాడినో క్షయముదిరి ఆరోగ్యం పూర్తిగా పాడయి, మానసికంగాక్షీణించి, చింతతో జీవితం చాలించి వుండే వాడినేమో!

వసు నన్ను బ్రతికించింది. ప్రాణభిక్ష ప్రసాదించింది. ఈ తనువులో నూతాన్నాశలు సృష్టించింది. ఈ బ్రతుక్కి ఒక అర్థం కనిపించింది. దూరదృష్టినీ, నిరీక్షణ అనుగ్రహించింది ఆశల అందాల నందనవనం నిర్మించి ఇచ్చింది.

అయితే ఆమెకు నేనేమి మిగిల్చాను. ఏమీలేదు! యుద్ధం జరిగి, ఆగిపోయిన తావులో కూలిపోయిన కట్టడం లాంటి శరీరం మిగిల్చి వుంచాను అయితే దానిలో గజిబిజిగా పెరిగిపోయిన ముళ్ళ తీగెలుకుండా తెగి, చదునయిన పరిపూర్ణ హృదయం దాచి వుంచాను.

క్షయ నా రక్త మాంసాలను పిండి ముద్దచేసి విడిచి పెట్టింది. ఈ ముద్దతో నేను ఒక సుందర స్వప్నాన్ని - కాదు.

నవ్య జీవితాన్ని సృజించుకోవాలి. అందుకు నిర్ణీతమయిన కాలం నాలుగేళ్ళ దూరంలోవుంది. ఆకాలం ఈ కాయంలో ఏ నూత్నత నిర్మిస్తుందో వేచి చూడవలసిందే కాని, వేగిరపాటు కూడదని నాకూ తెలుసు. ఈలోగా వచ్చేమార్పు, ఏ పరిస్థితులు కల్పిస్తుందో, ఏ పరిణామాలు తీసుకువస్తుందో, గాని ప్రభావం ఎలా వుంటుందో ఊహకు అందేదికాదు.

ఒక నూత్న జన్మ పొందినంత ఉత్సాహంవుంది. అదే ఎందుకో నిర్వికల్పంగా లేదు. కలిగిన ఆరోగ్యం కలిగించిన ప్రమాదం కఠినమయిందీ, లేనిదీ, అయింది. ప్రమాదానికి కాక తప్పలేదు.

'నాలుగు సంవత్సరాలదాకా నువ్వొదా
అనస్థాడివి. ఈలోగా పెళ్ళి చేసుకో
చెబుతున్నాను.' అని డాక్టర్
చేకూరింది' అని చెప్పిన
ఇటు విచారం, ఏ
వినది. వి

తలచి బాధపడుతూ వుందనుకొన్నాను. ఎందుకు రెండు పసి హృదయాలు పరిస్థితుల తాకిడికి భిన్నమయి అకారణంగా బాధా బంధాల చిక్కాయి అని కుమిలి పోతుందనుకొన్నాను. కాని వాస్తవం అది కాదు.

ఎంత వద్దనుకొన్నా, లేదో విడపించుకోవాలన్నా, దానితో మనకేమీ సంబంధం లేదని తప్పుకొని తిరగదలచినా వాస్తవం విడిచిపెట్టదు. నిజాన్ని కాదని తిరగలేము. నిజం నిష్ఠురవ్వ అయితే అదీ హృదయాలయంలో భరించరాని ...తో ప్రజ్వరిల్లి చుట్టూవున్న వస్తు సముదయాన్ని దగ్ధం ...చేసి, తీరుతుంది. అదే జరిగింది.

...తుంటే, సంవత్సరంఅంతా నిద్రాహారాలు ...ంగా ఆమె శరీరంలో క్షీణత ...తూ సాయంకాలం జ్వరం ...నేడెక్కుతూ వుం

కాని వాస్తవం అదికాదు, నా కిష్టంలేని వాస్తవంపట్ల నాకు విశ్వాసంలేదు. నేను నమ్మలేని నిజాన్ని గూర్చి ఆలోచించటం కోపంగా వుంటుంది.

నా నమ్మకం, అపనమ్మకం ఎలావున్నా, వసు ఆరోగ్యం పాడయిందనేది సత్యం. ఆమెకు. టీ. బీ. ఎటాక్ అయిందనేది వాస్తవం.

# 17

కాపాడటానికి వచ్చిన వసు కాపాడవలసిన స్థితిలో వుంది. నాకు ఆరోగ్యం కలిగించి తనఆరోగ్యం కాల్పోయింది. నా క్షయ నయంచేసి, తను క్షయరోగిఅయింది. నాకు ప్రాణం ప్రసాదించి, తను ప్రాణాపాయం స్థితిలో చిక్కుకుంది. నా మూలంగా ఆమె జీవితం నాశనం చేసుకొంది.

ఇంతజరిగినా ఏమీ జరగనట్లు ఇంట్లో అన్ని పనులు చేస్తూవుంది ఎంత వారించినా వినటంలేదు మొండిపట్టుబట్టి చీటికి మాటికి ఏడ్చే చిన్ననాటి వసు పట్టుదల ఈనాటికీ తనలోనే దాచుకొంది.

వసుకు కోపంలేదు. బాధా అసహ్యంలేవు. అన్నం తిన్నట్లు, నిద్రపోయినట్లు క్షయ సామాన్యవిషయంగా వుంది ఆమెకు. ఏమీ లెక్కచేయటంలేదు.

విశ్రాంతి తీసుకోమంటే పిచ్చిగా నవ్వుతుంది. అలసట కలిగినప్పుడు, కదలకుండా కూర్చుని ఏదయినా నాకు అవసరం అనుకొంటే వెంటనే చేస్తూవుంది.

వసుకు జబ్బు తీవ్రంగా రాలేదు, ఉన్నజబ్బు ముదిరి పోలేదు. మొదటి దశలోనే పోల్చుకున్నాము. మందులు తెప్పించాను. వాడుతూ వున్నాను.

ఎక్స్-రే ఫోటో ప్రకారం – ఊపిరితిత్తులు ఏమీ పాడు కాలేదు. ఆపరేషన్ అవసరంవుండదు. అయినా ఆమె విశ్రాంతి తీసుకోవాలి. ఆమాట చెబితే ఏమాత్రం వినదు.

ఎంతచెప్పినా వినకుండా పాలుకాస్తూ కూర్చుంది. వంట గదిలోంచి వెలుపలికి తీసుకువచ్చాను. ఇకపైన ఆ పొగలోకి, ఆ వేడిదగ్గరకు ఆ వంటపని చెంతకూ పోనీయకూడదనే నిశ్చయించుకొన్నాను. ఆరోజే వంటపనికి కూడామనిషి ఏర్పాటు చేయించాను. ఇకముందు ఎప్పటికీ ఆమెను అగదివైపు పోనీయను. పోవటానికి వీలులేదు.

'వసూ!'

'ఊఁ!'

'క్షయ వచ్చే అవకాశంవుంది. తెనాలి వెళ్ళిపొమ్మంటే విన్నావా?

'ఇప్పు డేమయింది!'

ఈ జబ్బు......'

'మీరు దగ్గుతున్నారు. మీకు దగరే వున్నాను.'

'అయితే విను – విశ్రాంతి తీసుకోవాలి.'

'మరి భోజనం ?'

'వంటమనిషి చేస్తుంది '

'మీకు నేనే వంటచేయాలి నాకు వంటమనిషివండినా ఫరవాలేదు.'

'నువ్వెప్పుడయినా అత్తమ్మదగ్గరుండగా వంటచేశావా? సుకుమారంగా పెరిగిన నువ్వు ఈగాధ పడటం నాకిష్టంలేదు '

'స్త్రీ వంటచేయకపోతే స్త్రీత్వంనుంచి దూరమయి పోతుంది. పురుషుడి హృదయానికి వంట దగ్గరదారి.

'కావచ్చు!' కాని ఈజబ్బునయమయింవాకా అయినా నువ్వు ఆగది ముఖం చూడవద్దు.

'నా కిప్పుడేం జబ్బు ! - బాగానేవుంది. మీ తీరు ! చాల్లెండి నాకు జబ్బేం లేదు.'

'అదికాదు వసూ !'

'సరే!—మీయిష్టం. వంటగదివైపు పోను. అక్కడేమీ పనిచేయను,సరా ! - పాలు కాగిపోతున్నాయి. మీకు తెస్తానుండండి !

'వద్దు వసూ ! పనిమనిషికి చెప్పు ! ఇంతా చెప్పినా వినవేం !

'ఇప్పటికి మాత్రం !'

వసు పెద్ద పెద్ద అంగలతో వంటగదిలోకి త్వరత్వరగా పోయింది. ఆపుతానసుకొందో ఏమో ! వంటగదిలో నాసంబంధం దూరం చేయబోతున్నాడు బాబోయ్ అనే భయంతో వెళ్ళిందో ఏమో !

ఎంతకీ వసు రాకపోవటంతో నేనూ వెళ్ళేసరికి పొయ్యి మీద పాలు పొంగిపోయి, కట్టెలు ఆరిపోయి, చిత్రమయిన వాసన వస్తూవుంటే దిగాలుపడి చూస్తూవుంది వసు.

'వసూ ! ఎందు కలా వున్నావ్.'

'పాలు పొంగిపోయాయి.'

నేను తాగటానికి పాలు ఉండవని బాధ పడుతుందేమో అనుకొన్నాను. అందుకే అన్నాను. 'మళ్ళీ పాలు పోయించు కొందాంలే బాధపడకు.

'కాదండీ పాలు పొంగి పొయ్యిపాలు కాకూడదండీ' వసు చెప్పేటప్పుడు గొంతు బొంగురుపోయింది.

ఆమెను అక్కడినుంచి తీసుకువచ్చాను. బాధ పడవద్దని చెప్పాను, ఓదార్చుతున్నాను.

డాక్టర్ ఎల్‌మక్ ఆడమ్స్ గదిలోకి వచ్చాడు. నమస్కరించాను.

'కూర్చోండి.'

కూర్చున్నాను.

వసు దూరంగా నిలబడింది.

'ఆరోగ్యం ఎలావుంది !'

'బాగానేవుంది. కానీ... ...'

'మరేం !'

'వసునుగూర్చే !'

'ఫరవాలేదు. మీరు అనవసరంగా చింతపడవద్దు. త్వరలో బాగవుతుంది. ఈ కంగారు, ఈ దిగులు చూస్తుంటే నవ్వు వస్తూవుంది '

'టి. బీ. ఏరక్కమూండే......'

'నయంచేద్దాం నువ్వన్నావు నే నన్నాను—ఇంకా జబ్బు వుంటుంటా పారిపోదూ - సంతోషంగా వుండాలి మాధవ్.'

మరేమీ మాట్లాడలేకపోయాను.

రోగినిగూర్చి డాక్టర్లు చింతపడితే ఎలా - అదేమీ బాగుండదు - ఆమె నీకు భార్యఅన్నా అమ్మాయి అని మరచి పోవాలి బాగుచెయ్యాలి అంతే - చెప్పినప్పుడే ఇంటికి పంపి వుంటే ఎంతో బాగుండేది !

'పంపాలనే అనుకొన్నాను.'

'కానీ వీలుకాలేదు. అవునా మాధవ్ ! అదీమంచిదే ! మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో ఆనందంగా వుంటుంది. అనాదిగా ప్రపంచంలో ఎన్నో ధర్మాలు పుట్టాయి, పెరిగాయి, నశించాయి. కానీ అప్పటినుంచి ఇప్పటివాకా నిరంతరం కాంతి స్రవంతిలాగా ప్రవహిస్తున్నది. ఒక్క దాంపత్య ధర్మమే. మాధవ్ మిమ్మల్ని చూస్తుంటే దాంపత్య ధర్మంతో పాటు అనేక ఇతర ధర్మాలు జీవం పోసుకుంటాయి అనిపిస్తుంది. మీ దగ్గర పూర్వతరం వాళ్ళు సహితం నేర్చుకోవలసింది వుందనిపిస్తుంది. మీ ఇద్దరికీ వున్న అనురాగం, ఆత్మీయత, ఒకరిని ఎడబాసి మరొకరు — ప్రత్యేకంగా కష్టసమయంలో — ఉండలేని ఆరాధన నాకెంతో సంతోషం కలిగిస్తుంది.'

నా తలదగ్గర నిలబడివున్న వసు లోపలికి ఎప్పుడు వెళ్ళిందో కాని, ఆ సమయంలో ఆమె ము

వెన్నెలలు పొంగుతాయో చూద్దామంటే అక్కడ లేదు.

'థాంక్స్ డాక్టర్'

'నో-నో. ఇందులో థాంక్స్ చెప్పవలసింది ఏముంది. అయినా ఒక విషయం చెప్పవలసిన బాధ్యత వుంది మాధవ్'

'చెప్పండి !'

'నీకు క్షయ నయమయింది. ఆమెకూ త్వరలో బాగవుతుంది. మీ రిద్దరూ ఆనందంగా వుండాలంటే ఎవరికీ మళ్ళీ రాకూడదు. రాకుండా చేసుకోవాలంటే అది మీ చేతుల్లోనేవుంది జీవితాన్ని ఆనందంగా మార్చుకోవాలన్న, అది మీ మీదే ఆధారపడివుంది. ఆమెకు వీలయినంత దూరంగా వుండాలి. ఈసారి టీ. బి. రావటం తేలిక ! అయితే నయం కాదు. అర్థమయిం దనుకొంటాను. అవునా మాధవ్ !'

'తెలిసింది డాక్టర్ !'

'క్షేమంకోరే చెప్పాను.'

'తెలుసుకోగలనండీ - కానీ ఆమెకు దూరంగా వుండలేను - ఆమె అంతే !'

'అది మంచిదే ! - మిమ్మల్ని వేరయి పొమ్మనటం లేదు. ఒక్కచోటే వుండండి—మరీ దగ్గరగా వుండకండి. ఒకరు విడిచిన గాలి మరొకరు పీల్చే అంతదగ్గరగా వుండకండి అంతే నేను చెప్పేది.'

'మీ మాట పాటిస్తాను.'

అలాచేస్తే మీ భవిష్యత్తు బాగుంటుంది.'

'థాంక్స్ డాక్టర్ !'

'వస్తాను మాధవ్ !'

'సరేనండీ !'

వెళ్ళిపోయాడు. పిడుగు పడినట్లుగా వుంది. చెప్పింది మంచిమాటే ! నిర్వహించటంలోనే వుంది కష్టం !

వసు వచ్చింది.

'డాక్టర్ వెళ్ళిపోయారా ?'

ఆఁ !'

దగ్గరకు వచ్చి, తటాలున తొలగి, దూరంగా పోయి కూర్చుంది.

'అదేమిటి వసూ !'

'డాక్టర్ ఎల్మర్ ఆడమ్స్ చెప్పింది. అర్థమయింది.'

# 18

'సరేలెండి ! – లేచి ఎన్నిపనులు చేయటానికి ఓపిక వున్నా, ఈ గది దాటి, ఏ గదిలోకీపోయి, ఏ పనీచేసి, ఏమో అలసట పొంది ఆరోగ్యం పాడుచేసుకోకూడదుగా – మీరు వెళ్ళి కొంచెం మంచినీళ్ళు తీసుకురండి !

'అలా అన్నావు – బాగుంది. వస్తానుండు.'

లోపలికి పోయి కూజానిండా నీళ్ళు తెచ్చి, గ్లాసులో పోసి ఇచ్చాను. తాగి గ్లాసు ఇచ్చింది. మిగిలివున్న నీళ్ళు బైట పారబోసి గ్లాసు కూజామీద బోర్లా పెట్టాను.

మధుమూర్తి వస్తుంటే తలుపుతీసి లోపలికి రమ్మన్నాను. వచ్చాడు. కుర్చీ చూపించాను. కూర్చున్నాడు.

మధు ఎప్పుడువచ్చినా వసు లోపలికిపోయేది. ఇప్పుడు పోలేదు. కారణం- అతని మంచిమనసు అర్థమయివుండటమో నేను గదిదాటి ఎక్కడికీపోవద్దని శాసించటమో అయివుండాలి. అడిగాను.

'పద్మ బాగుందా !'

'ఊఁ !' వేడిగా బుసకొట్టాడు.

'అదేం అలా వున్నావు ?'

'ఎలా వున్నానంటారు.' కోపంగా ఎదురు ప్రశ్న వేశాడు.

'నాకంటే బాగా తెలియవలసింది......'

'బాగానే వున్నాను.'

రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

'మీరు డాక్టర్ వసుమతికి ఏమవుతారు ?'

'ఎందుకా ప్రశ్న ?'

దయచేసి సమాధానం చెప్పండి. చిన్నాన్న కాదు కదా ?'

'కాదని ఎవరన్నారు ?'

'పద్మ అంతా చెప్పింది. మీ రామెకు బావకదా !'

'అవును '

'మీ మామయ్యచేత మా ఎదుట దెబ్బలు తిన్నారు- మేం కైవాలి వచ్చినప్పుడు - గుర్తుందా ?'

'నాకు గుర్తుంది కానీ......'

'మీరు - ఇద్దరూ - నాతో ఎందు కాడారీనాటకం?'

'నాటకం ?'

'అవును ! నాటకమే ! - ఆమె మిమ్మల్ని గురించి చిన్నాన్నకంటే పూజ్యులని చెప్పింది - మీరు ఆమెకు పెళ్ళి చేయటానికి సిద్ధమయ్యారు - ఇది నాటకం కాదా ?'

'కాదు - వాస్తవమే !'

'చిన్నప్పుడే మీ ఇద్దరికీ పెళ్ళి చేయాలని పెద్దలందరూ నిశ్చయించారుగా.'

'అవును !'

'మరి ఇది ఎలా చేస్తారు ?'

'ఏం - మాకు యిష్టమయింది అలాగే.'

'మీ ఇష్టాలుమీవే! కాని ఇతరుల ఇష్టాలతో చెలగాటాలు ఆడకూడదు. వంచించకూడదు.'

"మధూ ! పెద్దమాటలే వాడుతున్నావు. ఇప్పుడే పరిస్థితిలో వున్నావో తెలిసి సానుభూతి చూపటంకంటే చేయగలిగింది లేదు. చేసింది అంతా కోరి కొనసాగించిందే ! అంతులో అనిష్టంగా అనాలోచితంగా ఏమీ చేయలేదు. నిన్నుగానీ, మరి ఎవరినయినా గానీ వంచించాలని ప్రయత్నించలేదు. చెలగాటాలు ఆడలేదు."

"అబద్ధాలు ఆడకండి. ఏనాటికయినా మీ ఇద్దరికీ పెళ్ళి అవుతుందని తెలిస్తే కొన్ని సంవత్సరాల వసంతాలు నా జీవితంలో వ్యర్థం అయ్యేవి కావు. ఇంత వ్యధ మానసిక క్షోభ

చెంది వుండేవాడినికాను. ఇదేమీ నాకు తెలియకుండా చేశారు.

"డాక్టరు మధుమూర్తి! ప్రేమించే పద్మను అర్థం చేసుకొని పెళ్ళికిసిద్ధమైనందుకు సంతోషంకలిగింది. మనిషిలో మానవత్వం పట్ల విశ్వాసం కుదిరింది. అందుచేత అభిమానం కూడా పెరిగింది. ఇప్పుడు మా బాధను, ఎవరూ ఏమీ అన నవసరంలేదు.

వసు నన్ను ఉద్దేశించి బావ అనటం క్రొత్తగా కోమల స్పర్శగా, హృదయ పరామర్శగా వినిపించింది. ఇంతవరకు జీవితంలో ఎప్పుడూ అలా పిలవలేదు. ఆ రెండు అక్షరాలు, అనివ్యక్తం చేసే ఆ అర్థం సాధించే హృదయం, ఆ హృద యంలో వెలిగే అనురాగ దీప్తులు, నా హృదయంలో దేదీప్యమానంగా ప్రకాశించాయి.

"ఏమయినా తప్పు జరిగివుంటే నాతోనే కావాలి. అందుకు కారణం నామాటలు అర్థం చేసుకోకపోవటమే! ఎదుటివారి మాటలూ చేతలూ హృదయాలు అర్థంకాక, వెర్రిగా ప్రవర్తించి, గతించిందానికి చింతించటం తెలివితక్కువ తనానికి నిదర్శనం. పైగా అనవసరఆవేశాలు చూపించుకోవటం మరీ తప్పు."

"తప్పు! తెలివితక్కువ! అనండి. నోటికి వచ్చినట్టు అనటం అలవాటేనేమో! లోపల ఒకభావం ఉంచుకొని, పైకి మరోభావం వ్యక్తం చేసేవాళ్ళతో - అవును పాపం - అర్థం లేకుండా ప్రవర్తించకూడదు. నా హృదయం, నాబాధ ఎవరికీ

అక్కరలేదు. నేను పొందిన హృదయవేదన రంపపుకోత అపాత్రులపట్ల చూపించిన ఓర్పు ! ఛీ! నా జీవితాన్ని నాశనం చేశారు."

మధుని అర్థం చేసుకోవాలి ! జీవితంలో దుర్భరంగా చాలాభాగం వ్యర్థమే అయింది. కాని కారకులు ఎవరు ? తనే కారకుడు ! నీడను చూచి భ్రమించి, వస్తువునుఆశించటం తప్పు!

అతని వ్యథతలుచుకొంటే ముచ్చెమటలుపోస్తున్నాయి. హృదయం నిర్ఘాంత పోతుంది. వసు కారణమేమో ! అప్రయత్నంగా ఆమె ప్రమేయంలేకుండా, ఆమెకు తెలియకుండా ఆమె కారణమేమో అనిపించింది. అది గుర్తించినా దిద్దుకోలేని స్థితి వెలుగుతున్న దీపకళిక భ్రమింగటానికి వచ్చి ఆహుతి అయ్యే క్రిమికీటకాలను దీపం రక్షించలేదు.

వసు శీలంలోని ఔన్నత్యపు టంచుల్లోంచి లేస్తున్న కాంతిచ్ఛటలు చూచి భ్రమించి కళ్ళు నులుంకోవటం వెర్రితనమే ! ఆమె పలికిన ప్రతిమాట వజ్రబాణమయి అతన్ని బాధించింది. చెప్పాను.

'మధూ తెలిసో, తెలియకో నాకు కష్టం కలిగింది. అందుకెవరు బాధ్యులనేది అనవసరమే ! ఎప్పుడో ఎవరివల్లనో స్పష్టంగా సర్వవిషయాలు తెలుసుకొని, నీ జాగ్రత్తలో నువ్వు ఉండవలసింది. అంతా జరిగిపోయింది. ఇప్పుడు వ్యథ చెందటం వృథా నీబాధ తెలుసుకొని సానుభూతి చూపటంకంటే నేను చేయగలిగింది ఏమీలేదు.'

'నాకు ఎవరి సానుభూతీ అక్కరలేదు. చూపిన జాలీ, చేసిన అపచారమూ చాలు.'

"ఇంకా అపార్థం చేసుకొంటున్నావు. బాధతో మాట్లాడుతున్నావు—అంతా మరచిపో ? హాయిగా పద్మను పెళ్ళాడి బాధ మరచిపోయి.......'

"నాకెవరూ ఏమీ చెప్పనక్కరలేదు. బాధ - బాధ మరచిపోవాలీ ! - ఏడు సంవత్సరాలు నా హృదయం ప్రతి క్షణమూ అయోమయంగా నరక యాతన పొందింది. ఆ యాతన అంతా ఒకేరూపమై, శక్తిమంతమై, సాంద్రీభూతమై, అకుంఠితమై, ఎవరూ తొలిగించలేని, ఎవరూ ఆదుకోలేని, ఎవరూ సహాయంచేయలేని స్థితిలో తీవ్ర నిష్ఠుర బాణమై, డాక్టర్ వసుమతిని చిత్రహింసపెట్టి వదులుతుంది. నేనునిజంగా బాధపడివుంటే ఆబాధ అంతా ఈమెను బాధించి తీరుతుంది. నా ఏడు సంవత్సరాల బాధ ఏడు గంటలయినా, ఈమెను పీడించి, పిండి, పిప్పిచేస్తుంది ఏమీచేయలేక కళ్ళనీరు కళ్ళలో క్రుక్కుకొని, దిగాలుపడి, సహాయం చేసేందుకు శక్తి సామర్థ్యాలు లేక, బాధపడుతూ మీరూ చూస్తూనే వుంటారు."

"మధూ - భయంకరంగా మాట్లాడావు. అది నీకు న్యాయమేనా ?"

"మీరంటే నాకు ప్రేమా, గౌరవం - మీ బాధ సహించలేను. మీరు ఆమెను పెళ్ళిచేసుకోండి. హాయిగా వుండండి- నాకసి తీరిపోతుంది. ఎవరిమీదా ద్వేషంలేదిప్పుడు వస్తాను.

మధు చరచరా వాకిలిదాటి రోడ్డుమీదికి వెళ్ళిపోయాడు.

దిగులుతో అతన్నే చూస్తూ కూర్చున్నాం.

# 19

ఆరోజు రాత్రి వసుకు నిద్రలేదు. ఆ గదిలోనే పడు కొన్న నాకూ నిద్ర రాలేదు. ఆకాశంలోకి చూస్తూవున్నాను. అంతాచీకటి! ఎక్కడో నక్షత్రాలు మినుకు మినుకు మంటూ వున్నాయి. కిటికీలోంచి చెట్లమీదుగా అరుంధతీనక్షత్రంకోసం కళ్ళు వెతుకుతున్నాయి.

వసు మంచంమీద కదలకుండా పడుకోలేక పోతూవుంది. అటూ ఇట్లో అనిష్టంగా, బాధగా దొర్లుతున్నట్లు అనిపిస్తూ వుంది. తనకు సంబంధం లేని కర్మకాండంపట్ల బాధగా తల వూపినట్లు ఆమె కదులుతూ వుంది.

శానిటోరియం అంతా నిశ్శబ్దంగావుంది. ఎక్కడో వెలుగుతున్న లైట్లు రెండూ మూడు చెట్ల సందుల్లోంచి కన బడుతున్నాయి. చుట్టూవున్న నిశ్శబ్దాన్ని చీల్చుకొని అప్పు డప్పుడూ కుక్కల అరుపులూ, అక్కడక్కడ పక్షుల రొద వినబడుతున్నాయి.

నా హృదయం మూలుగుతూవుంది. అది నాకు తప్ప వినిపించదు. నాలో నేనే వింటున్న అసహ్యమయిన ధ్వని అది తెగిపోదు, విశ్రాంతి లభించదు.

వసుకు కనురెప్పలు మూత పడటంలేదు ఆమెమంచం మీంచి వినిపించే చప్పుడునుబట్టి, చాలా ఆవేదన పడుతూ వుందని తెలుస్తూ వుంది.

గదిలో లైటులేదు. వసూ ఎలావుందో చూద్దామంటే వీలులేదు. లైటు వేద్దామనుకొన్నాను. అంతలోనే ఎందుకులే అనిపించింది. వసుకు నిద్రపట్టే అవకాశం వుంటే లైటు వేయటంవల్ల చెడిపోవచ్చు.

'ఏమండీ !'

వసు పిలుపు !

'ఊఁ !'

నా జవాబు !

'లైటు వేస్తారా !

'ఊఁ !'

దుప్పటి తొలగించి, లేచి. స్విచ్ దగ్గరకుపోయి, లైటు వేశాను. తిరిగి వచ్చి మంచంమీద కూర్చున్నాను.

'నిద్ర రావటం లేదా ?'

వసు అడిగింది.

'లేదు !'

ప్రత్యుత్తరం ఇచ్చాను.

'నాకు నిద్రపట్టటంలేదు.'

'స్లీపింగ్ పిల్స్ ఇవ్వనా ?'

'వద్దండి !'

కొంచెంసేపు నిశ్శబ్దం !

'వసూ ! ఎందుకు నిద్ర రావటంలేదూ !'

'ఏమో !'

కోపంతో వున్న మనషికి, మిట్టమధ్యాహ్నం సూర్య కిరణాల వేడిమి మరీకోపం తెప్పించినట్లు, గదిలో వెలిగే లైటు ఆమె బాధను అధికం చేసింది.

'తల నొప్పిగా వుంది.'

వసు చెప్పింది.

'మా తలు ఇవ్వనా?'

'వద్దు.'

'గుండె పోటుగా వుంది!'

'ఎందుకు?'

'ఏమో!'

'ఎక్కువగా ఆలోచించకు వసూ!'

'లేదు. నేనేమీ ఆలోచించటం లేదు!'

నేను మాట్లాడకుండా కూర్చున్నాను. తెలియని బాధ నా గుండెలో తిరుగుతూ వుంది.

'వళ్ళంతా పోటు ప్రుపుతూవుంది.'

చెప్పింది.

'నాకూ బాధగా వుంది.'

చెప్పాను.

'మీరు పండుకోండి.'

వసు అంతబాధలోనూ నన్ను నిద్రపొమ్మనే చెప్పింది. ఆ స్థితిలోనూ ఆమె నా ఆరోగ్యం గూర్చి ఆలోచిస్తూవుంది. ఏంచేయాలో తెలియలేదు. పడుకొన్నాను నిద్ర రాక ఆమె వైపు చూస్తున్నాను.

గుండెలో తలలో వళ్ళంతా విపరీతంగా పోటు పొడు తున్నట్లు సంచలించి పోయింది. బాధ భరించలేకనేమో మరక్క చిట్లించింది. కళ్ళు మంకిపోతున్నాయి కాబోలు గట్టిగా మూసింది. లోపల విచ్చలవిడిగా మండుతున్న అగ్ని జ్వాలల్ని బైటికి రాకుండా అణచి వుంచటానికే అన్నట్లుగా పెదాలు మునిపంట్లతో నొక్కి పట్టింది.

'లైటు ఆర్పనా ?'

ఆమె జవాబు చెప్పలేదు. నోరు విప్పితే, అగ్నికణాలు దొర్లిపడతాయనుకొందోఏమో చేతితోనే వద్దనిసైగచేసింది.

వసు గొంతు గుర గుర లాడుతున్నట్లు వినిపించింది. దగ్గు రాబోతుంటే ఆపుకొంటుందేమో అనుకొన్నాను. గొంతుకి కళ్ళె అడ్డంపడి, పైకి రాకుండా, లోనికీ పోకుండా వుంటే వసు కొట్టుకులాడుతుందేమో అని తలపోశాను.

ఆమెకి జబ్బు ఏమంత ముదిరిపోలేదు ఇంతవరకు ఎప్పుడూ అంతగా బాధపడలేదు! అయితే ఇదిమాత్రం క్షయ రోగి బాధకాదు. నేనుకూడా — అంత జబ్బులోనూ ఇంత బాధ పడలేదు

ఇదంతా చూస్తువుంటే నా విధిలో ఎక్కడోవున్న లోపం ఆమెను బాధిస్తుందేమో అనుకొన్నాను.

ఆమె రోగ కారణంగా, శారీరకంగా పొందుతున్న బాధకంటే, అంతులేని ఆలోచనలతో, మానసికంగా, అనుభూతి పొంది ఇముడ్చుకోలేని బరువుతో హార్దికంగా పడే బాధ ఎక్కువయింది.

ఆలోచనలూ, అనుభూతులు తెచ్చిపెట్టిన భీకరత్వం, ఆమె శరీరం ఆధీనంలోకి తీసికొని, చిన్నపిల్లవాడు, రబ్బరు బెలూన్‌ని ఇష్టంవచ్చినట్లు రెండు చేతులతో నలిపి, పళ్ళమధ్య నొక్కి,- ఊదగలిగినంత, బెలూన్ ఇముడ్చుకోలేనంత గాలి వూది, - దాన్ని పగలగొట్టుతున్నట్లు అనిపించింది

వసు తల బెడ్ మీద దిండుకు బాదుకొంది. చేతులు పట్టెలకేసి కొట్టుకొంది కాళ్ళు ఎడాపెడా మంచం మీద మోదింది. శరీరం అంతా వంకర్లు తిరిగిపోయింది. వళ్ళంతా వేల గండుసూదులూ, మరమేకులూ, గుచ్చుతున్నట్లు గాయాల్లో కెలుకుతున్నట్లు, పుండుమీద కారం చల్లినట్లు, మంచం మీద అల్లాడి పోతూవుంది.

వసు ఎందుకిలా అవుతూవుంది? ఈ యాతనకు అర్థమేమిటి? నేనేం చేయాలి? ఈ స్థితి పోగొట్టేదెట్లా? ఇది క్షయ కాదు! ఆ జబ్బుకారణంగా కాదీ యాతన! ఎందుకు, ఎందుకీ బాధ!?

హృదయంలో ఉన్న చీకటి ఆకాశంలో - ప్రపంచాన్ని దగ్ధం చేయటానికి అనంతాగ్ని చేతపట్టుకొని బయలుదేరినట్లు మధు మెరిలాడు. అప్పుడా మూర్తిని చూస్తుంటే భయం కలిగింది. అతని మాటలు గుర్తుకు రాగానే వళ్ళంత కంపించి పోయింది.

అతని మాటలు నెను వేసుతున్నాయో! లేకపోతే ఏమిటి యాతన? అర్థంలేని మూగఘోష! చూస్తూ ప్రాంరకుంత

టమా ? ఏమీ చేయలేక నిశ్చలంగా, స్తబ్ధంగా పిరికిగా మిగిలి పోవటమా ! ఆమెకు ఏమందులూ అక్కరలేదు ? !

ఎందు కేర్పడిందీ పరిస్థితి, ఎవరు దీనికి కారణం ? మధు గత సంవత్సరాల బాధ ఇలాగేవుందా ? అతనివాక్కు కార్య రూపం దాల్చంగా, ఆమాటలకు అంతశక్తివుందా? ఉంటుంది ఉండి తీరాలి. ఆమెకు కష్టం తొలగాలి ఆనందం కలగాలి.

దగ్గరనున్న నేను, విపరీతంగా కదలిపోతున్న వసు మాటలతో కాపాడటమా ? అర్థంలేదు. ఆమెచేత సపర్యలు చేయించుకొని ఇప్పుడేవిధంగా మూగగా వుండిపోవటమా ! ఇది న్యాయమా ?

దగ్గరగా వెళతాను. నాసామీప్యంతో ఆమె కారోగ్యం కలుగుతుంది. నా ఎదుట ఆమెకు ఆనందం వుంటుంది. నా స్పర్శతో ఆమెకు తలనొప్పి తగ్గిపోవాలి. కిటికీలోంచి వచ్చేగాలి నామీదుగా ప్రసరించి, ఆమెను చుట్టూతాకి, బాధ తొలిగించాలి.

మంచంమీంచి లేచాను దుప్పటి తొలిగించాను. ఎవరో క్రూరంగా అడ్డంగా నిలబడ్డట్లు అయింది. నా చేతులు బంధింపబడ్డాయి. కాళ్ళకు గొలుసులువేసి కట్టివేశారెవరో ? హృదయం ఆమెవద్దకు శరీరాన్ని లాగుతూవుంది. మనస్సు ఆపుతూవుంది.

ఆ క్షణంలో వసుమీద కోపం వచ్చింది. అందుకు కారణంలేదు. హృదయాన్ని - ఎవరినో - బాధ పెట్టినందు ఫలితమా ! నేనెందుకు బాధపడాలి ? ఇదెక్కడి ధర్మం !

విస్తుంటే, అన్యాయంగా బాధ కలుగుతుంటే, నన్ను నేను దూరంగా నాకు నేను వేరుగా శిక్షించుకొంటూ వుండటం అర్థంలేని పనే !

మధు హెచ్చరిక చెవుల్లో పెనుగంట ధ్వనిలాగా విన బడుతూవుంది — ఆమెను చూస్తూ ఏమీచేయలేక అలాగే వుండిపోతారు — ఉండిపోను. అలా వీల్లేదు. ఆమెకు బాధ కలగటానికీ వీల్లేదు.

ఎల్మర్ ఆడమ్స్ హితవాక్యం, అహితమయి, సర్పా కృతితో వెంటాడుతూవుంది—నీ ఆరోగ్యం - జాగ్రత్త— నీ ఆరోగ్యం బాగుంది. ఏమీ ఫరవాలేదు. మిగిలేవుంటుంది. అది మారటానికి వీలులేదు.

అటు ధు - ఇటు ఎల్మర్ ఆడమ్స్ హృదయాన్ని చిత్రహింస పెడుతున్నారు. ఒకరు తాడు కట్టి బరబరా రాళ్లూ రప్పలుమీద లాగుతూవుంటే మరొకరు ముళ్ళకంపలు పరు స్తున్నారు. ఒకరు పెట్రోలు పోస్తే ఇంకొకరు నిప్పు ముట్టిస్తు న్నారు. హృదయం కమిలి, ముళ్ళు గుచ్చుకొని, కాలిపోయి, బూడిద అవుతూవుంది.

అంతేనా నా హృదయం విలువ ! ఇంతమాత్రమేనా? ఇలా వ్యర్థం కావలసిందేనా ?—లేదు. అలా జరగటానికివీలు లేదు.

నా హృదయమే నిర్మలమయితే, నా జీవితమే విచిత్ర మయితే - ఏంజరిగితే అదే జరుగుతుందిలెమ్మని మంచం మీంచి లేచి, వసు బెడ్ దగ్గరకు పోయాను. నా రాకతో

కలిగిన అలికిడి విని, కళ్ళు మూసుకొన్న ఆమె చప్పుడు చేయకుండా కళ్ళు విప్పి నావైపు చూచింది.

గుండెల్లో పొంగుతున్న లావాలో శరీరంఅంతామునిగిపోయి, సుడిగుండాలలో సింగరాలు తిరుగుతున్నట్లు, రక్తంలో పోటుపుట్టి దేనుశుఘానున్న తీరమంతా అల్లకల్లోలం అయిపోయినట్లు, అగ్ని కాలవల బరబరా ప్రాకి వచ్చి సర్వం మాడ్చివేస్తున్నట్టు బాధపడుతూ వుంది వసు.

'వసూ !'

'ఊఁ !'

నుదుటిమీద చేయివేశాను. నుదురు మండిపోతూ వుంది. నా చేయే కాలిపోయింది.

'ఏమండీ ! మీరు వెళ్ళిపొండి పోయి పడుకోండి— నా దగ్గరకు రాకండి - నేను క్షయరోగిని - నా జబ్బు మీకు వస్తుంది. పొండి దూరంగా పొండి'

'నేను పోను - ఇక్కడున్నుంచి దూరంగా పోనే పోను ! వసూ నేను దూరంగా వుండలేను.'

'క్షయ అంటువ్యాధి - ఇది మీకు వస్తే మళ్ళీ నయం కాదు. నా సౌభాగ్యం నాకుండాలి. మీరు దూరంగాపొండి.'

'రాదు. రాదు వసూ ! క్షయ రాదు. వచ్చినా ఫరవా లేదు.'

'వద్దు - ఆమాట అనవద్దు - మీ క్షేమం కోరి అలా చెబుతున్నాను - దూరంగా వుండండి.'

'నువ్వు కంటికి నిద్రలేక, విశ్రాంతిలేక, నాకళ్ళ ఎదుటే బాధతో ఊగిసలాడి పోతుంటే ఎలా భరిస్తాను. నాకసాధ్యం వసూ !'

'నేను చేసిన పాపానికి - ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను. నాకు తెలియదు మధుకింత బాధ కలిగించానని నామేలు నేను చూచుకొన్నాను. నన్ను నేను రక్షించుకొన్నాను. అంతేగాని అతని బాధ అర్థం చేసుకోలేదు కాని అర్థమయింది ఇప్పుడర్థమయింది అతనెంత బాధపడ్డాడు- ఇంక నాకు బాధవుండదు. ఈ యాతన జయిస్తున్నాను. దీనికి అతీతురాలని కాబోతున్నాను. మీరు వెళ్ళండి - దయచేసి వెళ్ళిపొండి.'

'నాకు దయలేదు వసూ ! ఈ హృదయంలో దయారసం ఇంకిపోయింది. కఠిన పాషాణమే అయింది. అందుకే ఇంతవరకు నిన్ను బాధపడనిచ్చాను.'

'లేదు - మీరు మంచిపనే చేశారు. దగ్గరకు రాకుండా వుండటమే మంచిది.'

వసు మంచంమీద తలగడ దగ్గర కూర్చుని, ఆమె తల చేతుల్లోకి తీసుకొన్నాను. దేవుడి దగ్గరకు పూజకు తీసుకుపోయే పూవులాంటి వసు తల నా చేతుల్లో పదిలంగా దాచుకొన్నాను

'వద్దు వెళ్ళండి తలనొప్పి తల పగిలిపోతున్నట్లునొప్పి! మీరు ఇక్కడుంటే నేను నా బాధ పోగొట్టుకొంటాను కానీ ఏం ప్రయోజనం ? ఆ బాధ మీ శరీరం అంతా క్రమ్మి

కొంటుంది. యాతననుంచి నాకు విడుదలవస్తుంది కాని, ఆ యాతన మిమ్మల్ని మింగివేస్తుంది. వెళ్ళండి.

'ఏమయినాకానీ - ఇక్కడినుంచి కదలను. నిన్ను సౌభాగ్యవతిగా మిగుల్చుకోవాలని మరణం నోట్లోచిక్కకుండా దాక్కొనే నేను, సౌభాగ్యవంతుడిగా మిగిలే అవకాశం తగ్గినప్పుడు, రహస్యపు ఉనికిని బయట పెట్టుకొని మరణానికి నన్ను నేను అప్పగించుకొని, నిన్ను బ్రతికించుకోక తప్పదు. నీ హృదయం నా సొమ్ము. నా హృదయం నీసొమ్ము. మన ఇద్దరి హృదయాలు మన ఇద్దరి ఆస్తులు! భగవంతు డనుగ్రహించిన అమూల్య సంపదలు! నీ తనువూ నాతనువూ మనవికావు. వాటితో దేవుడు ఏం కోరుకుంటే అదే జరగనీ, ఏ ఆటలనయినా ఆడ కోసి, మన హృదయాలతో వాటిని వుంచితే వుంచనీ, తీసుకొంటే తీసుకొనీ, కాని దేవుడు జీవించి వున్నంతకాలం ఈ హృదయాలు జీవించివుంటాయి. ఈ హృదయజ్యోతులు ఆరిపోవు నిరంతరం వెలుగుతూవుంటాయి. పంచభూతాలు సృష్టిలో ఉన్నంకాలం ప్రకాశిస్తూఉంటాయి. వాటికి చావు పుట్టుకలు లేవు అవి నిత్యమూ వెలిగే దీపాలు వసూ!' అంటూ ఆమె ముఖంలో నాముఖం దాచుకొన్నాను. నా ముఖంతో, ఆమె వదనాన్ని క్రూరహస్తాల బారినుంచి దాచివుంచాను. ఆమె నుదుటి వేడిమి నా నుదుటలోకి తీసుకొన్నాను నా నుదుటి వ్రాతలో ఆమె నుదుటి వ్రాత మారుస్తున్నాను. ఆమె నుదుటి వ్రాతతో నా నుదుటి వ్రాత దిద్దుకొంటున్నాను.

నా చెవుల్లో నాకు ఆనందం కలిగించే అమృతవాక్యాలు పొందుతున్నాయి. గుండెలు పులకరించి పోతున్నాయి స్వర్గా నాథుని శీకరాలుమీద కురికినట్లయింది 'బావా! బావా!' వసు పిలిచింది 'వసూ! వసూ!' నేను పలికాను. 'బావా!' అంటూ మెడచుట్టు చేతులు వేసింది. 'వసూ!' అంటూ దగ్గరకు లాక్కొన్నాను.

నా చెవులకు వినబడకుండా, హృదయం మాత్రమే వినే టట్లుగా మెల్లిగా గొణుగుతూ వుంది. 'బావా!' బావా! అంటూ తల గుండెల్లో దాచుకొంది.

కొంచెం సేపట్లోనే బాధ తొలగిపోయి, హాయిగా నాచేతుల్లోనే గుండెమీదే నిద్రపోయింది వసు.

కూర్చున్నవాడిని కూర్చున్నట్లుగానే ఎప్పుడో అక్కడే నిద్రపోయాను తెల్లవారిం తరవాత వసు ముఖంలో ఉషో దయం కనిపించింది. స్వచ్ఛంగా, నిర్మలంగా, మబ్బులు విడి పోయిన ఆకాశంలాగా వుంది వసు.

నాలో నూతనచైతన్యం నాకు తెలియకుండా ప్రవే శించింది హృదయం వికసించిన కుసుమం అయింది.

## 20

వసుకి పూర్తిఆరోగ్యం చేకూరేసరికి నాలుగు నెలలు పట్టింది. క్రమ క్రమంగా వసు మునుపటి మనిషి అవుతూవుం- పడిన బాధ అంతా ఒక పీడకలలాగా విడిపోవటం ప్రారంభ మయింది.

మేం ఆరోగ్యంగా వున్నప్పుడే శానిటోరియం అధి కారులు నన్ను మళ్ళీ డ్యూటీలో చేరమన్నారు. వసుమతి మనం తెనాలి వెళ్ళిపోయి ప్రాక్టీసు పెడదాం కానీ, ఇక్కడ ఉద్యోగంలో మళ్ళీ చేరవద్దని బ్రతిమాలింది. పట్టుబట్టింది.

వసు పట్టుదలే నెగ్గింది. అధికారులకు రిజిగ్నేషన్ కాగితం ఇచ్చివేశాను. ఆరుసంవత్సరాల క్రితం కోరి ఉద్యోగంలో చేరి, ఇప్పుడు విడిచి వెళుతున్నాను. ఆరోగ్యంగానే వున్నాను. ఆ మధ్యకాలంలో పొందిన అనుభూతి శిథిలాలు మాత్రం మిగిలే వున్నాయి.

మేం తెనాలి వెళ్ళిపోవాలను కొంటున్న సమయంలో వివాహ లేఖ అందింది. డాక్టర్ మధుమూర్తి, డాక్టర్ పద్మావతి దంపతులు కాబోతున్నారని తెలిసి సంతోషించాను. ఇద్దరం పెళ్ళికి వెళదామని వసుతో చెబితే 'మెడలో మాంగళ్యం లేకుండా నే నా ప్రాంతాలకు రాను' అని చెప్పింది.

'మీరు వెళ్ళిరండి. ఇక్కడనుంచి మనం తిరుపతి వెళదాం. అక్కడికే అమ్మను, మరిదినీ మామనూ పిలిపించు

కొందాం. పెళ్ళి అక్కడజరిగితేనే నాకు ఆనందంగా వుంటుంది అనికూడా చెప్పింది.

వసు పెళ్ళిప్రస్తావన తెస్తే నాకు బాధ కలిగింది నా ఆరోగ్యం స్థితి గుర్తుచేశాను. వసుకి అదేమంత ఆలోచించవలసిన సంగతిగా అనిపించలేదు. 'నేను కోరుతూవుంది,నా మెడలో మంగళసూత్రం' అంది.

'వసూ! నువ్వు పసిదానివి కాదు. అంతా తెలిసిన దానివి. ఇప్పుడు పెళ్లిజరగటం ధర్మమో కాదో ఆలోచించు నువ్వు ఏ నిర్ణయంచేసినా అంగీకరిస్తాను.

'నా నిర్ణయం చెప్పాను బావా!'

'నీ యిష్టం!'

పెళ్ళి నిశ్చయించుకొన్నాము అది నాకేమంత పొంగి పోవలసిన ఏర్పాటుగా కన్పించలేదు. బాహ్యంగా సంతోషించ లేదని కాదు. సంతోషించాను. అయితే ఆ ఆనందంలో వెలితి వుంది.

వసుకు ఎంతో పండుగలా వుంది. ఎంతో ఉత్సాహంతో వెలిగిపోతూవుంది. పుట్టినరోజు వేడుక చేసుకొంటే పొందే తృప్తి వందరెట్లు అయినట్లు కనబడుతూవుంది.

ఆమె ఆనందం కారణంగా నాకు సంతోషంగా ఉంది. కాని పెళ్ళిని గురించి కనిన కలలు, మధుర భావనలు ఇప్పుడు కోటకోణం అందుకోలేదు.

వసు పూచిన తంగేడులా, ఆవిరిసిన మల్లెమొగ్గలా, కళకళలాడుతూ, కాంతులు విరజిమ్ముతూవుంది. ఆమె ఆలోచనే వాస్తవం, ఆనందం కావాలని తహతహ లాడుతున్నాను. అది అందని ఆనందంకోసం అర్రులుచాచే స్థితికాదు. అదుపులో వున్న అమృతం—హాలాహలం కాకుండా చూచుకొనే తొందరపాటు!

మధూ పద్మల పెళ్ళికి ఇవ్వవలసిన కానుకలు అనుకొన్నట్లే తయారు చేయించి, నాకు అందించింది వసు. బంగారు తాడుతో మంగళసూత్రం, వెండి మెట్టెలు నాకు తృప్తి కలిగించాయి

భర్త వున్న ప్రతిస్త్రీ తాళి ధరించే ఉంటుంది. తాళి శృంగార జీవితానికి గుర్తు. తాళి అంటే దాంపత్యం స్త్రీ పురుషుల ఏకీకృతరూపం భారతీయతకు ప్రతీకగా నిలిచిన తాళి సంప్రదాయపు ఆడంబరమే కాదు. దాని వెనుక రెండు జీవితాల కలయిక దాగిఉంది. ఆ రెండు జీవితాలు రెండు పేటలయి, ఎడం ఎడంగా సాగివచ్చి, ఒక్కచోట చేరి విడిపోకుండా మిగిలిఉంటాయి. స్త్రీ మెడలో పురుషుడు మంగళసూత్రంలో వేసే మూడు ముడులు వారి ప్రత్యేకస్వాతంత్ర్యం పోయిందనీ, సమిష్టి స్వాతంత్ర్యం ఏర్పడిందనీ ఆ బంధం ఒక అనుబంధంగా విడిపోకుండా ఉంటుందనే కాక స్త్రీ జీవితం పైన పురుషుడు త్రిమూర్తుల కార్యభార నిక్షేపించినట్లుభావన.

మట్టెలు ధ్వని కలిగిస్తాయి. అవి ధరించిన పాదాలు త్వరగా నడిస్తే ధ్వని త్వరగానూ, ఆలస్యంగా నడిస్తే ఆలస్యం

గానూ సంగీతం లా వినబడుతుంది మట్టెలలోధ్వని ఆరోహణ గానీ, హృదయంలో వచ్చిన మార్పుపై ఆధారపడివుంది. ఆ మార్పు ఏమిటో హృదయేశ్వరుడే గ్రహిస్తాడు. మట్టెలు స్త్రీ గుండెలోని ఆనందం.భయం, ఉద్వేగం, ఆతృత, వ్యక్తం చేస్తాయి. గ్రహించేవాళ్ళు లేనప్పుడు మట్టెలు తొలిగి పోతాయి. మట్టెలు హృదయ ధ్వనికి ప్రతిధ్వనులు - అంతే కాదు. స్త్రీ గుండె స్పందనలో కలిపి, తాదాత్మ్యం పొందిన పురుషుకి గుండెల చప్పుడు వ్యక్తంచేసేది స్త్రీ కాళ్ళ వ్రేళ్ళ మట్టెలు

వసు తెచ్చి ఇచ్చిన తాళీ, మట్టెలూ నాకు ఎన్నో భావాలు కలిగిస్తున్నాయి. వాటిపరమార్థం నా హృదయాలో పరవళ్ళు తొక్కుతూవుంది. జాతి జీవితంలో పెనవేసుకుపోయి నామమాత్ర ఆచారాలుగావున్న సంప్రదాయాల వెనుక ఎంత ఉన్నతభావాలు ఇమిడివున్నాయో ఆలోచించినకొద్దీ, కనిపించి నట్లే కనపించి, మెరుపులాగా మెరిసి, అందకుండా మిగిలి పోతున్నాయి.

ఆమెను శానిటోరియంలోనే వుంచి, నేను గుంటూరు వెళ్ళాను. మధు ఇంట్లో పెళ్ళి - అన్ని ఏర్పాట్లతో - బాగా జరిగింది.

పెళ్ళికి వసుమతి రాలేదేమని అందరూ అడిగారు' ఏం సమాధానం చెప్పాలో తెలియక 'రావాలనే అనుకొంది. కాని రావటానికి వీలులేకపోయింది. అని జవాబుచెప్పాను.

పెళ్ళికి ఎందరో బంధువులు వచ్చారు. అందరూ చదువుకొన్న వాళ్ళుకాదు. స్నేహితులూ వచ్చారు. చదువు

కొన్నవాళ్ళు. స్త్రీలలో పెళ్ళికి వచ్చినవాళ్ళు దాదాపు అందరూ స్నేహితులే! పెద్దచదువులని, లోకంలో విలువగల డిగ్రీలు వున్న డాక్టర్లు, లెక్చరర్లు ఎందరో స్త్రీలు వచ్చారు. వాళ్ళదగ్గరే సంస్కారం, భారతీయత తప్పకుండా వుండవలసిన వాళ్ళు.

పెళ్ళయి, భర్తలున్న వాళ్ళలో ఒకరిద్దరిమెడల్లో తాళి కనిపించలేదు! కొద్దిమంది పాలభాగాన తిలకంలేదు! కొందరు పూలుపెట్టుకోలేదు పూలుధరించిన వారు ఒకపువ్వో, అర పువ్వో మాత్రమే! సన్నజాజులమాలో, మల్లెమొగ్గలచెండో తాల్చిన వాళ్ళు చాలా తక్కువమంది వున్నారు. చాలా మందికీ ఒక చేతికి గడియారంవుంది! రెండో చేతికి ఒకటో రెండో బంగారం గాజులున్నాయి! అందంగా ఆరయినా గాజులున్న వాళ్ళు కొద్దిమందే! ఇద్దరికో ముగ్గురికో తప్ప ఎవరి కాళ్ళ వేళ్ళకు మట్టెలులేవు!!

లోకం మారుతూ వుంది. విలువలు మారుతున్నాయి. ఏ వస్తువు ప్రధానమయిందో, అనే విచక్షణ తగ్గిపోతూవుంది. ఆధునికం పేరిట కాలం కల్పించిన 'అడ్డుతెరలు జీవితంచుట్టూ చుట్టుక పోతున్నాయి.

నా హృదయంలో అమ్మ మెదిలింది అరక్షణంకూడా ఆమె తాళిబొట్టులేకుండా వుండేది కాదు మురికి అయిన పసుపు తాడు.మార్చుకోటానికి, క్రొత్త తాడు మెడలో వేసుకొని, పాతతాడుకత్తిరించి పాతతాడు ఒక కొనలోవున్న తాళి

లోకి క్రొత్తతాడు కొనజరిపి తాళి క్రొత్తతాడులోకి మార్చు కొని క్రొత్తతాడు రెండుకొనలూ నాన్న చేత ముడివేయించు కొనేది అందుకే కాబోలు అమ్మ పునిస్త్రీగానే కాలం చేసింది,

పెళ్లయిన తరవాత మధూ పద్మా వచ్చి నమస్కరించారు నమస్కారం పొందవలసినంత పెద్దవాడిని కాను. కానీ 'కలకాలం సుఖంగా జీవించండి' అని ఆశీర్వదించాను. ఆ ఆశీస్సు వెనుక హృదయం ఉద్రేకపరచిన ఆనందంవుంది.

—— మన్మల్ని తూలనాడి, మధు వెళ్లిపోయిన తరవాత పద్మ ఏంచెప్పిందో తెలియదు. నాలుగురోజులకే మధు వ్రాసిన ఉత్తరం వచ్చింది అందులో తన అర్థం 'పర్థలేని మాటలు పట్టించుకోవద్దనీ, అవి హృదయం స్వాధీనం తప్పిన మాటలనీ, నిండు గుండెలతో ఇద్దరూ క్షమించండనీ గతం మరచి పోదామనీ వ్రాశాడు.

ఆ ఉత్తరం మంచిపనే చేసింది చక్కని పరిణామమే తెచ్చింది. ఆ పరివర్తన నాలో ప్రేమ సృష్టించింది, మధు కంటే ఆత్మీయులు ఎవరూ లేనిపించింది. నా హృదయంలో మధు బాసిపట్టు వేసుకు కూర్చున్నాడు.

మధు అంత మంచి భావంతోనే, మంగళసూత్రం మట్టెలూ నన్నే చేయించుకొని తీసుకురమ్మని వ్రాశాడు. అది ఆనందం కలిగించింది.

పద్మ మెడలో తాళి అనంతకాంతితో ప్రకాశిస్తూ వుంది. కాళ్లమట్టెలు నవ్వుతూ వున్నాయి.

'పద్మా!'

పిలిచాను.

'ఊఁ!'

తలఎత్తిచూచింది.

అల్లరి అమ్మాయివి, అమాయకురాలివి, పిచ్చిపిల్లవి! నీజీవితం ఆనందమయంచేసుకో? మధు హృదయం ప్రేమతో గౌరవంతో పరిపాలించుకో. ఎన్నోఏళ్ళనుంచి నువ్వు కోరు కొంటూవున్న మధు భర్తగా లభ్యమయిన ఆనందంతో పొంగిపోయి ప్రమత్తురాలివయి వుండిపోవద్దు. నీ భర్త ఆరా ధనతో జీవించు. నీ ఆరేళ్ళ తపస్సు అనుక్షణ నిరీక్షణ ఫలిం చిన – ఈ శుభ ఘడియలు – సంతోష దృశ్యాలు– హృదయం గదిలో భద్రపరచుకో! తాళంవేచి వుంచుకో! సంతోష సమ యాలలో ఆ ఆనందం తనివి తీరా చూచుకో! ఆలోచించుకో! పద్మా! భర్త అనురాగానికి చిహ్నంగా నీకు సంక్రమించిన వస్తువులూ ఎప్పుడూ చులకనగా చూడకు! కలలోకూడా వాటిపైన గౌరవంకోల్పోవద్దు. లోకంలో చాలామందిని చూచి నీకీ మాటచెబుతున్నాను. అమ్మా పద్మా!– నీమెడలో ఈ మాంగళ్యం కలకాలం ప్రకాశిస్తూ వుండాలి.'

పద్మముఖం ఆనందంతో వికసించింది. కళ్ళు విశాల మయ్యాయి. తృప్తిగా చూచి, నెమ్మదిగా తలదించుకొంది.

'మధూ! అరమరికలు లేకుండా వ్యక్తికి హృదయం అర్పించటం నీకు తెలుసు. ఆమె కోసం నువ్వు నీ సర్వం దత్తం

చేయగలవు. నీ హృదయంలో చెడు తలంపులు లేవు. నమ్మిన విషయంలో నమ్మకం చెడకుండావుంటే దీన్నినువ్వు పూజిస్తావు. కోపంవస్తే వళ్ళు తెలియదు. ఏంమాట్లాడుతున్నావో అర్థం చేసుకోలేవు. ఎంతకోపంవచ్చినా, ఒక్కక్షణం ఆలోచించి న్యాయమయిందే అయితే నువ్వేమయినా చేయి! నీ మాటలకు నీ హృదయశక్తివుంది. మరచిపోవద్దు! తొందరపాటు ఎప్పుడూ కూడదు. మధు'

'అన్నయ్యా!'

'ఆవేశంతో పిలిచాడు.

తమ్ముడూ!'

పరవశంతో పలికాను.

'మీరు చెప్పినట్లు జాగ్రత్తగావుంటా నన్నయ్యా!

'సంతోషం తమ్ముడూ - మీ రిద్దరూ సర్వ సంతోషాలతో జీవించండి. మీకు అన్నిశుభాలూ కలుగుతాయి'

మధు ఆనందంతో పులకించిపోతున్నాడు. పద్మసంతోషంతో పొంగిపోతూవుంది.

వాళ్ళిద్దరూ అలాగే జీవితాంతం వుండాలని, వారి ముఖాలమీద కనిపించే ఈ పెళ్ళిశోభ ఎప్పుడూ వెలుగొందాలని హృదయంలో కోరుకొన్నాను.

వాళ్ళదగ్గర సెలవు తీసుకొని, గుంటూరు విడిచిపెట్టి మదనపల్లివచ్చి, శానిటోరియం చేరుకొన్నాను.

వసు సామాను సర్దివుంచింది. మరీ అనవసరమయిన వస్తువులు తప్ప, మిగతా వాటిని వస్తువుల్ని లగేజ్ చేయటానికి సిద్ధం చేయించింది.

అత్తమ్మకూ నాన్నకూ తమ్ముడికీ, బంధువులకూ అందరికీ తిరుపతిలో జరగబోయే మా వివాహం సంగతి తెలియ చేసింది,

రేపే బయలుదేరి వెళుతున్నామని శానిటోరియంలో అధికారులకీ, డాక్టర్లకీ, నర్సులకీ, రోగులకీ, అందరికీ, తెలిపాను ఆరాత్రి వీడ్కోలువిందు జరిగింది. అధికారులు నా కృషిని ప్రశంసించారు. త్యాగాన్ని మెచ్చుకొన్నారు. ఆశీర్వదించారు.

డాక్టర్ ఎల్మర్ ఆడమ్స్ నేను వెళిపోతున్నానని బాధ పడ్డాడు. ఆ హృదయ స్పందనలో అమృతమే చిందింది.

'డాక్టర్ మాధవ్! ఆరోగ్యంతో ఇక్కడికి వచ్చావు. ఆరోగ్యంతోనే వెళుతున్నావు. ఇక్కడ ఎంతో సేవచేసి, ఎందరినో రోగులను బాగుచేశావు. నీ సేవవల్ల నాకు సంపూర్ణ సానుభూతివుంది. నీలాగా స్వార్థంగా - ఆరోగ్యంకూడా లెక్కచేయకుండా తమవిధి నిర్వహించే డాక్టర్స చాలా తక్కువమంది వుంటారు. నువ్వు ఆరోగ్యం కోల్పోయి, బాధ పడికూడా మానవత్వమే మిగుల్చుకొన్నావు. నీ ప్రాణంకంటే ఇతరుల ప్రాణాలే ముఖ్యమచేసత్యం నీ దగ్గర లభ్యము మాకు ఆనందం ప్రేమ కలిగించింది. నీ హృదయం ఒక క్షీరసముద్రం. అందులో

ఉదయించే ప్రతిభావమూ సమాజాన్ని రక్షించే అమూల్య సంపద. నువ్వు వెళ్ళిపోవటంతో శానిటోరియం - ఒక ఉత్తము లైన డాక్టర్ను. డాక్టర్ను - మంచి స్నేహితుడినీ, ప్రత్యేకంగా నేను - ప్రియబంధువునీ విడిచి పెట్టుకొన్నట్టు బాధ!'

నాకు చాలా ఆనందం కలిగింది. ఆయన్ని నేను జీవించి వున్నంతకాలం చూస్తూవుండాలని కోర్కె కలిగింది. తృప్తి నిచ్చింది.

'డాక్టర్ వసుమతీ! కాపాడటానికివచ్చి, కాపాడబడి సంతోషంతో ఆరోగ్యంతో వెళుతున్నావు నువ్వు ఉత్సాహ వంతురాలివి; తెలివి కలిగినదానివి - మాధవ్ జీవితాన్ని భద్రంగా కాపాడుకో! నువ్వు మాధవ్ కోసం చేసినత్యాగం, మాధవ్ నీకోసం త్యజించిన స్వార్థం తలుచుకొంటే మీ రేదో కారణంవల్లం జన్మించిన స్త్రీ పురుషులు అనుకొంటున్నాను. మీ రిద్దరూ లక్ష్మీనారాయణులులాగా, ఉమాశంకరులులాగా, సరస్వతీ బ్రహ్మలులాగా, అరుంధతీ వశిష్టులులాగా సుఖసంతోషాలతో, దీర్ఘాయుస్సుతో, పుత్రప్రాప్తితో, ఆనందంతో, ఆరోగ్యంతో అనురాగ హృదయాలతో, అమృతభావనలతో అభ్యుదయంతో, కలకాలం జీవిచండి.'

మేం నమస్కరించాం.

హృదయంలోని భావాలనన్నింటిని మాటల్లో వ్యక్తం చేయలేకపోతే ఆయన కనుకొలుకుల్లో కదిలిన బాష్పకణాలు

ఆ భావాలు వ్యక్తం చేశాయి. 'గుడ్ లక్!' అని ఇద్దరినీ తన బిడ్డలులాగా దగ్గరకు తీసుకొని మళ్ళీ 'గుడ్ లక్!' అన్నాడు.

'నన్ను మృత్యుముఖంనుంచి కాపాడి - నా వసును రక్షించుకొనే సామర్థ్యం కలిగించిన మీకు మేం జీవితాంతం ఋణపడి వుంటాము.'

ఆయన వారించి 'వచ్చేవారంలో తిరుపతిలో జరిగే మీ పెళ్ళికి నేను తప్పకుండా హాజరవుతాను. ఒకవేళ రాలేక పోతే కార్యభారంలేని రోగులబాధామయ నేత్రాలుకానీ నన్ను ఆపివుంటాయని గుర్తుంచుకోండి. - మీ రిద్దరూ మానసిక జాడ్యాలు నయంచేసినా చేయకపోయినా, శారీరకవ్యాధులు, ఏ అపేక్ష లేకుండా, బాగుచేయండి. మానవులకు మనం చేసే సేవ చూచి మాధవుడు సంతోషిస్తాడు. మీ విధి మీరు అప్రమత్తులై నిర్వహించండి' అని ఆయన నేత్రాలలోని అశ్రుబిందువులతో మమ్మల్ని వీడు కొలిపారు.

ఆ రాత్రి మాకు ఆనందంవల్ల నిద్రలేదు. ఉదయమ్ శానిటోరియంలో సంబంధం తెంచికోక తప్పలేదు.

బయలుదేరేముందు వీడ్కోలు చెప్పటానికి వచ్చిన అందరినీ పలకరించి, ఆ ప్రకృతి, అప్యాయంగా చూచే నేత్రాలూ, ఆశీర్వదించే హృదయాలు తనివి తీరా చూచి ముందుకు సాగాము.

నేను నడుస్తూవున్నాను. నా వెంట వసుమతి వస్తూ వుంది. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. తూరుపున తెలిరేకలు కనిపిస్తున్నాయి. దట్టంగా మంచుపట్టివుంది. కొంచెం దూరమయిన మనుష్యులు కనిపించటంలేదు. పొగ మంచులోంచి వెళుతూ వున్నాము.

నన్ను రక్షించిన వసు నావెంట వస్తూవుంది. నా జీవితం దిద్దే వసు నాతో నడచి వస్తూవుంది. ఈమె ఎక్కడో పుట్టింది. నేను ఎక్కడో పుట్టాను. కలసి పెరిగాము. కలసి ఈ బాటలో పయనిస్తున్నాము.

వెళుతున్నాము. అనంతయాత్రలో ప్రయాణంచేసే బాటసారులమె! ఈమె నాతోపాటే వుంటుంది. నా జీవితంలో ఈమె దీపం వెలిగిస్తుంది. నా గుండెలగదిలో చీకటి తరిమివేసి వెలుగు నింపుతుంది.

తన పసుపు కుంకాలతో, గాజు పూసతో, పూల మాలికతో, తాళిబొట్టుతో, మట్టెలతో నాకు పరిపూర్ణజీవితం, ప్రాణం ప్రసాదించబోయే ఈ వసుమతి ఎవరు ?

నేను కాళ్ళవేళ్ళకు తొడగబోయే మట్టెలతో, తలపై అలంకరించబోయే పూలతో తన తనువు సర్వం ఆపాదమస్తకం నా హక్కు చేయబోతున్న ఈ వసుమతి ఎవరు!

నా శరీరంలోని ర క్తం తన నుదుట కుంకుమగా దిద్దు కొని, నాహృదయపుష్పం తన తలపూవుగా ధరించి, నా మన స్సులోని ఆలోచనా వలయాలు, హ స్తకంకణాలుగా నుంచు కొని, నా గుండెలచప్పుడు కీళ్ళ(వేళ్ళ మట్టెలుగా చేసుకొని, నా వ్య క్తిత్వాన్ని తన గుండెలపైన మాంగళ్యంగా మార్చు కొని, నా జీవితమే పునీతం చేయబోయే ఈ వసుమతి ఎవరు?!!

ఇంతకాలం నన్ను చీకటిలో చిక్కుకోకుండా, కంట కాలకు తగలకుండా, బాధలు లేకుండా, చేసి, బతుకుబాటలో పూలు పూయించి, వెన్నెలలు కాయించి, – ఇకముందు అంతా ఆనందంగా, ఆత్మీయతగా, అనురాగంగా, పెనవేసుకుపోయే కళ్యాశి వసుమతి? ఈ వసు నా హృదయం!

పురుషుడు స్త్రీని పరిపూర్ణంగా ప్రేమించిననాడు లోకంలో బాధలుండవు. లోపాలుండవు దేశాలు మారణా గ్నులకు ఆహుతి కావు సర్వసృష్టి ఆనందవేదిక అవుతుంది. ప్రకృతిలాస్యం చేస్తుది. సంగీతం స్రవిస్తుంది.

ఈ వసుమతి ఎవరు? నే నెవర్ని! ఈమె నా కేమవు తుంది? – పోనీ ఈమెకు నేనే మవుతాను!

అన్న – పరిస్థితుల ప్రాబల్యంతో కావచ్చు. బంధు త్వంతో కాకపోవచ్చు. నాన్న – బాధ్యతవల్ల కావచ్చు.

బాంధవ్యంవల్ల కాకపోవచ్చు. కొడుకు - ప్రేమ ఆదరణ సంరక్షణ వీటిమూలంగా కావచ్చు. జన్మకారణంగా కాకపోవచ్చు. బావ - బంధుత్వవల్ల కావచ్చు. భర్త - పాణి గ్రహణంవల్ల కావచ్చు.

ఏమయినా కావచ్చు. కాకపోనూవచ్చు. కాని సత్యం మాత్రం ఇది. ఈమె స్త్రీ! నేను పురుషుణ్ని! స్త్రీ పురుషులలో స్త్రీత్వం - పురుషత్వం మధ్య సృష్టి ఆదినుంచి నేటిదాకా ఎన్ని సంబంధాలు ఉన్నాయో, అ సంబంధాలు చెప్పే ఆత్మ - హృదయం - అంతస్సారం ఏమిటో వాటి కేరూపం వుందో అది మా ఇద్దరి హృదయాలలోనూ వుంది

సమాప్తం







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B194 |
| పుస్తకం పేరు | సౌభాగ్యవతి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 205 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | 1 TO 4 101 TO 106 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |